# రక్తజ్వాల

రెండు భాగములు

(గ్రంథకర్త: సోమరాజు రామానుజరావుగారు)

బెంగాలీనవలగాదు—ఆంగ్లేయనవలగాదు. అనుకరణముగాదు. భాషాంతరీకరణముగాదు. అచ్చమైన ఆంధ్రదేశపు అద్భుతాపరాధ పరిశోధకనవల! మన రాజమహేంద్రనగరము—మన విజయవాడ, మన భద్రాచలపుటడవులు, నిజాము దేశపు నిగూఢ ఘోరారణ్యభూములు—అన్నియు కలిపికొట్టబడినవి ఈనవలలో!—రాజమహేంద్రపురవాసియగు డెటెక్టివు గోవిందరావునాయుడు, అద్భుతమైన మేధాశక్తితో, కవిచే కల్పింపబడినాడు—రక్తజ్వాలా నిగూఢతంత్రమునందు, హత్యాకథారంభమునందే జరిగినది! హత్యచేసిన వ్యక్తినామము ఆఖరుపుటలో గాని బయల్పడకపోవుటేకాక మహాద్భుతమైనను—కథపొడుగునను ఇందలి ప్రతిపాత్రయును హంతకుడేమోయని పాఠకులకు స్ఫురించుచుండు సందేహముల్లుండగా, ఏపాత్ర కాపాత్ర తనవలననే జరిగెనేమోయని సందేహించుట చిత్రములో చిత్రము. జనార్దనరావు అను పేరుగల చిన్న నిరూపకుడు తనయల్పజ్ఞానమునకు తోచినట్లు హత్యాపరాధమును స్థిరపరుపగా గోవిందరావునాయుడు విశేషబుద్ధిచాతుర్యముతో, కేసంతను తలక్రిందులుచేసి నిజమైనహంతకుని పట్టుకొనుట—విచిత్రము. నిరూపకునిమీరిన హంతకునియొక్కయు, హంతకునిమీరిన నిరూపకుని యొక్కయు ఎత్తుకుపై ఎత్తులు—వ్యూహరచనములు అద్భుతావహములు, ప్రతిక్షణమును, ముందేమివచ్చునోయని గుండె లరచేతనుంచుకొని చదువ దగిన భయంకరాపరాధపరిశోధకనవల. ఆంధ్రుల బుద్ధిచాతుర్యము చక్కగా విశదీకరింపబడినది. చదువతగిన నవలారాజము.

ఒక్కొక్కభాగము వెల 0—8—0.

వలయువారు:—కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# యమదూత

( అను )

# హత్యాచతుష్టయము.









గ్రంథకర్త:

సోమరాజు రామానుజరావుగారు.


---


ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్కుడిపో,

బెజవాడ. (కృష్ణాజిల్లా)

రామకృష్ణ ప్రింటింగువర్క్సు, తెనాలి.

1934


 [వెల రు 1-0-0

# విషయసూచిక





# యమదూత

అను

# హత్యాచతుష్టయము.



## మొదటి ప్రకరణము.

### భృగురామసర్కార్.

ఆ దినమున సురారసమును మామూలునకన్న అధికముగ సేవించిన కతమున భృగురామసర్కారు మిక్కిలి యుద్రేకముతో—తనంతటతానే పోలీసుస్టేషనుకు నడచెను. బెజవాడలో భృగురాముని సాహస కార్యములు మితిమీరిపోవుచున్న వృత్తాంతము—రాజమహేంద్రవరమునందలి సుప్రసిద్ధ రహస్యాపరాధపరిశోధకుఁడగు గోవిందరావు చెవిసోకెను. భృగురాముని పనితోపాటుగా మఱికొన్ని కార్యభారములను పైనిడుకొని గోవిందరావునాయఁడు కొన్నినాళ్లనుండియు బెజవాడ అరండల్‌పేటయందు నివాసము నేర్పరచుకొనెను. అతనితోపాటుగా అతనికి కుడిభుజమై పనిచేయు కుఱ్ఱవాఁడగు "దత్తు" నయిత మాతని బసయందే యుండెను.

భృగురామునకు గోవిందరావుపత్తేదారుఁడును—పత్తేదారునకు భృగురాముఁడును క్రొత్తవారుగారు. ఈప్రపంచమున అందరికన్న భృగురాముని బాగుగా నెఱింగినవాఁడు గోవిందరావు పత్తేదారొక్కఁడే!—

అనుక్షణ సురాపానవశమున అగ్నిగోళములవలె మెఱసిపోవుచుండు భృగురాముని కన్నులును—రాతిరంగుగల వాని శిరోజములును—నిర్లక్ష్యభావద్యోతకమై మెఱపుమెఱసినట్లుండువాని చిఱునవ్వును గోవింద రావునాయునికి పరిపూర్ణ పరిచితములు.

గోవిందరావు భృగురాములనడుమ నొకవిచిత్రమైన గౌరవ భావము—అన్యోన్యము బంధింపబడియుండెను. భృగురాముని యలోక ప్రతిభావిశేషమునకు పత్తేదారుఁడు ముగ్ధుఁడయ్యెను—ఏతద్విధానము దుష్కార్యపరతంత్రమై యున్నకతమున సంఘక్షేమమునకొఱకై యాతని దుష్కృత్యముల నరికట్టవలయునని గోవిందరావు ప్రయత్నము—సమర్ధులగు గోవిందరావు పత్తేదారువంటి పోలీసుఉద్యోగులకు తన యమేయ సామర్థ్యముంజూపి—మెప్పునొందవలయునని భృగురాముని ప్రయత్నము—ఇట్టి యన్యోన్యప్రయత్నములవలన—వారిరువురి నడుమను—ఒకవిధమైన యన్యోన్యవిజయకాంక్షాదాహము సముద్భూతమయ్యెను. అది స్నేహమో—శాత్రవమో—

భృగురామసర్కారు గజదొంగ—కాని యాతని జీవితమధ్యమునందెన్నడును అతనినోట నొక్కయసత్యవాక్యమైన వెలువడుట నెవ్వరును ఇంతవఱకు వినియుండలేదు. భృగురాముఁడు హంతకుఁడను మాటనిజమే! ఐనను—అతఁడు—వెనుకనుండి దొంగపోటున నెవ్వరినిఁ బరిమార్చియుండలేదు. అతనిచేఁ జంపఁబడిన నిర్భాగ్యుల వక్షములందక్క—వెన్నుభాగములందు ఎట్టిగాయముగాని—తుపాకిగుండుగాని యున్నట్లెన్నడును గుర్తింపఁబడియుండలేదు. అతఁడు హత్యచేయుట యందు సమర్థుఁడే! ఐనను—తగినంత కారణములేక—యుద్రిక్తుఁడై నిరపరాధులను బోకార్చు హత్యాదాహముగలవాఁడు కాఁడు. సహేతుకములగు నిట్టి గౌరవపద్ధతులతో—నడచుచుండిన భృగురాముని జీవితము—విధివశమున—దుష్కార్యప్రవృత్తమైనందులకు గోవింద

రావు పత్తేదారుడు అతనియెడల సానుభూతినంది తరుచుగా విచారపడు చుండుటగలదు.

*　*　*　*　*　*

పోలీసుకమీషనరగు సర్ హెన్రీఫెయిర్‌ఫాక్సుదొరగారు రాజధానినుండి—అంతకు స్వల్పకాలపూర్వమున బెజవాడలో ఘటిల్లిన యొకానొక హత్యాపరాధమును పరిశీలింపఁదలఁచి బెజవాడకు వచ్చియుండెను. కమీషనర్ దొరవారి వ్రాతబల్లపై—కాగితపుబరువు (PAPER WEIGHT) గా నుపయోగింపబడు కంచుతో చేయబడిన ఏనుఁగుబొమ్మ చాలకాలమునుండియు నుండెను.

అది వసంతకాలపు నొకానొక మధ్యాహ్నసమయము. ఆ దినమున భృగురామసర్కారు తన మధ్యాహ్నకాలభోజనవేళ—మామూలునకన్న నధికముగా—నాల్గయిదు గ్లాసుల విలువగల బ్రాందిని సేవించియుండెను. మధుపానప్రమత్తతయందు భృగురాముని మేధస్సున రాజధానినుండి బెజవాడకునచ్చిన పోలీసు కమీషనరుదొరవారిని స్వయముగా సందర్శింపవలయుననియు వీలైనచో తన ప్రతిభను కొంత యాతనికి రుచిచూపింపవలయుననియు, నొక విచిత్రమగు సంకల్పము జనించెను.

భృగురాముఁ డప్పుడు—కృత్రిమ రూపాంతరమును చేసిని ధరింపలేదు. సాధారణముగ నాతఁడు ధరించు దుస్తులను దాల్చెను. శిరమున నొక పట్టుటోపీని ధరించెను. అద్దెమోటారుకారు నొకదానిని గుదుర్చుకొని మహానందముతో దానియందు దుపవిష్టుఁడై—కమీషనర్ దొరవారి బసకరిగెను. కారుదిగి దొరవారి మందిరపు సింహద్వారము కడకు వచ్చునప్పటికి, అచ్చటి ద్వారరక్షకుఁడగు నొక యారక్షకభటుఁడు భృగురాముని నిలిపెను.

భృగురామసర్కారు తన చిరునామగల చీటి నొకదానిని ఆ రక్షకభటునకిచ్చి—

"మిత్రుఁడా! ఈ చీటిని దయతో కమీషనరుదొరవారికి అందఁ జేయుదువా?" అని యడిగెను.

ఆ రక్షకభటుఁడు విస్మయవీక్షణములతో—చీటివంకను—భృగు రాముని వంకను నిదానించి చూచెను. ఆ భటుఁడు తన సాటివారిలో మిగుల తెలివిగలవాఁడుగను, ద్రోహులవిషయమున అనుభవశాలిగను పరిగణింపఁబడియుండెను. ఇదివఱలో—అనేకవందల పర్యాయములు భృగురాముని బంధించుటకై రాజధానియందలి అందరుపోలీసువారును ప్రయత్నించుటయును, భృగురాముని యాకారలక్షణములు పోలీసు కర్మాగారములందు ప్రకటింపఁబడుటయును జఱిగియుండెను. అట్టి విఖ్యాత చోరశిఖామణి స్వయముగా కమీషనరుదొరవారి నిలయము నకువచ్చి—ఏకాంతముగ దొరవారిని చూడఁదలంచి ప్రవేశమును కోరుటయును చూడగా నాతని కనుమానముగలిగెను. అందుచేత— చోరాగ్రేసరుఁడగు భృగురాముని లోనికిప్రవేశపెట్టుట కాతఁడు సమ్మ తింపలేదు—

భటు—అయ్యా! మీరు నాతో పరిహాసమాడుచున్నట్లున్నారు.

భృగు—నీమాటలు నా కర్థమగుటలేదు. పరిహాసమనగా నర్థమేమి? నేను కేవలము నాచీటిని కమీషనరుదొరవారికి అందఁజేయవల సినదని మాత్రమే కోరితిని. దయచేసి మీ రాస్వల్పకార్య మును నిర్వహించిన చాలును.

భృగురామసర్కారుమాటలను వినినపిదపకూడ—ఆ భటుడింకను తటపటాయించుచుండుటను చూచి సర్కారు మరల గంభీర స్వర ముతో—

"ఇంకను జాగుచేయుచున్నావా?" అనియెను.

భృగురాముని గంభీరాకృతిని, అంతకన్న గంభీరములగు వాక్య ములను వినినపిదప ఆభటుఁడు విధిలేక యాతని యాజ్ఞను పాలింపవల సినవాఁడయ్యెను.

భృగురామునకు జన్మతః—"ఆజ్ఞాపించుట" యనునది యొక వర ప్రసాదము. గంభీరస్వరముతో—అవ్యక్తి యాజ్ఞాపించినపిదప—నిరాకరించుట సామాన్యమానవుల కసాధ్యము. "ఇంకను జాగుచేయుచున్నావా? అని యతఁడు పలుకుటతోడనే యాభటుఁడు చకితుఁడై మందిరాంతరాభిముఖుఁడై పోయెను.

భటుఁడు కమీషనరుదొరవారి తలుపుతట్టుటతోడనే ద్వారము వివృతమయ్యెను. తలుపు తెరచినది కమీషనర్ దొరవారే! భటుఁడు దొరవారికి సలాముచేసి చీటి నందించెను. దొరవారు దానినిచూచి యాశ్చర్యపడుచుండఁగనే, సర్కారు తన టోపీనితీసి చేతఁబట్టుకొని ధైర్యముతో సలాముచేయుచు

"సర్ హెన్రీదొరవారు నన్ను క్షమింతురుగాక! నా చిరునామ పత్రమువలన నన్ను భృగురామసర్కారునుగా తమరు గ్రహించి యుందురు. కాని, నన్ను సాధారణముగా "సర్కారు" అనియే పిలుచుచుందురు. నేను తమకడకువచ్చినపనిని సూక్ష్మముగా రెండుమూఁడు మాటలతో తేల్చివేయఁ దలఁచుకొన్నాను." అని పలికెను.

సర్ హెన్రీఫెయిర్ ఫాక్సు కమీషనర్ దొర—సామాన్యవ్యక్తి కాఁడు. ఆజ్ఞాపించుట యను తత్త్వ మాతని శల్యములలో జీర్ణించిన విషయము. భృగురాముని మాటల నాతఁడు లక్ష్యపెట్టకుండ, పోలీసు భటునివంకఁజూచి

"ఇతనిని—నాయాజ్ఞ లేకుండ నీవు నాయేకాంత భవనమునకు రానిచ్చుటలో నీయభిప్రాయ మేమి?" యని యడిగెను.

ఆమాటకు భటుఁడు ప్రత్యుత్తర మీయకముందే—సర్కారడ్డమువచ్చి—

"కమీషనర్ సాహెబ్! ఆయపరాధము సంపూర్ణముగా నాది గాని, యాభటునిదిగాదు. నేను విఖ్యాతినందిన ప్రాఁతనేరస్థుఁడనని

యెఱింగి ఆభటుఁడు—నన్ను బయటనే నిలుపుటకు తనకు చేతనైనంత ప్రయత్నము చేసెను.” అనియెను.

కమీషనరు—అతని యాపాదమస్తకమును పరిశీలించిచూచెను.

కమీ—ఏమి? నీవు విఖ్యాతినందిన ప్రాఁతనేరగాఁడవా? నీయభిప్రాయమేమి?

సర్కారు దొరవారిమాటలకు విషాదపూరితమగు నొకచిఱునవ్వు నవ్వెను.

సర్కా—చిత్తము—అందు సందేహమేమియును లేదు. కాని—నాసమర్థతను, నేను కొంచె మతిశయముగా వాకొనియుందును. ఐనను—పోలీసువారి కందఱకును నాపేరు పరిచయమై యుండుననియే నా నమ్మకము.

కమీషనరు కార్డుపైనున్న యాచోరాగ్రేసరుని నామమును స్మృతికిఁ దెచ్చుకొనుచుండెను. “భృగురామసర్కారు—ఓహో! నీవా?-ఎసోసియేటెడు బ్యాంకువారు ఎవ్వనిని బంధింపగల్గినచో—ఐదు వేల రూపాయల బహుమానము నిచ్చెదమని ప్రకటించిరో—యా చోరాగ్రేసర చక్రవర్తివేనా నీవు?” అని యడిగెను.

సర్కా—చిత్తము—వాఁడేవీఁడు—

కమీ—అట్లయిన ఇప్పుడు నీయంతట నీవు బంధింపఁబడుటకే వచ్చియుంటివా?

సర్కారు—కమీషనరుమాటలను విని చిఱునవ్వు నవ్వెను. అతని రక్తనేత్రములయందు ఆనందకరమైన కాంతి ప్రకాశమానమయ్యెను.

సర్కా—కమీషనర్ సాహెబ్! నేనందులకై వచ్చియుండలేదు. మఱియెందుల కందురా—నేడు నేను భోజనముచేయుచుండఁగా—తమ బల్లపైన కాగితపు బరువుగా నుపయోగపడు కంచుయేనుఁగుబొమ్మ జ్ఞప్తికివచ్చినది. అది మిగుల సుందరమైన

విగ్రహామగుటచేత—దానిని తస్కరించుకొని పోవఁదలంచి యిచ్చటికి వెంటనే వచ్చితిని.

ఇట్లు పలికి—కమీషనరు ప్రత్యుత్తరమున కభిలషింపకయే సర్కారు కమీషనరుబల్లమీఁదనున్న యేనుఁగుబొమ్మను దీసి దానిని మిక్కిలి మెచ్చుకొనుచున్న భావములతో పరిశీలించి చూచుచు

"అయ్యా! ఇది బహుశః బర్మాదేశపు శిల్పమైయుండును" అనియెను.

కమీ—హుస్సేన్! ఇతనిని మనపరిసరములనుండి ఆవలకు బంపివేయుము.

సర్కారు నిరుత్సాహదృక్కుల కమీషనరువంకకుఁ జూచెను.

సర్కా—కమీషనర్ సాహెబ్! అధమపక్షము—మీరు నన్ను ఎరెస్టు చేయుదురనియైన ఆశపడితిని.

కమీ—(నవ్వుచు) "నేనుదొంగను—నన్ను ఎరెస్టుచేయు" మని వచ్చిన ప్రతివానిని మేము నిర్బంధించుచున్నయెడల ఇదివఱకే మాకారాగృహములన్నియు నిండిపోయి యుండును. నీవు "సర్కారు" అను పెద్దపేరును నీనామముతో జోడించుకొని నాగిరికజనోచితముగా కార్డునుపంపి నన్ను దర్శించితివి. కాన నేనింతశీఘ్రముగా నిన్ను నిర్బంధింపఁజాలను.

ఇట్లు పలుకుచు కమీషనరు తనకలమును చేబూని ఏదియోవ్రాయ నుద్యమించినట్లు తన వ్రాతబల్లవద్ద కూర్చుండి "హుస్సేన్! ఇతనిపని ముందుచూడుము" అనియెను.

సర్కా—కమీషనర్ సాహెబ్! ఒక్కక్షణము తాళవలెను. కొన్ని నాళ్లక్రిందట—ఈయూరిలోజఱిగిన యొకానొక ఖూనీకేసువిష యమును మీరెఱుంగుదురుగదా! హతుఁడైనవాఁడు—ఈపట్ట ణముననున్న ఇంచిపేటలో నొకయింట మేడకు ఉరిపోయఁబడి చంపఁబడెను. అతని యెదురుఱొమ్మునందొక పేకముక్కయుఁ పఁబడియుండెను. ఇది నిజమేకాదా?—

కమీషనరుదొర—తనచేతిలోని కలమును బల్లపై జారవిడచి కుర్చీకి చేరఁబడెను. సర్కారుప్రకటించిన రహస్యాదంతమున కాతఁడమి తాశ్చర్యచకితుఁడయ్యెను.

కమీ—నేనుగాక—మఱియొక్క వ్యక్తిమాత్రమే—యీప్రపంచక మున—ఆకార్యసంగతి నెఱింగినవాఁడని నేను తలంచియుంటిని. ఆవ్యక్తి హంతకుఁడుతప్ప—మఱియొకఁడు కాఁగూడదు.

సర్కా—దొరవారికి—ఇప్పుడు నాయందు ఆసక్తిగల్గెనని తలంతును.

కమీ—నిశ్చయముగా—

సర్కా—(చిఱునవ్వు నవ్వుచు) ఈయభియోగమునందు........దయ చేసి మీభటుని ఆవలనుండుమని కోరుఁడు.......మిగత సంగ తుల నెఱిఁగింతును.

కమీ—(అనుమానదృక్కులఁ జూచుచు) నాభటుని ఆవలనుండుమని యేల కోరవలెను?

సర్కా—ఎందులకనగా—నేను మీయేనుఁగుబొమ్మను దొంగిలించు కొని పోదలఁచివచ్చితిని. ఆపనిలో నాకీతఁడాటంకముగా నుండు నేమోయని నాభయము. సర్కారుమాటలకు సర్ హెన్రీదొర హృదయపూర్వకముగా నవ్వెను.

కమీ—మొత్తముమీఁద నీవొక హాస్యగాఁడవువలెనే యున్నావు!— మొదటి నీయంతట నీవే మాదగ్గఱకువచ్చి—"మీరనేకదినముల నుండి వెదుకుచున్న చోరశిఖామణిని నేనే" యని చెప్పితివి! ఇప్పుడు "నీయేనుఁగుబొమ్మను దొంగిలింపఁ దలంచితి" నని చెప్పుచున్నావు! నీవొక యుత్సాహముగల్గించు పురుషుఁడవే! కనుక—నీవు చెప్పఁదలంచిన సంగతులను వినవలసినదే!

ఇట్లు పలుకుచు దొరగారు తనవ్రాఁతబల్లసొరుగులోనుండి చిన్న తుపాకి నొకదానిని బయటకుఁదీసి చేతఁబట్టుకొని తన భటునివంకకుఁ

దిరిగి "హాన్స్టేన్! నీవు కొంతసేపు బయటనుండుము—కాని విశేష దూరముమాత్రము పోవలదు. తిరిగి నేను నిన్ను పిలుతునేమో!" అని పలికెను.

భటుఁడు యజమానియాజ్ఞను శిరసావహించి తలుపువేసి బయటికిఁబోయెను. పిదప దొరవారు సర్కారువంకకుఁదిరిగి—

"మంచిది! ఇఁక నీవిప్పుడు ఇంచిపేట హత్యావివరముల నెఱిఁగింతువా?" అని పలికెను.

సర్కా—చిత్తము — ఆనందముతో — తెలియఁజేయుదును. కాని అయ్యా! ఇప్పుడు నేను తమ ఏనుఁగుబొమ్మను దొంగిలించు ప్రయత్నమునందున్నాను గనుక—నేను చెప్పఁదలంచినది చెప్పిన తరువాత నాపనినిగూడ నేనొనరించుకొనుటకై నాకు కొంత యవకాశము నీయవలెను.

సర్ హెన్రీదొర చమకితుఁడయ్యెను.

కమి—నాయేనుఁగుబొమ్మ విషయమై నీవు నన్ను గందరగోళపరచుచున్నావు. ఇంతకును అది పరిహాసమో—నిజమో నాకు బోధపడుటలేదు. ఏమైనను అది చాల స్వల్పవిషయము. ఇప్పుడు మనము ప్రసంగించు నితరవిషయమునకును దానికిని సంబంధము లేదు. ఆసంగతి ముందుకానిమ్ము.

సర్కారు తానొక మందమతివలె నటించుచు—

"ఇంకను ఇతరవిషయ మనగా నేది?—" అనిపలికి వెంటనే స్మృతికిఁదెచ్చుకొనినవానివలె "ఓహో! ఔను. ఇంచిపేట హత్యసంగతి—ఈహత్యచేయఁబడిన రాఘవుఁడనువానిని నేను కొన్నినాళ్లనుండియు ఎఱుఁగుదును. వాని నిజమైనపేరు వీరరాఘవులు. పాపము వాఁడు హత్యచేయఁబడవలసినంత దుర్మార్గుఁడుకాఁడు. తుదకైననేమి?

హత్యచేయఁబడినాఁడు. ఇదియంతయు—మీ రెఱిఁగిన సంగతియే అనుకొందును.” అనియెను.

కమీ—ఈసంగతులను నేనెఱుఁగుదును. నీవు నే నెఱుఁగని సంగతులను చెప్పుము.

సర్కా—చిత్రము—చిత్రము—ఇదిగో— ఆ విషయమునకే వచ్చుచున్నాను.

ఇట్లని సర్కారు—విశాలమైన యాగదియందు నాల్గుమూలలకును పరిచారముచేయుచు “ఈహత్య—ఇంచిపేటలో జఱిగిన యీ దారుణమైనహత్య—ఇంతటితో విరమింపఁబడునదికాదు. రాఘవుని హత్య యిప్పుడు జఱిగిపోయినది. ఇతనితరువాత వరుసగా—ఒకరితరువాత నొకరుగా—మఱికొందఱు హత్యచేయఁబడుటకు సిద్ధముగానున్నారు.” అనియెను. ఇట్లుపలుకుచునే యతఁడు తానున్నగదికిగల యావలిద్వారముం దెరచెను. ఆవల మఱియొక విశాలమగుగది కలదు. ఆగదియందు కొందఱు గుమాస్తాలు—తీరుబడిలేని సర్కారుపనులయందు నిమగ్నులై యుండిరి. సర్కారు ఆద్వారముం దెరచి—యావల గదిలోనికొకసారి చూచి వెంటనే కమీషనరువంకకుఁ జూచి,

“అయ్యా! దయచేసి తమరు నావెంటరావలెను.” అనియెను.

కమీషనరు తన రివాల్వరునుదీసి కోటుజేబునందు భద్రపరచుకొని సర్కారువద్దకు—ఆవలిగదిలోనికిఁ బోయెను.

ఆగదిలో ఇరువురు మగగుమాస్తాలు—తమ యెదుటనున్న సర్కారు కాగితపుకట్టలను తిరుగవేయుచు నెద్దియో నిరంతరాయమగు కార్యమున నిమగ్నులై యుండిరి. వారికి స్వల్పసమీపమున నొకటైపిస్టు కాంత కొన్నియవసరములగు కాగితములను టైపు చేయుచుండెను. సర్కారు తద్విషయముల నన్నిటిని ఒకకంటఁజూచుచు కమీషనరునకు వినఁబడువిధమున తనలో—

"ఊహూఁ—ఈగదిలోనుండి నేను తలంచిన దృశ్యమును మీకు చూపఁగల్గుదునని తోఁచదు." అనుకొనెను—

ఒక క్రొత్తపురుషుఁడు తనలో తానేదియో గొణుగుకొనుచు తమ కచేరిగదిలోనికివచ్చి తన యిచ్ఛవచ్చినట్లు తిరుగుచుండుటయు ఆపురుషునివెంట కమీషనరుసాహెబే స్వయముగా వచ్చుటనుగాంచి యాకర్మచారులు విస్మయముతో—భృగురామసర్కారువంకకుఁ జూడదొడంగిరి.

తుదకు సర్కారు ఆగదిలోని యొకగవాక్షమునుండి బయటి దూరస్థదృశ్యముం బరిశీలించుచు కొంతతృప్తిని ప్రకటించి—

"ఆఁ—బాగున్నది. అయ్యా! తమ రిట్లు దయచేయుఁడు. నేను నిలువఁబడియున్న చోటునుండి ఆదృశ్యమును తమరు పరికింపఁగలరు.—ఒక్కసారి పరికించుటమాత్రమే—" అనియెను. ఆదృశ్య మేమో యరయవలయునను ఆశతో కమీషనరు అతని వెనుకకువచ్చి నిలువఁబడెను.

సర్కా—హెన్రీదొరగారూ! దయచేసి తమరు కొంచెము ఎడమ ప్రక్కకువచ్చి యీకిటికీలోనుండి నాప్రేలికిసూటిగా పరికింపుఁడు.

దొరగారు సర్కారుచెప్పిన విధముగా కిటికీనుండి చూచెను. అచ్చట నేమియున్నది? ఈభృగురామునకు వెఱ్ఱియాయేమి?

అంత సర్కారు "దొరగారూ! ఇప్పుడు కార్యము సానుకూలత నందఁగలదని నానమ్మకము"అనిపలికి కమీషనరు గవాక్షమార్గమునుండి యింకను బయటికి చూచుచుండఁగనే తటాలున తాను వెనుకటిగదిలోనికి వచ్చి గవాటబంధనమొనరించి దానికి తాళమువేసి వేగముగ అచ్చటి కమీషనరు బల్లపై నుండిన కంచుయేనుఁగుబొమ్మను సంగ్రహించి తన పట్టుటోపీయందు భద్రపరచి ఆగదిని వదలి బయటివీధిలోనికి వచ్చెను.

వెనుకటి కాన్‌స్టేబిలగు హాన్సేను అచ్చటనేయుండెను. సర్కారు హాన్సేనుంగాంచి "మిత్రుఁడా దొరవారితో నాపని యైపోయినది. నాకు సెలవు" అనిపలికి బయటికి రెండడుగులు నడచెను. ఇంతలో కమీషనర్ దొరవారి డ్రైవరు కారునునడుపుకొనుచు అతని కభిముఖముగా వచ్చెను. సర్కారు వెంటనే తనమొగమునందెట్టి భావమై రుద్యమునుఁ గన్పడనీయక—డ్రైవరునుచూచి కమీషనరునకు మిత్రుఁడగు నొకపెద్దమనుష్యునివలె—"డ్రైవర్! నన్ను మాయింట విడువవలసినదిగా దొరవారు నీతో చెప్పుమన్నారు" అని పలుకుచునే కారులో కూర్చుండెను. డ్రైవరామాటలను విశ్వసించి విధేయుఁడై తనస్థానము నలంకరించెను. సర్కారు కమీషనరుకారులో పోవుచు పోవుచు కాన్‌స్టేబిలు హాన్సేనును చూచి చిఱునవ్వు నవ్వి—

"హాన్సేన్! పాపము దొరగారింకను ఆ పాడుతలుపుతో శ్రమపడుచున్నారుకాబోలును, నీవు వెళ్లిసహాయముచేయుట మంచిదేమో" అనియెను.

హాన్సేను అనుమానముతో—"ఏమి? నీమాట నాకర్థమగుట లేదు" అనియెను. సర్కారు నవ్వెను. "మఱేమియును లేదులే! దొరగారిని వదలి నేను వచ్చునప్పటికి వారు, తమ కచేరిగదికిని, గుమస్తాల గదికిని నడుమనున్న తలుపు తెఱచుటకు చాల శ్రమపడుచున్నారు. నీవు త్వరగా వెళ్లవలెను." అని పలికెను.

"తలుపు" అని మాత్రమే చెప్పెనుగాని, జఱిగిన చిత్రకథనెఱిఁగింపక, సర్కారు హాన్సేనును మభ్యపఱచి—డ్రైవరునుచూచి—"వెల్కం హోటలుకు పోనిమ్ము." అని యాజ్ఞాపించెను. చూచుచుండగనే—కారు దృష్టిపథము నతిక్రమించిపోయెను. హాన్సేను వేగముగ కమీషనరు గదివంకకు నడచెను.

వేగముగ నడచుచున్న కారునందు సావకాశముగఁ గూర్చుండి సర్కారు మంచిసిగరెట్టు నొకదానిని వెలిగించి కారుయొక్క వెనుక

గవాక్షమునుండి కమీాషనరు నివేశనమువంకకు జూచెను. అచ్చట ఆందోళనపడుచు తన్ను నిర్బంధించుయత్నమున గుంపులుగాఁ గూడిన గుమాస్తాలును ఆరక్షకభటులును కొందఱు పౌరులును ఆతనికిఁ గాన్పించిరి. అదృశ్యముంగనుటచే గల్గిన యానందగర్వమున నాతఁ డొక చిఱునవ్వునవ్వి ఏనుఁగుబొమ్మనుదీసి చేతనుంచుకొని దాని నటునిటు పరిశీలించెను. అంత నాతఁడు తనలో—"ఈకాగితపుబరువుబొమ్మతో నిజముగా నాకంత యవసరముండదు. కాని భృగురామసర్కారు ఎట్టివిచిత్ర చోరాగ్రేసరుఁడో—యను విషయము కమీాషనరుగారికి తెలియుటకీ నిర్జీవజంతువు సహాయకారియైనది. ఐనను ఇదియంత విసర్జింపఁదగిన పదార్థముకాదు. శిల్పము చాల విలువగల్గినది." అని తలంచుచుండెను.

ఇంతలో కారు వెల్కంహోటలునకెదురుగా నిలిచెను. అచ్చట కారు నవతరించుటకు సర్కారభిలషింపలేదు. అతని యభిప్రాయ మప్పటికి మారిపోయెను. "డ్రైవర్! అరండల్‌పేటలోని అపరాధరహస్యపరిశోధకుడగు గోవిందరావురాయడుగారియింటికి పోనిమ్ము. నేను వారిని దర్శింపఁగోరుచున్నాను." అనియెను. అచ్చటనుండి డ్రైవరు కారును అరండల్‌పేటకు మరలించెను.



## రెండవ ప్రకరణము.

### గుమ్మములోనే.

డిటెక్టివు గోవిందరావునాయని చూచుటకు—చోరాగ్రేసర చక్రవర్తియగు భృగురామసర్కారును, ఆతని సహజ నిర్లక్ష్యధైర్య స్వభావమెంత వేగముతో చరించెనో—అంతకన్న నధికవేగముతో కాల దుష్పరిణామపరిస్థితులాతని ముందుగా నడచుచుండెను.

కారు నిరూపకునియింటిముందర నిలచినతోడనే భృగురాముఁడు మిగుల దర్పముతో—నొక పదిరూపాయల కరెన్సీనోటును డ్రైవరు

చేసనిడెను. వాఁడు దానిని గై కొనుటకును గై కొనకుండుటకునుతోఁచక తటపటాయించుచు—ఏదియో చెప్పఁబోవుచుండఁగనే సర్కారు రాజదర్పముతో నాతని యుద్యమము నడ్డుకొని ధీరతాభరితమగు సౌజ్ఞామాత్రిమున దానిని గై కొనిపొమ్మని సూచించుచు చేయివిసరి చేతికట్టను విలాసముగ నూగులాడించుచు మందిరాభిముఖుఁడయ్యెను.

గుమ్మములోనే గోవిందరాయభృగురాము లన్యోన్యము ఎదుర్కొనిరి. అంతకుపూర్వమే—సర్కారు తన్ను చేసిన మోసవ్యవహారము నంతను కమీషనరు టెలిఫోనుమూలమున గోవిందరాయని కెఱిఁగించి యాతనిఁ దనకడకొకమారు రమ్మనికోరియుండెను.

కమీషనరుదొరవారినిదర్శింప నరుగుచున్న గోవిందరావు—తన శిష్యుఁడగు దత్తుతో నేదియో చెప్పఁబోవుచు గుమ్మములోనికి వచ్చినంతనే నెదుకబోయినతీఁగె కాళ్లకుఁజుట్టుకొనినట్లు—భృగురాముఁడే వచ్చుట యాతనికెంతయాశ్చర్యమును గల్గించెనో—అంతయాశ్చర్యము గోవిందరావు దర్శనము తనకు గుమ్మములోనేయగుటవలన భృగురామునకు నయితము కలుగకపోలేదు. వారిరువురును ఒకరినొకరిదివఱకే యెఱింగియుండిరి; కావున ఆయాశ్చర్యమునందు వారిరువురి నోళ్లనుండియు ఏకకాలమునందే విస్మయసూచకమగు నవ్యక్తవాక్యములేవియో వెలువడెను.

వెంటనే గోవిందరావు కుడిచేయి యాతని కోటుజేబులోనికి బోవుటయు—ఆయుత్తరక్షణమునందే చేతనొక రివాల్వరు కనఁబడుటయు జఱిగెను. ఆకృత్యమునకు జవాబు వచ్చెనోయన్నట్లు భృగురాముఁడును ముడువఁబడియున్న తన పిడికిలిని విప్పగనే—అదివఱకే యందిమిడియున్న చిన్న రివాల్వరు తళుక్కున మెఱసెను.

సర్కారు పకపక నవ్వెను. నవ్వి—"వేళాకోళము" అనెను.

గోవిందరావు—ఇదివఱకే చిఱచిఱలాడుచుండెను. అతనిక్రోధజ్వాలను, భృగురాముని ప్రవర్తన మఱింత వృద్ధిజేసెను.

ఆసమయమున, వీధివెంటఁ జనుచుండిన యొకరిద్దఱు మూర్గస్థులీ చిత్రమునుచూచి, వారిరువురు పరిహాసము లాడుకొనుచున్నారనితలంచి తమలోఁ దాము నవ్వుకొనిరి.

కాని, డెటెక్టివు మొగమునందలి యానంద చిహ్నము లదృశ్యమయ్యెను. దానిని గ్రహియించి— సర్కారు తాను వేళాకోళముగా ప్రవర్తించుచున్న వైఖరిని తన నవ్వువలన స్థిరపరుపఁజూచెను.

గోవిం—సర్కార్! నీవు నటించుచున్న రీతిగా—ఇది పరిహాసమని, నేను తలంపను. పోలీసుభటులువచ్చి, నిన్ను బంధించునంతవఱకును నేను నిన్నిచ్చట నిలిపెదను. నీవు ... దిప్రయత్నముగా— నాపై నొక తుపాకిగుండును ప్రయోగింపఁ ...లపవచ్చును. కాని అప్పటికి నీచేతులు నీస్వాధీనమున నుండక, సర్కారువారి నిగళములచే గట్టఁబడియుండునని తెలిసికొనుము.

భృగురాముఁడు నవ్వెను. సురాపానమువలన ఎఱ్ఱనయిన ఆతని కన్నులలో—పిశాచికమగు నొక రక్తకాంతి ప్రజ్వలించి పోవుచుండెను.

భృగు—నాప్రియసోదరుఁడా! నీవు నన్ను బంధించుటకై పోలీసువారి కొఱకై కబురంపితివా? ఔను—పోలీసువారుకనఁబడక, నాకును చాలదినములనుండి—బెంగపెట్టుకొనినట్లున్నది. ఇటుచూడుము!—ఈదినమున—నాభోజన సమయమునందు నాకొక కోరికగల్గినది—విపరీతమైన యాకోరిక ప్రకారముగా నేను వెంటనే బయలుదేరి రక్షణ భటాగారమున కరిగితిని. అచ్చట కమిషనర్ దొర వారి బసలో—నేనొక పోలీసు అధికారిని దర్శించితిని—అతఁడు గొప్పపదవియందున్న యధికారియే కాని—డెటెక్టివ్ మహాశయా! అతఁడు వట్టి బుద్ధిహీనుఁడు సుమా! అతనిబల్లపై కాగితపుబరువుగా నుపయోగింపఁబడుచుండిన కంచుగజవిగ్రహమును తస్కరింపవలెనని నేను సంకల్పించితిని! మిత్రుఁడా! ఈభృగురాముఁడు సంకల్పసిద్ధుఁడు. సంకల్పించితినో—సిద్ధినంద

వలసినదే!—నా యెడమచేతిలోనున్న యీవస్తువే ఆగజవిగ్ర
హము!—వింటివా?—

చుట్టును యాతాయాత జను లనేకులు గుమిగూడియుండిరి! ఆ
సంభాషణము నాలకించినకొలదియు వారికి పరమోత్సాహముఁ గొల్పు
చుండెను. ఆ పోలీసుఅధికారి ప్రసిద్ధనిరూపకుఁడగు గోవిందరావునాయఁ
డనియును, రెండవవాఁడు ప్రసిద్ధచోరాగ్రేసరుఁడగు భృగురాముఁడని
యును, వారెటింగియేయున్నను వారి చేతులందుగల యాయుధములు
గుండ్లతో నిండియున్నవని వారు విశ్వసింపఁజాలకపోయిరి. ఏమనఁగా—
భృగురాముని సంభాషణవైఖరియు, ముఖలక్షణములును—మిత్రునితో
పరిహాసములాడుచున్నట్లున్నవిగాని—శత్రు నెదుర్కొనినట్లులేవు.

భృగురాముఁ డిప్పుడు మరణమునకు మిక్కిలి సన్నిహితుఁడై
యున్నాఁడు. ఆసంగతి—గోవిందరాయ నిరూపకునకును—భృగురాము
నకునుఁగూడ ఎవరియాత్మలలో వారికి తెలియును. కాని, భయంకర
మైన యేతద్భావ కల్లోలమును భృగురాముఁడురవ్వంతయైనను తనముఖ
మునఁ బ్రకటపరచుటలేదు.

భృగు—మిత్రమా! ఆనందకరముగా జఱుగవలసిన మన యిప్పటి సంభా
షణము—మన యిరువురి చేతులలోనున్న రివాల్వరులతోసహా—
జఱుగవలసి వచ్చినందులకు నాకు చాల విచారముగా నున్నది.
నే నొక ముఖ్యమైన విషయమును—పోలీసువారికి అత్యంత
ప్రయోజనకరమైన విషయమును తెలియఁజేయఁదలఁచి నా
యదృష్టవశముననో— కాక దురదృష్టవశముననో—స్వయముగా
నిచ్చటికి వచ్చితిని. ఆవిషయ మేమందువా—అది "యించి
పేట హత్య"తో సంబంధించిన రహస్యము............కాని,
నీసహచరుఁడు నన్ను బంధించుపోలీసుభటులను గొనివచ్చుటలో
చాల నాలస్యము చేయుచున్నాఁడు......మంచిది—ఇప్పుడు
మనమేమి సంభాషించుచున్నాము?......సరి—జ్ఞప్తికివచ్చినది.

ఇంచిపేట హత్యావిషయము! ఇంచిపేటలో, నొకయింట— నొక అభాగ్యుడు బలమైనత్రాడు మెడకు ఉరిపోయబడి హత్య చేయఁబడిన దృశ్యము పోలీసువారి కంటఁబడినది! గోవిందరావుగారూ! పోలీసువారెఱింగినది ఇంతవఱకుమాత్రమే! కాని నేను—వినుచున్నారా!—నేను—ఇంచిపేటలో భయంకరమైన ఆహత్యచేసినవాఁ డెవఁడో యెఱుంగుదునుసుమా! కమీషనర్ దొరయగు, సర్ హెన్రీఫెయిర్ ఫాక్సునకు నేను ఇదేవృత్తాంతము నెఱిఁగించితిని. కాని, యాదొరగారు—ఆహత్యచేసిన హంతకుఁడను నేనేయని అనుమానపడిరి. బుద్ధిశాలివగు నీవును అట్టి దురభిప్రాయమునఁ బడకుందువుగాక! హంతకుఁ డెవఁడై యుండునదియును నేను కేవలము నాబుద్ధిశక్తిచే నాలోచించితిని! ఆహత్యచేసినవ్యక్తి—మనకొక యమూల్యమగు ఆధారమును వదలినాఁడు!........ఆఁ—అదుగో!—గోవిందరావుగారూ! అదుగో!—మీపోలీసుభటుఁడు రానేవచ్చినాఁడు!—ఇంక నేను మిమ్ము విడిచిపోవలసియుండును గాఁబోలును! కనుక, సూక్ష్మముగా—నాసంభాషణమును తెమల్చెదను!—ఆహంతకుఁడు వదలిన యాధారము కేవల మొకసామాన్యవస్తువు! అదియొక చీట్లపేకముక్క—అది హత్యచేయఁబడినవాని ఱొమ్మమీఁద నుంపబడినది! అది బహుశః కళావరునాల్గో—డైమనునాల్గో కావలెను—ఏరంగులోనైనను, మొత్తముమీఁద—అది నాల్గుముక్క కాక తప్పదు!"

అప్పటికి—చుట్టునున్న జనసమూహము మితిమీరియుండెను. సర్కారును బంధించుటకై వచ్చిన భటుఁడు ఆయసంఖ్యాకజనసమూహమును తప్పించుకొని యతిప్రయాసమున లోనికి రాఁగలిగెను. అతనిని చూచి సర్కారు శాంతస్వరముతో— "ఇటు—కాన్ స్టేబిల్—ఇటు రమ్ము." అనియెను.

కానిస్టేబిల్‌ను గొనివచ్చుటకై చనిన గోవిందరావు సహచరుఁడగు దత్తు—ఇదివఱకే—సర్కారు రూపలక్షణముల నెఱింగించియుండె నందున, ఆకానిస్టేబిలు అంతగా నాతనిగుర్తించుటకు ప్రయాసపడలేదు. పోలీసుభటుఁడు సర్కారుచేతనున్న 'రివాల్వరునుఁగాంచి భీతిల్లక—పొడవైన తన తుపాకీని సర్కారు వక్షమున కెదురుగా నుంచెను. ఆరక్షకభటుఁ డొనరించిన యీకృత్యము—సర్కారును బంధించుటకన్న—ఆతని పలాయనమునకే—అధికప్రయోజనకారి యయ్యెను.

భటుఁడు తుపాకీని తన గుండెల కెదురుగా నుంచినపుడు, సర్కారు భీతిల్లినచందమున—వెనుకకు రెండడుగులు వేసెను. చుట్టును జనులు గుమిగూడి యీచిత్రమును చూచుచుండిరి. ఉన్నట్టుండి—సర్కారు తనరివాల్వరును పైకెత్తి గాలిలోనికి "ఢా" మ్మని ప్రేల్చెను. ఆశబ్దమునకును—అటఁ గ్రమ్ముకొనిన పొగకును, జనులందఱును గంద్రగోళపడిపోయిరి! సర్కారు పూర్వమునందున్న ప్రదేశమున నిప్పుడు కాన్పించుటలేదు. చుట్టునుఁ గ్రమ్ముకొనిన జనసమూహ మధ్యమునంబడి యాతఁడు పలాయితుఁడు గాఁదొడఁగెను. జనసమూహమును దాటి బయటఁబడినంతనే, అకస్మాత్తుగా రివాల్వరుతోసహా—దత్తు—సర్కారున కెదుట గాన్పించెను. ఆతొందఱలో నాతని కేమిచేయుటకునుఁ దోఁపక బలమైన యొకదెబ్బలో—దత్తుచేతిలోని రివాల్వరు దూరముగాఁ బడునట్లొకదెబ్బఁ గొట్టెను. దత్తు రివాల్వరును వెదుకుకొను నందడిలోనుండఁగనే యాతఁడు సాధ్యమైనంత వేగమున పఱుగెత్తనారంభించెను. పోలీసుభటులు తుపాకులను ప్రేల్చుచు, తనవెంట పరుగెత్తుకొని వచ్చుచుండగనే వానినన్నిటిని—ఉపాయమున తప్పించుకొనుచు, సర్కారు సందు గొందులంబడిపోవుచు, తుదకొక మోటారుబస్సు నెక్కెను. దానినిగాంచి పోలీసువారు—తమయీలలనూదుచు బస్సును నిలుప నాజ్ఞాపించుచు వెంబడించిరి. బస్సులోని వారెవ్వరును సర్కారు తమ బస్సునెక్కిన సంగతినిగాని, తమ్ము నిలుపనాజ్ఞాపించిన హేతువును

గాని మెఱుంగకయే—బస్సును నిలిపిరి. దీనినిగ్రహించి సర్కారు బస్సు నిలుచుటకుముందే దానికెదురుగావచ్చుచున్న మఱియొకబస్సును తటాలున నందుకొనెను. ఇప్పుడు—సర్కారు పారిపోయెనని పోలీసు వారు తలంచిన దిక్కున కభిముఖమైన దిక్కునందు సర్కారు ప్రయాణము చేయుచుండుటచేత, పోలీసువారి కాతనిని పట్టుకొనుట దుస్సాధ్యమైపోయెను. కమీషనరు దొరవారియింట తస్కరింపఁబడిన కంచు గజవిగ్రహ మిప్పటికింకను సర్కారుచేతనే యుండెను. ఇప్పటికాతఁడు కొంతభీతినిమాని గజవిగ్రహముతోపాటు రివాల్వరునుగూడ తనజేబులో నుంచుకొని యొక యాసనమునఁ గూర్చుండెను. అతఁడు మిగుల నాత్రముతో—ఆబస్సునందెక్కినసంగతిని, బస్సులోని యొరికద్దలు మార్గస్థులుమాత్రమే చూచిరి. చూచినను, ఎవ్వఁడో కార్యావసరము గలవాఁడు తొందరగా బస్సునెక్కెనని మాత్రము తలంచిరి.

ఐనను— సర్కారున కనుమాన మింకనుతీరలేదు. అతని నెత్తిపై నున్న పట్టుటోపీ— పోలీసువారిచే గుర్తింపఁబడుట కొక సాధనముగా నున్నది. దానిని తీసివేయుదమన్నను, అంతకన్న నధికమగు నాధారముగా— ఆతని బట్టతలయొకటి, ప్రమాదకారి కాఁగలదు.

అందుచే నాతఁడు వెంటనే బల్లమీఁద కూర్చుండక బల్లదిగి క్రిందఁ గూర్చుండెను. ఇంతలో బస్ కండక్టరు (Bus Conductor) వచ్చి యాశ్చర్యముతో "క్రిందఁ గూర్చుంటిరేల ?" అని ప్రశ్నించెను. సర్కారు విశేషబాధపడుచున్నవాని వైఖరిని ముఖలక్షణములను మార్చి— "కాలిమీఁద వ్రణములేచినది విశేష బాధాకరముగా నున్నది" అని పలికెను. కండక్టరు మఱియేమియు ప్రశ్నింపక— సర్కారుకు టిక్కెట్టునిచ్చి వెడలిపోయెను. సర్కారు సుమా రొకఫర్లాంగు దూరము ప్రయాణముచేసి, తానెక్కిన బస్సువెంటనే నడచుచున్న మఱియొక కారునుచూచి సంతోషముతో దిగిపోయెను. ఆకారు నొక జవానువాఁడు నడుపుచుండెను. సర్కారు దాని నారోహించి,

"ఒయాసీ!—ఈదినము చాల ప్రశస్తమైనది! ఇక తిన్నగా కారును- ఇంటివంకకు నడుపుము!" అని పలికెను.



## మూఁడవ ప్రకరణము.

### "కళావరు వాలుగు" అనగా నేమి?

బెజవాడ యందలి—ఇంచిపేటలో, హంతకులచే ఉరిదీయఁబడినవాఁడు, వీరరాఘవుఁడను నామాంతరముగల రాఘవుఁడు. బెజవాడ సర్కిల్ ఇన్‌స్పెక్టరగు "సింగు" అనునతఁడు ఇంచిపేట హత్యాభియోగము నన్వేషించుకార్యమున, సర్కారువారిచే, నియమింపఁబడెను. తత్సందర్భమున సింగు—ఇంచిపేటలో నెవ్వని యింటిముందు రాఘవుడు ఉరిదీయబడెనో-అతనినిగూడ విచారణచేయక తప్పినదిగాదు. హత్య జరిగినది భైరవుఁడనువాని గుమ్మములో—భైరవుఁడును, ఇతరులందఱీవలెనే, తనకాహత్యతో సంబంధమేమియు లేదనియు—తన శత్రువులెవ్వరో యిట్లు చేసియుందురనియును చెప్పుచున్నాడు. సామాన్యదృష్టితోఁ జూచినయెడల, వానిమాటలు విశ్వసింపఁదగినట్లే యున్నవి-కాని, భైరవుఁడు—అంతకుముందే—చాలాకాలమునుండియు సర్కారువారి నిఘాలోనుండియున్న ప్రాఁతనేరగాఁడగుటచేత—వాని మాటలను పోలీసువారంత శీఘ్రముగ విశ్వసింపఁజాలకపోయిరి.

భైరవుఁడు వృత్తియందొక చిన్నవైద్యుఁడు. వైద్యమునకుగాను—భైరవుఁడు తనయింట సేకరించియుంచిన రసాయన వస్తుసముదాయము పోలీసువారి కాతనియం దనుమానము జనించుటకు కారణమయ్యెను. అతఁ డితర కృషిని దేనినిగాని సల్పువాఁడుకాఁడు. భైరవునకు మిత్రులెవ్వరును లేరు. కాని యాతఁడు తరుచుగా బయటి కెక్కడికో వెళ్ళివచ్చు వాడుకకలదు. పోలీసువారు భైరవుని వర్తనముపై,

నొక కన్ను వేసియుండిరి. అతనితో సంబంధముగలవారు—వారు బంధువులో—మిత్రులో—రోగులో—తెలియదు— కాని చాలమంది గలరు. వారు, నియామకముగా—చీఁకటిపడిన తరువాత మాత్రమే యాతని బసకు వచ్చుచుందురు. వారు వచ్చి బయటి ద్వారమునకు గల గంటను గుర్తుగా మ్రోగించినతరువాత, తలుపు తెరువఁబడుచుండుట గలదు. భైరవుఁడు దొంగవస్తువులను కొని చౌకధరలకు విక్రయించుచుండునని యొక ప్రతీతి గలదు. ధనార్జనమున కనువగు, నుద్యోగ మేదియునులేని భైరవుఁడు తన జీవితమును గడుపుకొనుచు, ఇంచిపేటలో, నొక అద్దెయింట నివసించుచుండుటయే—ఇట్టిలో కోపవాదములకును, సందేహములకును కారణములయ్యెను.

భైరవుని మొగమునందెన్నఁడును చిఱునవ్వైనను కాన్పించుట నెవ్వరునెఱుంగరు. ఐనను—అతని యనుచరుఁడగు మతంగుఁడు మాత్రము నిరంతర ప్రమోదమానమానసుఁడై యుండువాఁడు. భైరవుని వర్తనమును రహస్యముగా—నెల్లప్పుడును ఇద్దఱుముగ్గురు పోలీసుభటులు కనిపెట్టుచునేయుందురు. ఈసంగతి భైరవునకు తెలియకపోలేదు. అతఁడు తరుచుగా తన యనుచరుఁడగు మతంగునితో—“ఈపోలీసువారు నన్నెంత వెంటాడి పరీక్షించినను నావద్ద నెట్టిద్రోహమును కనిపెట్టఁజాలరు. కాని నాశత్రువులెన్నఁడైన నా కపకారముచేయఁదలఁచినప్పుడు మాత్రము వీరు తప్పక నన్ను రక్షించుట కుపయోగింపఁగలరు! అని పలుకుచుండువాఁడు.

భైరవుఁడు పోలీసుకాన్‌స్టేబిల్సుకు తరుచుగా లంచములిచ్చి లోబరచుకొనుచుండునని యొకవాడుకగలదు. అతనికి పోలీసువారనిన మిక్కిలి ప్రేమగలదు. వారి నేవిధముగా ఉపయోగించుకొనవలయునో భైరవునకు బాగుగ తెలియును. తనపై నిఘాగా నియమింపఁబడిన పోలీసు భటులను భైరవుఁడు తనయుపయోగమునకే వినియోగించుకొనుట గలదు.

ఇక్ స్పెక్టరుసింగు—భైరవుని తలుపుతట్టెను. లోపలినుండి—"ఎవరు వారు?" అనుధ్వని వినఁబడెను. భైరవుని దర్శింపవచ్చినవారు తామెవ్వరో—ఎందులకువచ్చిరో—తెలుపనిదే — తలుపు తెరువబడకుండుటేగాక ఆచారమైయుండెను. ఈయాచారము తొలుత అసహ్యము గను—అమర్యాదకరముగను సింగుకుతోచెను. కాని లోనికిప్రవేశించినపిదప—భైరవుఁడును—మతంగుడును సంభాషించిన వైఖరినిబట్టియును—వారుసల్పిన మర్యాదనుబట్టియును—ఇక్ స్పెక్టరు తన దురభిప్రాయమును మార్చుకొనెను.

ప్రశస్తమైన ఒకషాంపెయిన్ (Champagne) బ్రాందిబుడ్డి తెరువఁబడి—బల్లమీఁద నుంపఁబడెను. దానిప్రక్కనే—మాంసపుకూరతోనిండిన యొకపళ్లెమును—సోడాబుడ్డియు చుట్టలకట్టయు—అగ్గిపెట్టెయు ఉంపఁబడియెను. భైరవుఁడు పైనుదహరింపఁబడిన వస్తువులతో—ఇక్ స్పెక్టరుగారిని సత్కరించి ఆయన వానిని సావకాశముగా సేవించుచున్న సమయమున వినయముతో సమీపమున నాసీనుఁడై—ఆయన కోరినవివరములన్నిటి నెఱిఁగించుటయేకాక—కోరనివానిని సయితము విశేషముగాఁ దెలియఁజేసెను. తుదకాతఁడు—ఇక్ స్పెక్టరుతో నిట్లు మనవిచేసికొనెను.

భైర—అయ్యా! నిజముగా నాకీవిషయమేమియుఁ దెలియదు. నాగృద్వారమున—ఆయభాగ్యుఁడగు రాఘవుఁడు ఉరిదీయఁబడియుండుట—ఈపేటలోని యితరపౌరులే నాకన్న ముందుగాచూచియుండిరి. రాఘవుని ఘోరమరణదృశ్యము నిజముగా నన్ను భయకంపితునిజేసివేసెను. ఇదివఱకే నన్ను తమ నిఘాలోనుంచుకొనిన పోలీసువారు ఈహత్య జఱిగిననాటినుండియు మఱింత జాగ్రతతో పరిశీలించుచున్నారు. నిజములో—ఇట్టి ఘోరహత్యావిషయములు—పోలీసువారికి మిగుల పూఁచీగలవి. వారట్లు వర్తించుటలో దోషమేమియును లేదు. కాని—నాకుమాత్రము

చాల ప్రాణసంకటముగానున్నది......మతంగా!—ఇన్స్పెక్టరు గారిగ్లాసు ఖాళీయైనది. తిరిగి ఛాంపెయిన్తో నింపుము!—

భైరవునియాజ్ఞను— మతంగుఁడు సక్రమముగా పాలించెను. తిరిగి ఇన్స్పెక్టరు—చాంపియిన్ బ్రాందిని సేవించుట ప్రారంభించెను. భైరవుఁడు తన విన్నపమును పునరుపక్రమించెను.

భై—ఇన్స్పెక్టరుగారూ! వార్తాపత్రికలలో నేను చదివినదానివలన— ఉరితీయఁబడిన మందభాగ్యుని ఎదురురొమ్ముభాగమునం దొక చీట్లపేకముక్క—కళావరునాల్గుముక్క ఉంపఁబడియెనని తెలిసి కొంటిని. ఆపేకముక్క అచ్చట నక్లేల యుంపఁబడియెనో భగ వంతునికే తెలియవలెను. కళావరునాల్గునందేమైన నిగూఢమైన యర్థముండియుండునా? ఇందువలన—ఇట్టిహత్యలు ముందు ముందు మఱికొన్ని జఱుగునేమోయని అనుమానించుట కవకా శము గల్గుచున్నది.

భైరవుని తుదివాక్యము ఇన్స్పెక్టరు కాశ్చర్యము గల్గించెను. అతఁడు చుట్ట నొకదానిని వెల్గించుచు—"భైరవా! మఱికొన్ని హత్యలు ముందుముందు జఱుగుననుట కేదైన విశేషహేతువు గలదా? నీవక్లేల యూహించితివి?" అని యడిగెను.

భైర—అయ్యా! ఈయురితీయఁబడిన రాఘవుని నే నెఱుంగుదునవిన మాట నిజమేకాని, వీనితత్త్వమును నేనెన్నడును బాగుగా పరి శీలించియుండలేదు. వీఁడు నాపై సహజమైనవైరమును తల పెట్టి కొన్నినాళ్లు వర్తించినదియు నిజమే. అందుచేతనే నేను వీని నురిదీసి చంపితినను నమ్మకమును గల్గించుటకై హంతకుఁ డీహత్యను నాగుమ్మములో నొనరించినాఁడు. ఆహంతకుడు నాకును—రాఘవునకునుగూడ విరోధియై యుండవలెను. అందు చేత—రాఘవుని హత్యచేసి, నాగుమ్మమునఁ బారవేసిన నావిరోధి నన్నుగూడ హత్యచేయునని నాకు భయము గల్గుచున్నది.

ఇన్‌స్పెక్టరుగారూ! ఈవిషయమున నేను తమయనుగ్రహము నాసించుచున్నాను. ఇదివఱకు కన్న నధికమైన జాగ్రత్తతో పోలీసువారు నన్ను రక్షింపవలెను.

ఇన్‌స్పెక్టరు చుట్టనుకాల్చుచు—దాని ప్రశస్తమైనరుచి కాశ్చర్యానందములనంది—"భైరవా? ఈచుట్టలు చాల విలువగల్గినవిగాఁ దోఁచుచున్నవి! ఇంతరుచిగల చుట్టలను నే నిదివఱకెన్నఁడును కాల్చియుండలేదు. వీనిని నీవెక్కడ సంపాదించితివి?" అనియడిగెను.

భైర—అయ్యా! నేనొకవైద్యుఁడ ననుసంగతి తమ రెఱింగియుందురు! ప్రకృతివైద్యవిధానమున నేను వ్యాధులను మాన్పుచుందును. ఆవిషయమై నేను "భిషగ్భైరవ" మను నొక వైద్యగ్రంథమునుగూడ రచించుచున్నాను. తరుచుగా—నన్ను దర్శింప ననేకులు పెద్దమనుష్యులు వచ్చుచుందురు. వారిలో నొకరికి చుట్టలకంపెనీగలదు. ఈచుట్టలు వారి కంపెనీలోనివి. ఆపెద్దమనుష్యుఁడు నాదర్శనమునకై వచ్చినపుడెల్ల వీనిని నాకు బహుమానముగాఁ దెచ్చియిచ్చుచుందును!—తమకు వలయునేని నేను సప్లయి చేయఁగలను!

ఇన్‌స్పెక్టరుసింగు—మిగిలిన చుట్టలకట్టలను జేబులోనిడుకొని భైరవుని వీడ్కొని వెడలిపోయెను.

* * * *

ఇన్‌స్పెక్టరు చనిన యనంతరమున—భైరవమతంగు లిరువురును చెరియొకచుట్టను వెలిగించి—యుత్సాహముతో తమలోఁ దాము సంభాషించుకొనసాగిరి— మతంగు డిట్లనెను—

"భైరవా! ఈపోలీసుఇన్‌స్పెక్టరు—బుడ్డెడు ఛాంపెయిన్ త్రాగి కట్టచుట్టలను గైకొని—మనము చెప్పినదాని నంతను గ్రహించెనేగాని, తుదకు మనకెట్టి యుపకారమును చేయలేదు. ఆ కళావరునాల్గునందలి రహస్యమునైనను భేదింపలేదు."

భైర—మతంగా! అట్లయిన—కళావరు నాల్గుముక్కలో—నేదియో రహస్యము గలదని నీవు నిజముగా విశ్వసింతువా?

మతం—ఎందులకు విశ్వసింతును? చచ్చినవాని మెడకు వ్రేలాడు త్రాడులో—నెట్టి రహస్యమును లేకపోవచ్చును. కాని, కళావరు నాలుగు నిర్హేతుకముగా నచట నుంపబడి యుండునా?—ఇంతేకాక—ఈ పురమునందిన్ని గృహములుండగా—నీయింటి గుమ్మమునందే రాఘవుఁ డురిదీయబడనేల? హంతకున కావిషయమునందెట్టి యుద్దేశ్యము నుండకుండునా?

భైరవుఁ డామాటలను విని చకితుఁడై పోయెను—అతని మొగము వెలవెలఁబారెను. అతఁడు దీర్ఘాలోచనమున మునింగెను. కొంతసేపటికి భైరవుఁ డొక వేడి నిట్టూర్పు విడిచి—"మతంగా! రాఘవుఁడు నాగుమ్మములో—ఉరిదీయఁబడుటలో—నేదియో మహాకారమగు నుద్దేశ్యము గలదందువా?" అని యడిగెను.

మతం—నిస్సందేహముగా—

భైర—నాకు నీమాటలందు విశ్వాసము గల్గుటలేదు. నేను నన్నును—నేనునమ్మను—రాఘవుని హత్యతో నాకెట్టిసంబంధమునులేదు.

మతం—రాఘవుని హత్యతో నీకు సంబంధము లేకపోవచ్చును, కాని, రాఘవునితో—నీకు సంబంధమున్నది — తిన్నగా జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము.

భైర—ఔను—ఇప్పటికి రమారమి—ఏడు సంవత్సరములకు పూర్వము నందు, నేనును—రాఘవుఁడును—మఱికొందఱును, కలసి, యొకానొక కార్యమును నొనరించియుంటిమి. ఆవిషయములను పురస్కరించుకొని, నన్ను వెఱపింపఁ దలంచి హంతకుఁ డిప్పుడు రాఘవుని నాగుమ్మములో—ఉరిదీసెనని, నీవు చెప్పఁదలఁచిన ట్లున్నావు! కాని—మతంగా! నేను దాని నెంతమాత్రమును

సమ్మను—ఏలననఁగా—నాకును- రాఘవునకు సమానముగా వైరియగువాఁడు—ఈప్రపంచకమున, నొక్కఁడుమాత్రమే యున్నాఁడు. అతఁ డిప్పటి కేఁడుసంవత్సరములకు పూర్వమునందే మరణించెను—అతని మరణమును నీవు కాదని తీసివేయలేవు గదా!

మతం—నిజమే! అతఁ డేఁడుసంవత్సరములకు పూర్వము మరణించిన మాట నిజమే!—

తరువాత—కొన్ని క్షణములవఱకును—ఇరువురి నోటను మాట వెలువడలేదు. ఏదియో- చింతించుచు—వారిరువురును, ఆగదిలో—సాఁగునిటు ప్రచారము చేయుచుండిరి. ఇరువురి హృదయములందును, సంకల్ప ప్రవాహములు సాగిపోవుచుండెను. కొంతసేపటికి—భైరవుని మొగము భయంకరముగా మారిపోయెను. వానికన్నులు రక్తముం గ్రక్కుచున్నట్లుండెను. అతఁడు వడివడినడచివచ్చి —మతంగుని కెదురుగా నిలచి—గంభీరస్వరముతో—

"భైరవా! ఒకవేళ—ఎవ్వఁడైనను—నేను ప్రత్యేకించి నీవిషయమై చెప్పుచుండుటలేదు—ఒకవేళ—ఎవ్వఁడైనను—ఏవ్యక్తియైనను—నాకు చనిపోయిన రాఘవునితో నెట్టిసంబంధమైనను కలదని నిరూపింప సాహసించినచో—ఆదురాత్ముఁడీభూమిపై బ్రదికియుండఁజాలఁడని తెలిసికొనుము! నీకు నాయుద్దేశ్యము బోధపడినదిగదా—మతంగా! అని పలికెను.

భైరవుఁడిట్లు పలికినపిదప—మతంగునిమొగము మాడినట్లయ్యెను. భైరవుఁడు—ప్రశాంతస్వరముతో మరల—"మతంగా! నేను చెప్పునది వినుము. నేను దృఢముగాఁ జెప్పుచున్నాను. నాకు రాఘవునితోగాని—రాఘవుని హత్యతోఁగాని యెట్టిసంబంధమునులేదు. వానిబొమ్మపై—కళానరు నాల్గుగలదో—డైమనుతొమ్మిది గలదో—ఇస్పేటు రాజు గలదో—మఱి యింకేమిగలదో—దానితో నాకెట్టిసంబంధమునులేదు.

తుదకు వాఁడు ఉరిదీయబడుటచేత హత్యచేయఁబడెనో—తుపాకితో కాల్చుటచేత హత్యచేయఁబడెనో—దానితోడను నాకెట్టిసంబంధమును లేదు. నాతోపాటుగా—నీకును—ఎట్టిసంబంధమునులేదు — వానికిని నాకునుగల పూర్వసంబంధమును స్వల్పమును—నీవును నేనును గూడ ఈక్షణమే మఱచిపోకతప్పదు—తెలిసినదా!—" అనిపలికెను.

మతంగుఁడు భైరవుని యట్టహాసమునుగాంచి భయపడిపోయెను. అతఁడు తన యజమానియగు భైరవుని క్షేమమునుగోరి పూర్వసంబంధమును స్మృతికిఁదెచ్చెను. ఇప్పుడాతఁడాపూర్వవిషయమును ప్రకటింపవలదని సూచించుచున్నాఁడు. దానిని మతంగుఁడు గ్రహించెను. మతంగుఁడు విశేషము బలశాలికాఁడు. అతఁడు బక్కపలుచని శరీరాంగకములు గల్గినమనుష్యుఁడు. తన యభిప్రాయమునకు వ్యతిరేకముగా—మతంగుఁడు ప్రవర్తించినట్లు—ఏమాత్రము తోఁచినను బలశాలియగు భైరవుఁడాతనిని ముక్కముక్కలుగాచీల్చి పారవేయఁగలఁడు. అందువలననే భైరవుని యట్టహాసము మతంగుని పిల్లినిగాజేసివేసెను.

ఇంతలో—నెవ్వరో—బయటిగుమ్మముకడకు వచ్చినట్లు సూచనగా—భైరవునిబల్లపైనున్న గంటమోగెను. వెంటనే భైరవుఁడు మతంగుని లోనికిఁబొమ్మని సౌజ్ఞచేసి డ్రాయరుసొరుగులోనున్న టెలిఫోనుగొట్టమునుతీసి మాటలాడఁదొడఁగెను—మతంగుఁడటనుండి వెడలిపోయెను.

"ఎవరుమీరు?—మీకేమికావలెను?" అని భైరవుఁడడిగెను.

మతంగుఁడు ప్రక్కనున్నగదిలోనికిఁ బోయెను. అతనికి భైరవుఁడు బిగ్గరగానడుగుచున్న ప్రశ్నమాత్రమే వినిపించెను గాని గొట్టమునందు రహస్యముగా వినఁబడిన ప్రత్యుత్తరము వినఁబడలేదు. కాని తన ప్రశ్నకువచ్చిన ప్రత్యుత్తరమువలన భైరవుఁడు భీతిల్లెనని మాత్రము మతంగుడు భైరవుని ముఖలక్షణములవలన గ్రహింపఁగలిగెను. భైర

వుఁడు టెలిఫోనుగొట్టమును యథాపూర్వకముగ్గా దాచి ద్వారముకడ కరిగి తలుపుఁదెరచి—

"విశేషకాలయాపనకు నా కవకాశములేదు. త్వరగా రావలెను" అని పలికెను.

నల్లని శరీరవర్ణముగల యొక ఖర్వాంగుఁడు గదిలోఁ బ్రవేశించెను. అతఁడు తనచుట్టును గదియంతటిని పారఁజూచి మెచ్చుకొనువిధమున తలయూచెను. తరువాత—నాతఁడు శిరఃకంపనము చేయుచు భైరవుని గాంచి—

"ఇచ్చట నీకుచాలసౌఖ్యముగా నున్నట్లేయున్నది! నిజమేనా?" అని యడిగెను.

భైర—నీకు నాసౌఖ్యముతో సంబంధమేమి?—

ఆగంతుకుఁడు భుజము లెగురవేసి—ఒకవంకరనవ్వునవ్వి—

"సంబంధమేమియునులేదు......కాని........."అని అర్థోక్తియందే నిలిపివేసెను.

భైరవుఁడా యాగంతుకు నాపాదమస్తకమును పరిశీలించి, తల పంకించి శాంతస్వరముతో—"దుర్గాప్రసాద్! నీవా?" అని పిలిచెను.

దుర్గాప్రసాదు చకితుఁడయ్యెను.

దుర్గా—అట్లయిన నీవు నన్నెఱుఁగుదువనినమాట!

భైర—ఆ—నిన్నెఱుఁగుదును.

దుర్గా—ఏఁడేడ్ల తరువాతమాట—నీకు మంచి జ్ఞాపకశక్తి యున్నది సుమా! శంకరం!

భైర—ఎవరిని నీవు "శంకరం" అని పిలిచితివి? నాపేరు భైరవదాసు.

దుర్గా—ఓహో!—అట్లయిన క్షమింపవలెను—పొరపాటు—నీవు నిజముగా భైరవుడవైనను, శంకరుఁడవైనను—అంతయు శబ్దార్థమునం

దొరకదే! కనుక—అదియంత ముఖ్యమైన చర్చనీయాంశము మాత్రముగాదు. నేనే పొరపడియుందును. క్షమించవలెను...
...కాని, శంకరం .....కాదు......భైరవదాసూ! ఇచ్చట నీవు చాల సౌఖ్యముగా దినములు గడుపుచున్నట్లున్నావు! ఇంత సౌఖ్యముగానున్న వాఁడు చచ్చుట కిష్టపడడుసుమా!—

భైర—మూర్ఖుఁడా! చచ్చుటకెవఁడుమాత్ర మిష్టపడును?

దుర్గా—భైరవా! ఈవిషయమున నీవు చాల పొరపాటుపడుచున్నావు! మనఃపూర్వకముగా—మరణము నభిలషించువారి ననేకమందిని నేను స్వయముగా నెఱుఁగుదును. కాని, ఇచ్చట నీవు చాల సుఖజీవనమును గడుపుచున్నావు! ఐనను—పరిస్థితులు—నాకు తెలిసినంతవఱకు—నీవిషయమున చాల వ్యతిరేకముగా నున్నవి! ఎంతమాత్రమును అనుకూలముగా లేవు!

భైరవుఁడు దుర్గాప్రసాదుని మాటలకు చాల భీతిల్లెను. ఆభీతిని కప్పిపుచ్చుట కుపాయాంతరమేదియుం దోఁపక, చుట్టనొకదానినిఁదీసి వెలిగించెను. దుర్గాప్రసాదు తానుగూడ నొక పొగచుట్టనుదీసి, నిదానముగ వెలిగించుచుండెను. హృదయవిదారకమును, వృథాకాలయాపనకరమును అగు దుర్గాప్రసాదుని సంభాషణము—భైరవున కయిష్టముగా నుండెను. కాని, అతఁడేమి చెప్పునో వినవలెనని మాత్ర ముత్సహించెను. దుర్గాప్రసాదుని నాసాపుటములనుండి సుశారసవానలు వెలువడుచుండెను. అతఁడు సారాయి నిషావలన మిగుల నుత్సాహముతో నుండెను. అతఁడు నాల్గయిదుసారులు చుట్టనుపీల్చి— విలాసముగా పొగను వదలుచు, "భైరవా! నేను నీకడకేలవచ్చితినో నీవెఱింగియుందువని తలంతును—రాఘవునితో మన కెట్టి సంబంధమును లేకపోయిన యెడల, నేనిచ్చటికివచ్చి నారాకచే నీ కసంతుష్టి గల్గింపకనేయుందును!" అని పలికెను.

భైర—అదియేమి? రాఘవునకును—నీ వచ్చుటకును—నాకును—
సంబంధమేమి?

దుర్గా—సంబంధమేమని యడుగుచున్నావా? భైరవా! అట్లయిన వివ
దపరచెదను—విను—రాఘవుఁడు హత్య చేయబడినదియు—
ఏవిధముగా హత్యచేయఁబడినదియు—నీయింటి గుమ్మమున
నాతడెట్లు ఉరిదీయబడియుండినదియు—నేను వినినతోడనే—
నాలో నే ననేక తర్కవితర్కములు చేసికొంటిని. ఇతరులను
గూడ—అనేక ప్రశ్నలువేసితిని—శంకరం—కాదు కాదు—
భైరవుఁడు నాకు ప్రాఁత స్నేహితుఁడు కనుక అతనినిగూడ
యీవిషయమై ప్రశ్నించుట మంచిదని తలఁచి, యిచ్చటికివచ్చి
తిని. భైరవా! ఏఁడేండ్లకు పూర్వమున మనలో మనకు శాత్ర
వమేయుండెనో—మైత్రియేయుండెనో—నాకంతగా జ్ఞాపకము
లేదుగాని—ఇంతటినుండియు మనము స్నేహితులముగానుండక
తప్పదు.

భైర—అందుల కభ్యంతర మేమియు నుండదుగాని, ఏకారణమున నీవు
నన్ను రాఘవునితో కలిపి సంభాషించుచున్నావో—బోధప
డుట లేదు.

దుర్గాప్రసాదు పకపక నవ్వెను.

దుర్గా—నీవు ప్రస్తుత పరిస్థితుల నంతలోతుగా విమర్శించిమాటలాడు
చున్నట్లు కనఁబడదు. ఉరితీయఁబడిన రాఘవుని వక్షోభాగమున
కళావరునాల్గుపేకముక్క యుంపఁబడెనను సంగతిని నీవు వినియే
యుందువు! దాని కర్థమేమో నీవాలోచించితివా? అది తగినంత
అర్థయుక్తముగా నున్నదనియే నాయభిప్రాయము!

ఇట్లు పలికి దుర్గాప్రసాదు, తన జేబులోనుండి యొక చిన్న పిస్తో
లును బయటకుఁ దీసి, “మిత్రుఁడా! దీనిని చూచితివా? ఇది

యిప్పుడుసంపూర్ణముగా గుండ్లతో—నింపఁబడియున్నది. నాతత్వము ననుసరించి—నేను నాప్రాణరక్షణమునకుఁదప్ప—అనవసరముగా ఇతరులను బాధించుటకై —నాపిస్తోలుగుండ్లతో నింపు నభ్యాసము గల వాఁడనుకాను. ఇప్పుడు నా ప్రాణములను నేను రక్షించుకొనవలసిన తరుణము వచ్చినదని తోఁచినందున, దీనిని తగినంత జాగరూకతతో —దగ్గఱనుంచుకొనుచున్నాను. మనలో—మొదటివాడుగా రాఘువుఁడు హంతకుని ప్రథమ కబళమైపోయెను. ఇఁక క్రమముగా మనవంతు రానున్నది. నేను నాప్రాణరక్షణ యత్నములో నున్నాను—నీవును నన్ననుకరించి తగిన జాగ్రత్తలో నుందువుగాకయని ప్రబోధించుచున్నాను.” అని పలికెను.

భైరవుఁ డామాటలను విని తలయూపుచు—“దుర్గాప్రసాద్ ! నన్ను రాఘువునితోఁగాని యితరులతోఁగాని కలుపవలదు. నన్ను మినహాయించినచో—రాఘువుఁడొకఁడు—నీవొకఁడవు...ఆపైన...” అని చెప్పుచుండఁగా దుర్గాప్రసాదు అతనిమాట కడ్డమువచ్చి,

“ప్రియమిత్రుఁడా ! నిన్ను మినిహాయింపవలయునా? నిన్ను నేనెట్లు మినహాయింతును ? నేను మినహాయించిన—హంతకుఁడు మినహాయించునా ?—ఇంతయేల? స్పష్టముగా చెప్పుచున్నాను విను—కళావరునాల్గు—దానినిమాత్రము మఱువకుము— “కళావరునాల్గు” అనగా “హత్యచేయఁబడువారు నల్గురు” అని హంతకుని భావము. మొదటివాఁడు—రాఘవుఁడు—తరువాత నేను—ఆవెనుక నీవు —అటువెనుక మఱియొకఁడు—అర్థమైనట్లైనా?” అని యడిగెను.

భైర— నే నీకథను విశ్వసింపను.

భైరవుని మాటకు దుర్గాప్రసాదు చిఱునవ్వు నవ్వి,

“భైరవా ! దానినట్లుంచుము—కాని, ఇంతకును, రాఘువుని హత్యచేసిన ధైర్యశాలియెవ్వఁడై యుండును ? *ప్రతాపుఁడు బ్రదికియుండినయెడల......” అనెను.

భైర—ఓ!—ఆవిషయమై భయములేదు. ప్రతాపుఁడు మరణించి యేఁడేండ్లైనది. అందులకెట్టి సందేహమునులేదు. ఆతని మరణ ప్రమాణపత్రము కారాగృహద్వారమున ప్రకటింపఁబడినది! దుర్గాప్రసాదుఁడొక దీర్ఘమైన వేఁడినిట్టూర్పును విడిచెను.

దుర్గా—భైరవా! కళావరు నాల్గును మఱవకుము! చనిపోయిన రాఘవు నితోఁగలసి నలువురు హత్యచేయఁబడుదురు! నలువురు—దీనిని మఱువకుము! రాఘవుఁడు త్రాడుతో మెడకురిపోయఁబడి హత్య చేయఁబడినాఁడు. దీనినిగూడ మఱువకు! నలువురకును—ఒక్కటే గతి—......ఇదియంతయు — కల్పనామాత్రమనియు అవిశ్వసనీయమనియు తలంచి నీవు కన్నులుమూసికొని యున్నచో ప్రమాదమురాఁగలదు. నామాట విశ్వసింపుము! నామాటలందు నీకు విశ్వాసముగల్గుటకై పూర్వవిషయము నొకదానిని నీకు స్మృతికిఁదెచ్చుచున్నాను. సావధానుఁడవై వినుము! ప్రతాపుని సర్కారువారు—ఏఁడుసంవత్సరములక్రిందట ఉరిదీసియుండిరి. అతని యురిశిక్షకు కారణముగా—అతని పరిజనులై యుండియు అతనికి వ్యతిరేకముగా సాక్ష్యమిచ్చినవారు నలువురు—ఒకఁడు రాఘవుఁడు—ఇంకొకఁడను నేను—మఱియొకఁడవు నీవు—నాల్గవవాఁడు అక్షయుఁడు—ఏఁడుసంవత్సరములక్రిందటి భయంకరమైన—ఆ యభియోగమునందు సర్కారువారు ప్రతాపునకు ఉరిశిక్ష విధించిరి. రాఘవునకు 5 సంవత్సరములును—నాకు మూఁడు సంవత్సరములును నీకు నాల్గుసంవత్సరములును అక్షయునకు ఏఁడుసంవత్సరములును కారాగృహశిక్ష విధించియుండిరి. హంతకుఁడు మననల్వురిపైనను క్రోధమువహించి నల్వురమును కారాగృహమునుండి విడుదలయగువఱకును వేఁచియున్నాఁడు. ఏఁడుసంవత్సరములశిక్ష విధింపఁబడిన అక్షయుఁడు—రాఘవుని హత్యాదినమునకు సరిగా పూర్వదినమునందే విడుదల చేయఁబడి

యెను. అతఁడు కారాగృహమునుండి వచ్చినవెంటనే హంతకుఁడు తనకార్యములను నిరాఘాటముగా నొనరింప నారంభించినాఁడు—అర్థమైనదా? తొలికబళముగా రాఘవుని మ్రింగినాఁడు! ఇక నీవును—నేనును — అక్షయుఁడును మిగిలియున్నాము. రెండవహత్య యెవ్వరిదో చెప్పఁజాలను. కళావరు నాల్గునందలి రహస్యభావమిది! — ప్రతాపుని సర్కారువారు ఉరిదీసిరి! కావున—ఇప్పుడుగూడ హంతకుఁడు ఉరిదీసియే మనలను నలువురను హత్యచేయ సంకల్పించియున్నాఁడు. రాఘవునితో పాటుగా—మనముమువ్వరకునుగూడ ఉరిశిక్షతప్పదు—తప్పదు"-

దుర్గాప్రసాదునివాదము సహేతుకమైయుండెను. ఆమాటలను విని భైరవుఁడు గడగడ వణకిపోయెను. ధైర్యముకొఱకాతఁడు కొంచెము సురాపానముచేసి చుట్టగాల్చెను. దుర్గాప్రసాదుసయితమొకగ్లాసెడు బ్రాందిని త్రాగెను. దానితో కొంచెము ధైర్యముఁదెచ్చుకొని యొక చుట్టనుదీసి కాల్చుచు—

"భైరవా!—హంతకుని చేతులనుండి తప్పించుకొను విధానమును ఎవరిమట్టునకు వారే యోచించుకొనవలెను. నేను తిన్నగా రంగూను వెళ్ళవలెనని తలంచుచున్నాను. ప్రతాపుఁడు బ్రదికియున్న దినములలో నీవు సంపాదించిన ధనవిషయికమైన రహస్యమును నేనొక్కఁడనే యెఱుఁగుదును. ఆవిషయమై సర్కారువారి వారంటు ఇంకను—నీపేర—కాదు—శంకరంపేర తిరుగుచునే యున్నది! నీవు శంకరంఅను నీప్రాఁత పేరును మార్చుకొని భైరవనామమును ధరించుట ఆవారంటునకు భీతిల్లియేయని నేనిదివఱకే గ్రహించితిని. ఇప్పుడు నేను తలచినచో—నీ నిజస్వరూపమును సర్కారువారి కెఱిఁగించి బంధింపఁ జేయఁగలను. కాని, నే నిప్పుడట్టి నీచమైన కార్యము నొనరింపఁ దలంపను. అందులకే నేను ప్రారంభమునందే—మనము మిత్రులముగా నుందమని పలికితిని. కాని, నేను రంగూను పారిపోవలయునన్నచో—నావద్ద ధనమేమియును

లేదు. ఒక్క నూరురూపాయలను మాత్రము నీవు నాకిప్పు డీయక తప్పదు.” అనిపలికెను.

భైరవుడు మారుమాటాడకుండ తన నోట్లకట్టనుండి యొక నూరు రూపాయల నోటునుదీసి దుర్గాప్రసాదున కిచ్చెను.

దుర్గాప్రసాదుడు దానిని తనజేబులోనుంచుకొని—

“ఇప్పుడు—భైరవా! మఱియొకమాట! నీవును నేనును కలసి అక్షయునివద్ద కిప్పుడు పోవలసియున్నది! మనము ముగ్వురమును కలసి ముందు చేయవలసిన విధానము నాలోచింపవలెను.” అనెను.

భైర—అట్లే చేయవచ్చును. కాని, వాని బస యెచ్చటనో యెవ్వ రెఱుంగుదురు?

దుర్గా—నేనెఱుంగుదును. నేను ముందుగా వేరొకకార్యముపై నరిగి రాత్రి సరిగా ఎనిమిదిగంటలకు గాంధిపార్కు వద్ద నిలిచియుందును. నన్ను కలసికొనుము. ఏమనగా మన మిరువురమును కలసి చరించుట అంత శ్రేయస్కరముకాదు. నీవు తప్పక రావలెనుసుమా! రాత్రి ఎనిమిది గంటలు—గాంధీపార్కు—ఇప్పటికి సెలవు—

ఇట్లుపలికి, దుర్గాప్రసాదు వెడలిపోయెను. భైరవుడు తలుపు వేసికొనెను. దుర్గాప్రసాదుడు వీధిలోనికిఁబోయి—తన జేబులోని చిన్నపుస్తకమునుదీసి — “అక్షయుడు—నెం 142 రైలుపేట, బెజవాడ” అని చదివి తిరిగి యాపుస్తకమును జేబునందు భద్రపరచుకొని నడువసాగెను.



## నాల్గవ ప్రకరణము.

### గ్రుడ్డివాఁడు.

నెం 142 రైలుపేట గృహమునందే—కారాగృహమునుండి విడువఁబడిన అక్షయుఁడు నివసించుచుండును. అది మూఁడంతస్థులుగల రెండు పెద్ద సౌధములమధ్య నిర్మింపఁబడిన అసహ్యాకరమగు ఇరుకు మేడ— అదియును రెండంతస్తులుగలదియే!—దానికి రెండువైపులందును గల పెద్దమేడలు రెంటియందును క్రిక్కిరిసినట్లనేకులు అద్దెకు నివసించుచుందురు. ఆపెద్దయిండ్లును వానినడుమనున్న చిన్నయిల్లునుగూడ ఒక్కరివేయైయుండెను. ఆమూఁడిండ్లకును తులసెమ్మ అను తెలగకులమునకుఁ జెందిన వృద్ధురాలు యజమాని—అక్షయుఁడామెయింట చాలకాలము నుండియు కాపురముండువాఁడు. తులసెమ్మయింట నుండుటయే తనకు చాల అనుకూలమని అక్షయుఁడు తలంచెను—ఎందువలననగా ఒకనెల అద్దె తాను ఆలస్యముగనిచ్చినను ఆమె తొందరచేయునదిగాదు. ఇది గాక—తులసెమ్మకు తనఅద్దెతో సంబంధమేగాని తనయింట నివసించు వారి యంతరంగజీవితవిషయముతో నెట్టిసంబంధమునులేదు. ఆమె వారిని ప్రశ్నలతో విమర్శించు స్వభావముగల యిల్లాలుగాదు. తులసెమ్మకు అక్షయుఁడును అనుకూలమైన గృహవాసిగానే తోఁచెను. ఏమనిన—అతఁడు సామాన్యముగా అద్దెకుండు నితరు లందఱివలె— "అదిలేదు — ఇదిలే"దని నిరంతరము—పీడించుచుండువాఁడు కాఁడు.

ఆమె యింటిసింహద్వారము నిరంతరము తెఱువబడియే యుండు నది. ఆమెయింట అద్దెకు నివసించువారిలో నెవ్వరినైన చూడఁదలంచిన వారు నిరాఘాటముగ సింహద్వారమునఁ బ్రవేశించి, గది వెనుక గది చొప్పున వెదకుకొనుచు అన్యసహాయము నపేక్షింపకయే తమకు కావలసినవారి నివాసము కనుగొనుటకు వీలుగలదు—

అక్షయుఁ డొకదినమున నేదియో వార్తాపత్రికను పఠించుచు తనగదిలోనున్న సమయమున ఒకానొక విచిత్రవ్యక్తి యాతని గదికడకు

వచ్చి తలుపుతట్టెను. ఆవ్యక్తి భుజమునందొక ఫిడేలుగలదు. దుస్తులంత విలువగలవి కాకపోవుటయేకాక, అచ్చటచ్చట జీర్ణించి యుండెను. అతని మెడలోఁ గట్టఁబడియున్న ఇత్తడిరేకుమీద—సగముగ్రుడ్డివాఁడు దానముచేయుఁడు" అను నక్షరములు లిఖింపఁబడి యుండెను, ఆవ్యక్తి యిదివఱకే అక్షయుని నివాసమును బాగుగ నెఱింగియుండునని తోఁచుచున్నది. ఏమనగా—అతఁడు సగము గ్రుడ్డివాఁడయ్యును—విశేష శ్రమలేకుండ అక్షయుని గదికడకు రాఁగల్గియుండెను. గ్రుడ్డివాఁడు తలుపు తట్టిన ధ్వనిని విని, అక్షయుడు లోపలనుండియే—ఎవరు మీరు? ఎవరిబసకావలెను ? పనియేమి? అని ప్రశ్నించెను.

ఆప్రశ్నలకు ప్రత్యుత్తరముగా అంధుఁడు మాటలాడుట మాని మరల తలుపుతట్టెను. ఈసారి తలుపు తట్టుటలో నొక చిత్రవైఖరిని కాన్పించెను. మూఁడుసారులు బిగ్గఱగాను, రెండుసారులు నెమ్మదిగాను తట్టఁబడెను: తరువాత నాల్గయిదు సెకనులు నిలిచి మరల వెనుకటివలెనే తట్టఁబడెను. ఒకవిధమైన తాళప్రస్తారముగా నది గాన్పించెను.

అక్షయుఁడు తలుపు తెరచెను.

అతఁడు కొంచెము విసుగుదలతో— "ఊఁ— లోపలికి రా!" అనియెను.

గ్రుడ్డివాఁడు గదిలోనికిఁ బ్రవేశించెను.

అతఁడు లోపలకువచ్చిన యుత్తరక్షణముననే—అక్షయుఁడు గుమ్మమునకు లోపలతాళమువేసి, తాళపుచెవిని తనజేబులో నుంచుకొనెను. అతని పాదములకు పాదరక్షలులేవు. కేవలము షర్టును పంచెను ధరించియుండెను. గడ్డము పెఱిగియున్నందున, చూచుటకాతఁడు చాల వికారముగ నుండెను. తలమీఁది వెంట్రుకలు తైల సంస్కారములేక, చాల గుత్తముగా పెఱిగియుండెను. కన్నులలో రక్తవర్ణ ముద్యోతక మగుచుండెను. అతని యాకృతి కనుగుణముగ, అతని గదియు—

సురారసముయొక్కయు—పొగాకుయొక్కయు వాసనలతో నిబిడీకృతమైయుండెను.

గ్రుడ్డివాఁడు గదిలోనికివచ్చి—చుట్టునుచూచి మొగముచిట్లించి-"ఛా!—ఈగది పశువులదొడ్డికన్న అన్యాయముగ నున్నది!" అని పలికెను.

అక్షయుఁడు ప్రక్కపై నడుమువాల్చి యొకసిగరెట్టుఁ దీసి కాల్చుచు—

"ఇదిగో! చూడు—ఈగదిలోనుండుటకు నీకిష్టములేనియెడల, చల్లగా వచ్చినమార్గముననే—దయచేయవచ్చును" అని పలికెను.

గ్రుడ్డివాఁడు— "మిత్రుఁడా! నేనింత త్వరలో వచ్చినమార్గముననే దయచేయుటకొఱకై రాలేదు. నేను నీతో మాటలాడుటకై వచ్చితిని!" అని పలికెను. ఇట్లని యాతఁడు తన నెత్తిమీఁది టోపిని తీసి చేత నుంచుకొని, తలపై నున్న తెల్లని వెంట్రుకలను ముసలిచేతులతో క్రిందనుండి పైకి నిమురుకొనుచు, "సాధారణముగా నన్ను లోకులందఱును "గ్రుడ్డి వీరాస్వామి" అని పిలుతురు. కాని నీవంత శ్రమనందనక్కఱలేదు. నన్ను "అయ్యా!" అని పిలిచినఁ జాలును అని పలికెను.

శయ్యపైఁ బరుండియున్న అక్షయుఁడు, గ్రుడ్డివాని మాటలను విని ఆశ్చర్యముతో తలయెత్తి వాని మొగమువంకకుఁ జూచుచు పెద్దపెట్టున నవ్వి—

"అయ్యా! చిత్రము—చిత్రము!" అని ప్రత్యుత్తరమిచ్చెను.

గ్రుడ్డివాఁడు తిరిగి గంభీరస్వరముతో"ఇదిగో! నామాటలను నీవు వేళాకోళములుగా గ్రహింపవద్దుసుమా!" అనిపలికెను.

అక్షయుఁడు నిర్లక్ష్యభావముతో—నొకసిగరెట్టును కాల్చుచు—

"పో!—పోరాపక్షీ!" అని పలికెను.

గ్రుడ్డివానికి కోపమువచ్చెను. అతఁడు రయమునలేచి అక్షయుని సమీపించి అతనిపట్టుమెడను పట్టుకొని ముందువెనుకల కూపి విడిచెను.

వృద్ధుఁడును అంధుఁడును నగు వీరాస్వామి చురుకుఁదనమునకును బాహుబలమునకు ఆశ్చర్యపడి—అక్షయుఁడు నిర్విణ్ణుఁడై—అట్లే నిలువఁబడిపోయెను.

గ్రుడ్డివాఁడు తనకన్నులకుఁగల సులోచనములను తొలగించి, అక్షయుని మొగమును తేరిపార గ్రుడ్లురిమిచూచెను. ఎఱ్ఱగానున్న యాతనికన్నులలో నొక పైశాచికాగ్ని ప్రజ్వరిల్లిపోవుచుండెను. అతఁడక్షయునిమొగమున మొగముఁబెట్టి చూచి,

“ఇదిగో! అక్షయా! ఇటువిను—నేను నిన్ను మంచి మార్గమునకుఁ దెచ్చుటకుఁగాని నీకు తగినట్లు బుద్ధిజెప్పుటకుఁగాని వచ్చితిని. రాఘవుఁడు హంతకులచేత ఉరిదీయఁబడి భైరవునిగుమ్మమునఁ బారవేయఁబడినాఁడు! ఈవృత్తాంతము నీకు తెలిసియేయుండును!—రాఘవుఁడు ఉరిదీయఁబడియెను. హంతకునిత్రాఁడు రాఘవునిమెడలో వ్రేలాడుచుండెను. వాని ఎదురురొమ్ముమీద కళావరునాల్గుకార్డు పెట్టఁబడియెను.” అని గంభీరముగఁబల్కి యూరకుండెను. ఆతని స్థైర్యమునకును గభీరస్వరమునకును అక్షయుడు కొంచెము కంపించియు ధైర్యముఁదెచ్చుకొని—“సరే!—కావచ్చును. ఆవిషయములతో నాకెట్టి సంబంధము గలదు?” అని యడిగెను.

గ్రుడ్డివీరాస్వామి చినిగిన తనకోటుజేబునుండి యొక చిన్నసిగరెట్ డబ్బాను బయటికిఁదీసి దానినుండి యొకనల్లని సిగరెట్టునుగైకొని వెలిగింపఁజొచ్చెను. ఆసిగరెట్టుపొగ—నల్లమందువాసనను గ్రక్కుచున్నట్లు అక్షయుఁడు గ్రహించెను.

వీరా—మిత్రుఁడా! ఇది శ్రద్ధగావినవలసిన విషయము!—ఈవిషయములు నీయందు కదలికఁగల్గించునని నేను తలంచితిని. రాఘవుని

మెడకు వలెనే—నీమెడకుఁగూడ నొక యురిత్రాడు బంధింపఁబడి కళావరుమూఁడుపంక్తిగల పేకముక్కగాని డైమను మూఁడుపంక్తిగల పేకముక్కగాని నీవక్షమున నుంపఁబడితీరును. అందువలననే ఈవిషయము నీలోకదలిక గల్గించునని నేను తలంపఁగల్గితిని!—

అక్షయుఁడు తిరిగి తనశయ్యపై వ్రాలి తనస్వంతసిగరెట్టు నొకదానిని తీసి కాల్పఁదొడగెను.

అక్ష—ఇట్లు నీవు తలంచుట కాధారమేమి?

వీరా—మిత్రుఁడా! అదియంత గొప్పకారణము కాదు. ఏఁడుసంవత్సరములక్రిందట—ప్రతాపుని యురిశిక్షకు కారణమైన నలుగురిలో నీ వొకఁడవు! అనతికాలముక్రిందటనే నీవు కారాగారమునుండి వచ్చితివి! మీనలుగురిలో నొకఁడైన రాఘవుఁడు నలుగురిలో నింకొకఁడైన భైరవుని గృహద్వారమున ఉరిదీయఁబడెను. ఇంతే కాక వాని ఎదురురొమ్ముపై కళావరునాల్గుముక్క యుంపఁబడియెను. నాల్గుముక్కనుగల యర్థము నలుగురు మనుష్యులనియును ఆనలుగురును—మీరేయనియును నే నూహింపగల్గితిని!—

తాను చెప్పినమాటలను అక్షయుఁడు బాగుగ నాలోచించి, అర్థముచేసికొనుటకై —వీరాస్వామి కొంతసేపు తాళి మరల నిట్లనెను.

వీరా—భైరవుఁడనగా నిజముగా నెవ్వడో నీవెఱుఁగుదువా?

అక్ష—శంకరుఁడు గాఁడా?

గ్రుడ్డివీరాస్వామి చిఱునవ్వు నవ్వెను.

వీరా—అకస్మాన్మరణ మొకటి నీకొఱకై వేచియున్నదను విషయమున ఇప్పుడు నీవు నాయభిప్రాయముతో నేకీభవించుచున్నావని తలంచెదను.

అక్షయుఁడు "నేను నీతో నేకీభవింప" నని పలికెను. అది యంతయు నొక బెదరింపువలె నాతనికిఁ దోఁచెను.—కాని, యందలి నిశ్చయానిశ్చయములను మాత్రము ధృవపఱచుకొనఁజాలక తటపటాయించు చుండెను. వీరాస్వామి ఆలోచించుచు,

రాఘవుని చంపినవాఁడు మిగత మీముగ్గురిని కూడ చంపుట మాత్రము నిశ్చయమే! అయితే—నీవు రెండవవాఁడవా మూఁడవవాఁడవా యనువిషయమే కొంచెము సందేహము—భైరవుఁడుమాత్రము తుదివాఁడగునని నేను దృఢముగా చెప్పఁగలను—వాని ఱొమ్మిమీఁద "ఆసుముక్క యుండుట ధృవము." అని పలికెను.

అక్షయుఁడు సిగరెట్టును బలముగాపీల్చి విడువసాగెను. వాని రక్తోజ్వల నేత్రములందు—అనుమానభావ ముద్యోతకమగుచుండెను.

అక్ష—ఓహో! నీకు చాలవిషయము తెలియునట్లున్నది. ఏమి? నిజమేనా?...అసలు నీవెక్కడనుండి వచ్చితివి?—నీవు నన్ను వెఱపింపఁదలఁచి యీకథలు చెప్పుచున్నట్లున్నది! కాని నీవు నన్ను వెఱపింపఁజాలవు. ఏదియెట్లున్నను ఏఁడేండ్ల క్రిందట—ప్రతాపుఁడు చచ్చినమాటమాత్రము నిజము!— రాఘవుఁడెట్లు మరణించెనో—ఎవ్వనిఱొమ్మున మరణించెనో—వాని ఱొమ్మున నేమియున్నదో—వానితో నాకెంతమాత్రమును జోక్యములేదు—అదిసరిగాని—ఇటుచూడు—ఇంతకును నీవు భయంకరమైన సులోచనములజోడు నొకదానిని బెట్టుకొని, నాయింటికి వచ్చుటలో నీయభిప్రాయమేమి?—

ఆమాటలు విని—గుడ్డివీరాస్వామి విసవిసనడచివచ్చి అక్షయుని మొగములో మొగముంచి బిగ్గఱగా—"ఇదిగో! అక్షయా! ఇకముందిట్టి బుద్ధితక్కువప్రసంగమును నాతో నొనరింపకుము—నిష్కారణముగ నాచేతులలో చావవలసివచ్చును" అనియెను.

అక్షయుఁడు నవ్వి—"ఏమీ! నీచేతులోనా? ఇంకొకసారి నాపై చేయివేసిచూడు. నీతల్లికిగూడ కబురు తెలియకుండ నిన్నిచ్చటనే మట్టు బెట్టెదను" అని పలికెను.

గ్రుడ్డివానివలె నటించుచున్న వీరాస్వామి కన్నులు—అక్షయుని మాటలకు అగ్నికణములను రాల్చుచున్నట్లయ్యెను. అతఁడు మహాగ్రహముఁదాల్చెను.

వాని లక్షణములనుఁజూచి అక్షయుఁడు—"నిన్నుఁజూచిన నాకసహ్యము గల్గుచున్నది. వెంటనే నీవిచ్చటనుండి వెడలిపొమ్ము" అని పలికెను. ఆసమయమునం దక్షయుని మొగము దుర్నిరీక్ష్యమైయుండెను. ఆగ్రహమువలన చెంపలెఱ్ఱవారెను. నరములుపొంగి కొరడాత్రాళ్లవలె నయ్యెను. కనుబొమ్మలు ముడివడియెను. ఈస్థితిలో నాతఁడు పైనఁ జెప్పఁబడిన విధమున గ్రుడ్డివీరాస్వామిని మందలించినను అతఁడు కదుల మెదలక శిలావిగ్రహమువలెనుండుటచేత మఱింత విసుగుఁజెంది వాని చెంపపై నొక ప్రహారము నిచ్చెను.

అప్పటికిని వీరాస్వామి చలింపలేదు. తన కపోలమున అక్షయుని కరప్రహారము పడఁటయేతడవుగ తానును కుడిచేతి సత్తువమీఱ నేల టపాకాయ ప్రేలినంత ధ్వనిచేయు—ఒక్కటేదెబ్బను తిరిగి యక్షయుని చెంపపైఁ గటాక్షించెను. ఆదెబ్బతో అక్షయుని తల తిరిగిపోయెను. అతఁడు త్రాగినవానివలె గిరగిరసోలిపోయెను. చేతులు బలహీనములై తోలుముక్కలవలె వ్రేలాడి తల భుజముపై కొరిగెను. ఆస్థితిలోనున్న—ఆయభాగ్యుని తలమీఁద బలమైన ముష్టిప్రహారము నింకొకదానిం బ్రసాదించెను. ఈసారి వాని కణతనుండి నెత్తురు కాఁరఁగొడంగెను. ఐనను—వీరాస్వామి యక్షయుని చంపఁదలంపలేదు. తన ఆధిక్యతను స్థిరపరచుకొనుటకు మాత్రమే వానిని లొంగదీసికొనుటకై యట్లాచరింపవలసివచ్చెను.

గుర్డివానివేషమునందున్న యింతటి బలశాలియగు నీవ్యక్తి యెవ్వఁడై యుండును? ఇతఁడు తానుచెప్పినట్లు కేవలము గుర్డివీరాస్వామిమాత్రము కాఁడు. అక్షయునకేమియుఁ దోఁపలేదు. పరిపూర్ణమైన మార్పునొందించు విచిత్రవేషాంతరమున యీవ్యక్తియే భృగురామసర్కారని పాపము అక్షయుఁడెట్లు గ్రహింపఁగలఁడు?—

అక్షయుఁడు చేతితో రక్తమును తుడుచుకొని సోలుచు మరల తనశయ్యపైఁబడిపోయెను. మొగమును రెండుచేతులతోఁ గప్పుకొని ప్రక్కమీఁదఁ గూర్చుండెను. రక్తమింకను కారుచునేయున్నది. కొంతసేపటికి మరల నాతనిని పౌరుష మావహించెను. అకస్మాత్తుగలేచి భృగురాముని మీఁదికివచ్చెను.

వచ్చుచున్నవాని నర్లే భృగురాముఁడు వెనుకకుఁబడద్రోసెను—క్రిందఁబడి తిరిగి యక్షయుఁడు లేవఁబోవుచుండగా మరల నేలపైఁ బడఁద్రోసెను. సరిగాలేచి తన ప్రతిస్పర్థి నెదుర్కొనఁజాలనట్లు మాటిమాటికిని తలక్రిందులుగావింపఁబడుచున్న యక్షయుఁడు మార్గాంతరముగానక నేలపై నొకమూలనున్న యినుపగుదియ నొకదానినందుకొని తనశక్తినంతను వినియోగించి భృగురామునిమీఁదికి గురిచూచి విసరెను. ఆ యినుపగుదియ నిజముగా తగిలియుండినచో—భృగురామునితల బ్రద్దలై యుండవలసినదే! కాని భృగురాముఁడు సామాన్యుఁడా! అతఁడు కడు చమత్కారముగ తలవంచి యాదెబ్బయొక్కగురిని తప్పించుకొని క్రిందఁబడియున్న యక్షయుని కంఠమును రెండుచేతులతోఁ బట్టుకొని తీసికొనిపోయి శయ్యపైఁగూలవేసి—చెవులుపట్టుకొని పైకిని క్రిందికిని నాల్గయిదుసారులు కుదించి కుదించి విడిచెను. ఈదెబ్బతో—అక్షయునకు జ్ఞానమువచ్చెను. అక్షయుఁడు నాల్గయిదుసారులు రెప్పలల్లార్చి—తల నటునిటుద్రిప్పి కుదుటఁబరచుకొని హీనస్వరమునఁ దనలో—"ఈపిశాచమెవ్వఁడై యుండును?" అని గొణుగుకొనెను.

ఆమాట విని భృగురాముఁడు అధికారికస్వరమున—

"నేను నీవ్రిభుఁడనుకా! మూర్ఖుఁడా!" అని పలికెను.

ఇట్లుపలికి—తనచేతులతో—అక్షయు నాతని శయ్యమీఁద సరిగా కూర్చుండఁజేసి "మిత్రుఁడా! ఇటుచూఁడు!—ఏఁడుసంవత్సరము లకు పూర్వమందు—ప్రితాపుని సర్కారువారు ఉరిదీసియుండిరి. ఆ సమయమున నీవును శంకరుఁడును—అనగా తెలియునా—ఇప్పటి భైరవ నామాంతరుఁడును మఱికొందఱు ప్రితాపుని పరిజనులును—అశేషధన నిక్షేపములను స్వాధీనపఱచుకొని యుండిరి—జ్ఞప్తికి వచ్చుచున్నదా? నేను చెప్పుచున్నవిషయము నిజమేకద!—ఆధనసంపద నెచ్చట పూడ్చి పెట్టియుంచిరో—ఎవ్వరికిని తెలియుటలేదు. పోలీసువారు—ఇప్పటి కిం కను ఆనిక్షేపముకొఱకే శక్తివంచనలేకుండ అ-చోకిలీయ పాటుపడు చున్నారు!—పోలీసువారి ప్రియత్నము లొకవంక నట్లుండ మఱియొక వంక నేనును శ్రిమపడుచున్నాను! వినుచున్నావా?" అని పలికెను.

అక్షయుఁ డామాటలు విని యాశ్చర్యముతో—

"ఆఁ—ఆఁ—అదియేమి?—ఏమంటివి?" అనియెను.

భృగు—అక్షయా! నే నేమనుచుంటినో నీకు తెలియును—నీకు బాగుగా తెలియును. తెలియనిచందమున నటించినందువలనఁ బ్రయోజన మేమి?—ప్రతాపుడు సంపాదించిన యమూల్యమగు ధనసంపద యంతయు నెచ్చటనో యుండవలెను. ఆనిక్షేపమునందలి యొక రాగికాసునైనను పోలీసువారు కనుగొనఁజాలకపోయిరి! అక్ష యా! నీవొక శుద్ధమూర్ఖుఁడవు! కాని ఆనిక్షేపమును నీసహచరు లచేతులలో వదలునంతటి మూర్ఖుఁడవుమాత్రిము కావు. అం దులకు నాకానందముగ నున్నది! ఏమికారణమో నేనెఱుంగని గాని—మొత్తముమీఁద నీవు కారాగృహమునుండి బయటకు వచ్చునంతవఱకును నీసహచరులగు మిగతవారు—ఆనిధనమును తాకక నీరాకకై వేఁచియున్నారనుట మాత్రమునిజము! ఇందు వలన ఆగుప్తధనవిషయమైన యధికారభారము నీయందు విశే

షముగాఁగలదని నేనూహించితిని. ఇటుచూడు—నేనెవ్వఁడనో—ఎట్టివాఁడనో—నీవు బాగుగనెఱుంగుదువు!—ఆనిధనముకొఱకు నే నభిలషించుచున్నాను! నీసహాయములేకున్నను నేను సంపాదింపలేకపోను—కాని నాకు విశేషశ్రమలేకుండఁ బోవుటకును-నీకును కొంత లాభింపఁజేయుటకొఱకును నీసహాయము నపేక్షించి నేనిచ్చటికి వచ్చితిని! అందువలన—నీకుతెలిసిన సంగతి నంతను దాచక నాకెఱిగింపుము! నీసహచరులబాధ నీకుఁగలుగకుండ నేను నీకు కుడిభుజముగానుండి పనిచేయుదును. ఆధనసంపదనంతను నీవును నేనును సగము సగముగా పంచుకొందము!

అక్ష—ఈదినమున నీవు నన్ను జయించితివి. అంతవఱకు నేను సమ్మతింతును. కాని నీసహాయమును నేనభిలషింపను. నాసహచరులు నాకుగాకుండ ఆనిధనము నపహరించుకొని పోవుదురేమోయను భీతి నాకెంతమాత్రమునులేదు. నీవు బలశాలివైన నగుదువుగాక! ఆనిక్షేపమును నీవెన్నడును పొందఁజాలవు. నీసహాయము నాకక్కఱలేదు ఇంతకును నీవెవ్వఁడవో నాకుతెలియదు.

భృగు—మిత్రుఁడా! నన్ను హత్యకు ప్రేరేపకుము! నేను హృదయపూర్వకముగా నీహితముఁగోరి చెప్పుచున్నాను. నామాట వినుము!

అక్ష—నీమాట నాకర్థమగుటలేదు.

భృగు—అర్థమగునట్లు చెప్పవలయునా? అట్లయిన వినుము!—నేనెవ్వఁడనో నీవింతవఱకెఱుఁగవు! నీవు నాతో శత్రుత్వమునే తలపెట్టనెంచినదో—నేను నిన్ను చేతులార హత్యచేయవలసివచ్చును. కాని—పరిస్థితులంత తీవ్రముగా పరిణమించువఱకును నేను తొందఱపడువాఁడనుగానని తెలిసికొనుము.

భృగురాముని గంభీరవాక్యములకు అక్షయుఁడు నిలువున కంపించిపోయెను. భృగురామునిచేతిదెబ్బ నింతకుముందే యాతఁడు చవిఁ

జూచియున్నాఁడు!—చెప్పినట్లుగనే యాతఁడు తన్నాక్షణమే—యితరు లెఱుంగకుండ హత్యచేయుటకుఁగూడ సమర్థుఁడే యని అక్షయుఁడు విశ్వసించెను. భృగురాముఁడు హత్యచేయుదుననుటతోడనే—అక్షయుఁ డాతని యెదుట పిల్లివలె లొంగిపోయెను.

అక్ష—అయ్యా! లేదు. నేను నీతో శత్రుత్వమును తలపెట్టను.

భృగు—అట్లయిన మంచిదే!

అక్ష—ఇంతకును నన్నిపుడేమి చేయుమనియెదవు?

భృగు—ఏమిచేయుటకు నీకేమి సమర్థతగలదని నీయూహ?—వెఱ్ఱి వాఁడా! రాఘవుని చంపిన యా ఘోరహంతకుఁడు నిన్ను మాత్రము ప్రాణములతో నుండనిచ్చుననుకొనుచున్నావా! కల్ల నీమరణమెట్లును దినములలోనే యున్నది. నీవు చచ్చినవెనుక—ప్రతాపుని గుప్తధన మెట్లును నీకు ప్రయోజనకరముకాదు. కావున, నా హితోపదేశమును జాగ్రత్తగా వినుము—హంతకునినుండి నీప్రాణములను నేను రక్షించెదను. నీవు నాకు గుప్తధన రహస్యము నెఱిఁగించినందులకు ప్రతిఫలముగా నీకు కొంత ధనము నిచ్చెదను. ఇంతకన్న నీ కనుకూలమార్గము లేదు.

అక్షయుఁ డామాటలకు నవ్వెను.

అక్ష—అయ్యా! ఏమియు నక్కఱలేదు. మీ సహాయమున కొక నమస్కారము. నాప్రాణములను, నేను రక్షించుకొనఁగలను.

భృగురాముని కన్ను లెఱ్ఱబడియెను. ఆతని మొగము మరల నాగ్రహాభరితమయ్యెను.

భృగు—మంచిది. కానిమ్ము. అట్లయిన మిమ్మందఱను నాశనముచేసి, ఆ గుప్తధన రహస్యమును నాయంతట నేనే కనుగొను శ్రమ నాకు తప్పదనినమాట!

అక్షయుఁడు తిరిగి భయకంపితుఁడయ్యెను. ఎట్లయినను వాని పీడ వదలించుకొనుట కొక యుక్తిచేయ సంకల్పించెను.

అక—అంత సులభముగా—ఆ రహస్యమును నీకెఱిఁగించుట నా కిష్టములేదు. ఐనను, అందులకొక చిన్నమార్గము గలదు.

భృగు—అదియేమి?

అక—రాఘవుని చంపిన హంతకుఁ డెవ్వఁడో—నీవు నాకెఱిఁగించినచో—

భృగు—మంచిది—వాని నన్వేషించి కనుగొందు ననుకొమ్ము—అటు పిమ్మట నేమగును?

అక—అటుపిమ్మట—అంతయు సులభమే!

భృగు—అది యెట్లుసులభమో నాకు బోధపడుటలేదు. ప్రతాపుని గుప్తధన మెచ్చట నిక్షిప్తపరుపఁబడియున్నదో యెవ్వరికిని తెలియదు. ఆసంగతి నాకు నీవెఱిఁగింతువా.

అక—మిత్రుఁడా!—నీవు నా విషయమై భ్రాంతిపహించుట నాకు విచారకరముగ నున్నది. ప్రతాపుని గుప్తధనరహస్యము నీకెంత తెలియునో—నాకును అంతే తెలియును. నీకును నాకే కాదు. ఈ ప్రపంచకమున నెవ్వరికిని తెలియదని నా నమ్మకము. ఆ రహస్యము ప్రతాపునితోఁడనే యంతరించిపోయినది. అనగా ఆధనము గూడ—ఎవ్వరి యనుభవమునకును సాధ్యముకానిదై నాశనమై పోయినది. ఆ రహస్యము నాకు తెలిసియుండునేని, నే నిదివఱకే పోలీసువారి కెఱిఁగించి యుండెడివాఁడను. అందువలన, నాకు ఏఁడుసంవత్సరముల కారాగృహశిక్ష తప్పియుండెడిది. అవియన్నియు నట్లుండగా—ఇప్పుడు సులభమైన యొక్క విషయమును నీవు యోచింపఁజాలవా? ఆధనరహస్యమే నాకు తెలిసియుండినచో—నేనీవిధముగా దరిద్రము నెళ్లబోయుచు జీవితమును హీనముగ గడుపనేల?—లోకులు తలంచినట్లు—ప్రతాపున కనుచరు లెవ్వరును లేరు. అతఁడు కేవలము—ఒంటరిగాఁడు. ఈ ప్రపంచకమునందలి మనుష్యుల నెవ్వరిని, అతఁడు విశ్వసించియుండలేదు. అతని రహస్యము లతనిలోనే

యుండెను. యతనిలోనే యంతరించెను. మే మెందఱ మాతని వెంట
నుండి యుపచారములు చేసినను, మాలో నొక్కరినికూడ నాతఁడు
విశ్వసించియుండలేదు. మేము దొంగిలించి తెచ్చిన ధనసంచయ
ములకు ప్రతిఫలమును, ఎప్పటి కప్పుడే యాతఁడు ముట్టజెప్పుచుం
డెడివాఁడు. మిగిలిన ధనము నెందు దాచుచుండువాఁడో మా
కెవ్వరికినిఁ దెలియదు—ఒక్కరికినిఁ దెలియదు. ఇదియే ఆతని
జీవితరహస్యము. నీవు లేనిపోని పేరాశ వహింపవలదు. నామాట
విశ్వసింపుము.

భృగురాముఁ డంతయు—శాంతముగ నాలకించెను. అక్షయుఁడు
నిజము చెప్పుచుండెనో—అబద్ధము చెప్పుచుండెనో—తెలిసికొనుటకై
ఆతఁడు వాని మొగమువంక రెప్పవాల్పక చూచుచుండెను.

అక్ష—మిత్రుఁడా! నీవు సందేహింపనవసరములేదు. ప్రతాపుని
సర్కారువారు ఉరిదీసినప్పుడు—ఆతని భౌతికదేహముతోడనే
యాతని రహస్యములన్నియు నంతర్హితములై పోయినవి.

భృగు—కావచ్చును......కాని, అక్షయా! నీవు చెప్పిన విషయము
లను నేనింత త్వరలో విశ్వసింపఁజాలకున్నాను.—ఎందువలన
ననఁగా—నీనోట వెలువడిన ప్రత్యక్షరమునకును పరిపూర్ణ
వ్యతిరేకమైన సంగతులను నేను కోట్లకొలదిగా వినియుంటిని.
అందుచేతనే, నేనింత పట్టుదలవహించి, నీతో ప్రసంగించు
చున్నాను. నీవలన నిఁక నెట్టిప్రయోజనమును లేనట్లే తోఁచు
చున్నది. కానిమ్ము—అందులకై నేనే ప్రయత్నించి చూచెదను.
నేను నాస్వయం సహాయమువలన దానిని కనిపెట్టఁగల్గినను—
నీకు కొంత ముట్టజెప్పకపోను. చూఁడు—అక్షయా! నీవు
మిక్కిలి యల్పబుద్ధిగలవాఁడవు. నిరుత్సాహివి—భగవంతుఁడు
నను బోఁటివానికి—మంచికొఱకో—చెడ్డకొఱకో—విశాలమైన
బుద్ధినిమాత్రము ప్రసాదించియున్నాఁడు. కావున—ఈరహా

స్యమును భేదించుటయం దెట్టి కష్టనిష్ఠురము లడ్డు తగిలినను సాహసముతో నెదుర్కొని సాధింపఁ బ్రయత్నించి తీరెదను.

అక్షయునితో—భృగురాముఁ డిట్లు పల్కుచుండఁగనే, ద్వారము తట్టిన ధ్వని వినఁబడియెను. వెంటనే భృగురాముఁడు త్వరపడి, తన సులోచనములు, ఫిడేలు మొదలగు పనికరములను ధరించి—యా యుత్తర క్షణమునందే—వీధిగాయకుఁడగు "గ్రుడ్డిపీరాస్వామి"గా మాఱిపోయెను.

అక్షయుఁడు—'ఎవరువారు? తలుపు తెఱచుకొని రావచ్చును' అని పలికెను. వెంటనే—తలుపు తెఱచుకొని, భైరవుఁడును, దుర్గాప్రసాదుఁడును లోనికివచ్చిరి. వారిరువురును అక్షయునకు నూతనులుగనే కాన్పించిరి.

భైరవుఁడు అక్షయునిఁ గాంచి—"మేము నీతో నొక రహస్యవిషయమును గూర్చి ప్రసంగింపఁ దలఁచి వచ్చితిమి!" అని పలికెను.

అక్ష—ఎందులకు?—అది.........

"భైరవుఁడు అక్షయునిమాట కడ్డమువచ్చి—"మేము రహస్యముగా నొక విషయమును మాటలాడనచ్చితిమి!" అని పలికెను.

గ్రుడ్డి పీరాస్వామి వారి సంభాషణయందు—అనవసరముగా జోక్యముఁ గల్గించుకొని—

"ఓ చాల బాగున్నది. రహస్యప్రసంగము అత్యవసరముగాచేయవలసినదే! ఒకఁడు హంతకునిచేతులలో నిష్కారణముగా చచ్చినాఁడు. ఇఁక ముగ్గురు చావనున్నారు! ఆచావనున్న ముగ్గురును అదృష్టవశమున చావకపూర్వము ఒక్కచో కలసికొనినప్పుడు—అదియెంతటి రహస్యసంభాషణమైనను కాకతీరదు. ఐనను—నేనును మీకు మిత్రుఁడనే! కాని—చచ్చుటకు నిర్ణయింపఁబడిన మిత్రసంఖ్యలోనివాఁడను మాత్రము కాను......అక్షయా! ఇటుచూఁడు—వీరిరువురును ఎవ్వరైయుందురాయని నీవాశ్చర్యపడుచుండవచ్చును. వారెవ్వరో క్రొత్తవారు కారు.

నీమిత్రులే! ఏండ్లనాటి నీపురాతన ప్రియమిత్రులు కాలాతిక్రమణదోషమున నీకు మఱపుతట్టియుండును. అతఁడు నీమిత్రుఁడు దుర్గాప్రసాద్! స్మృతికి వచ్చినదా! ఇతఁడు నీమిత్రుఁడు శంకరం! ప్రస్తుత భైరవ నామాంతరధారియై యున్నాఁడు! తెలిసికొంటివిగదా!"

గ్రుడ్డిపీరాస్వామి పలుకులు వేదాక్షరములవలె మందిరము నందంతటను ప్రతిధ్వనించెను—ఆమాటలువిని యాముువ్వురును నిర్విణ్ణులై పోయిరి! చిత్రప్రతిమలవలె నిలువఁబడిరి!—కొన్ని నిమిషముల కాలమెవ్వరినోటను మాట వెలువడలేదు—ఱెప్పలుత్రాల్పక యాతనింజూడసాగిరి. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములుకూడ స్తంభించిపోయెను. పీరాస్వామి మాత్రము చిఱునవ్వునవ్వుచు, కంటియద్దములలోనుండి నిశ్చలముగ వారివంకఁ జూచుచు నిలువఁబడి యట్లేయుండెను.

అనంతరము ముువ్వురినోటను, ఐక్యకంఠముగ నొక్కటేవిధముగు ప్రశ్నలు వెలువడెను.

"ఏమియిది?—ఎవ్వరిది?—ఎవ్వఁ డితఁడు?—"

భృగురామసర్కారు తన నల్లని సులోచనములను తీసివేసెను. నవ్వుచు అతఁడు వారివంకకుఁ జూచి యిట్లు గంభీరముగ వచించెను.

"ఆశ్చర్యపడకుఁడు—మిత్రులారా! ఆశ్చర్యపడకుఁడు! వీఁడు మీమిత్రుఁడు—ప్రఖ్యాత చోరాగ్రేసర చక్రవర్తి భృగురామసర్కార్....
...ఓహో! ఒకవేళ నేను అధికమైన చనువుగైకొని యపరాధముచేసి యుందును. క్షమింపవలెను—ఇప్పుడు నామిత్రులగు ఈముగ్గురుచోరుల నడుమను చిన్న రహస్యాలోచన సమావేశము జఱుగునుకాఁబోలును. ఇట్టి సమావేశములు మనవంటివారికి సహజములేకద! కీర్తిశేషులగు శ్రీశ్రీ ప్రతాపసర్కార్‌వారి విషయమును, కీర్తిశేషుఁడగు రాఘువుని విషయమును శ్రీప్రతాపసర్కారువారి యమూల్య నిక్షేపవిషయమును, త్వరలో కీర్తిశేషులుకానున్న ఘనతవహించిన శ్రీశ్రీశ్రీ శంకర, దుర్గాప్రసాద, అక్షయ మహాశయుల రహస్య సమావేశమునందు చర్చ

నీయాంశములు కాఁబోలును. దైవానుగ్రహమున, అందఱును కీర్తి శేషులైన పిదప—శ్రీ శ్రీ ప్రతాపసర్కారువారి యమూల్యనిక్షేపము చిరకీర్తిశాలియగు—శ్రీ శ్రీ భృగురామసర్కారువారి పాలిఁట పడ నున్నదనికూడ మీాసమావేశమునం దొక తీర్మానముగా—వీధిగాయకుఁ డగు ఈగ్రుడ్డివీరాస్వామి ముందుగా ఉపపాదించుచున్నాఁడు. అయ్యలారా! ఈగ్రుడ్డివాని ప్రార్థనను మఱువకుఁడు! మీారు మఱచినను భృగురామసర్కారు మఱచువాఁడు కాఁడని యెఱుంగుఁడు!..... సెలవు!—" అనిపలికి వారి కొకసలాముచేసి యటనుండి వెడలిపోయెను. గదియం దంతటను విస్మయదేవత తాండవించుచుండెను.



## ఐ ( ద వ ప్ర క ర ణ ము.

### రక్తసందేశము.

భైరవుఁడు సహజముగా—లోభత్వమునకు పేరువడసిన వాఁడు! అట్టివాఁ డిప్పుడు దుర్గాప్రసాదుని విశేషాదరముతో తన యింటనుంచుకొని గౌరవించుటయే కాక, భోజన పానీయాదులనుగూడ, తనతో సమానముగ జఱుపుచుండెను. ఇది లోకులకు కొంత విపరీతముగనే కనఁబడుచుండెను. కాని, విషయములను కొంచెము లోతుగా ఆలోచించిన యెడల భైరవునిచర్య లౌక్యముగా నుండిన నుండవచ్చునుగాని, విపరీతము గాదని బోధపడకపోదు. అతని యంతరంగ జీవితమునందు, సర్కారు వారి దృష్టియందు మహాపరాధములగు, అనేక రహస్యవిషయములు నిండియున్నవి. కొంచెమించుమించుగా—ఆ విషయములు దుర్గాప్రసాదునకు తెలిసినవే! అతఁడు వానిని పదిలముగ, తన గర్భమున దాచియుంచెను. అతఁడెప్పటికిని, వానిని బహిరంగపఱుపకుండుటకును, తన్ను సర్కారువారికి పట్టియీాయకుండుటకును, దుర్గాప్రసాదుని నోరుకట్టు

టకై—భైరవుఁడు—ఈ కృతిమాదరణకార్యమునఁ బ్రవేశింపక తప్ప దయ్యెను. కొన్నిదినములు సుఖముగా జీవితము గడచినను చాలునని దుర్గాప్రసాదుఁడు సంతోషముతో—నాతని యాతిథ్యమును, స్వీకరించు చుండెను.

హంతకునకు భీతిల్లి రంగూను పారిపోవలయునని, దుర్గాప్రసాదుఁడు తొలుత సంకల్పించెనుగాని, అక్షయ—భైరవ, దుర్గాప్రసాదుల రహస్యాలోచన సభయందలి తీర్మానముల ప్రకారముగా, అతని రంగూనుయాత్ర నిలిచిపోయెను. వారు ముగ్గురును—బెజవాడయందే యుండి—పోలీసువారి సహాయముతో—ఆత్మరక్షణము, చేసికొనఁ దలఁచి—యట్టి కట్టుదిట్టములు గావించుకొనిరి!

దుర్గాప్రసాదుఁడు మంచి పరిహాసప్రియుఁడు—సంఘమధ్యమున సర్వజనప్రీతి పాత్రమగు హాస్యప్రసంగములను గావించి—విచారములను పోగొట్టుటలో సమర్థుఁడు. అతని సహవాసము భైరవునకు సంప్రీతికర ముగనే యుండెను. అన్యోన్యసహవాసమున—వారిరువురును—తమ యాసన్నమరణ విచారముల నించుక మఱచియుండిరి. ఇప్పుడు క్రమముగా—ప్రసాదుఁడు తన పంక్తినుండకున్న—భైరవునకు భోజనము రుచించుటయే లేదు.

రాఘవుని హత్యానంతరమున, కొన్నిదినములు గడచినపిదప నొకనాటి ప్రాతఃకాలమున, భైరవ దుర్గాప్రసాదులు తేనీరు సేవింపఁ దలఁచి, బల్లవద్ద నాసీనులైరి. శుభ్రమైన తెల్లని వస్త్రము పరువఁబడిన యొక గుండ్రబల్లదగ్గఱ వేయఁబడిన రెండుకుర్చీలలోను వారిరువురును ఆసీనులై యుండిరి. సహజముగా వారిలో జరుగుచుండు ప్రసంగముల వలెనే ఆనాటి ప్రసంగమును బయలుదేరెను. అప్పటికి, ఏడుసంవత్సరములకు పూర్వమున జఱిగిన ప్రతాపుని యురిశిక్షకును, ఈనాటి రాఘవుని హత్యకును—హంతకునకును ఏదియో సంబంధముండక తప్పదని వారు ప్రసంగించుకొనుచుండిరి.

దుర్గాప్రసాదుఁడు జ్ఞప్తికిఁ దెచ్చుకొని, అతఁడుచెప్పినది నిజమే యని సమ్మతించెను. పళ్ళెరములను గిన్నెలను బల్లమీఁద నుంపక పూర్వము బల్లమీఁద గుడ్డ శుభ్రముగ నున్నమాట నిజము. ఇంతలో నెవ్వరికిని తెలియకుండ, ఆయక్షరము లచ్చటికి వచ్చుట పరమాశ్చర్య కరముగ నుండెను.

భైరవుఁడు కొంచెము యోచించి—"దుర్గాప్రసాద్! ఏదియెట్లు న్నను బల్లమీఁద కనఁబడుచున్న ఈయక్షరములు మాత్రము చేతితో వ్రాయఁబడినవి కావని నాబుద్ధికి దోఁచుచున్నది!" అనిపలికెను.

దుర్గా—వ్రాయఁబడినవికావా? అట్లయిన నీయుద్దేశ్యమేమి?

భైర—జాగ్రత్తగాచూఁడుము! అవి అద్దబడినవని తోఁచునో లేదో!— మతంగా! ఆస్థలమున నుంపఁబడిన పళ్ళెముయొక్క క్రిందిభాగ మును నన్నొక్కసారి చూడనిమ్ము."

మతంగుఁడు వట్టిపళ్ళెరమును తెచ్చిచూపెను. దానియడుగు భాగమునందింకను—తలక్రిందుగా వ్రాయఁబడిన ఎఱ్ఱని యక్షరముల గుఱుతు కాన్పించుచుండెను.

భైర—చూచితివి! ఇదిసంగతి—ఈముద్ర యీవిధముగా వేయఁబడినది! వేడిగానున్న పళ్లెరమును నీవు బల్లపై నొక్కితివి. అందుచేత నీయంతట నీవే పళ్ళెరమునుండి గుడ్డమీఁదికి—ఈయక్షరము లను ముద్రించితివి!

దుర్గా—అదియంతయు సహజముగనేయున్నది! అసలు పళ్ళెరపుఅడుగు భాగమునం దీయక్షరములను తలక్రిందులుగావ్రాసిన వ్యక్తి యెవ్వఁడై యుండును? ఆయక్షరములనైనను నాపళ్ళెముపై నేల వ్రాయవలెను?

ఆప్రశ్నకు జవాబు రాలేదు. భైరవుఁడుగాని, మతంగుఁడుకాని యందులకు ప్రత్యుత్తరము నొసంగలేదు.

దుర్గాప్రసాదుఁడు భయకంపితుఁడై పోయెను. అనుమానము—ఆగ్రహము—ఆతని నున్మత్తునిగా నొనరించుచుండెను.

దుర్గా—ఈవ్యవహారమంతయు నాకర్థమగుటలేదు. ఇట్టిచర్యలు నాకు పనికిరావు! నన్నీయింటినుండి బలవంతముగ వెడలఁగొట్టుటకై పన్నిన తంత్రముగా నున్నది! పోనిండు! మీకోరికయే నెరవేరఁగలదు. ఇట్టి భయంకరప్రదేశమున, నేనొకక్షణమైనను నిలుచువాఁడనుగాను. నా దారి నేను చూచుకొందును......మతంగా! నాసామానులను దెచ్చి బయటఁబెట్టుము! త్వరగాతెమ్ము—నేను వెడలిపోవుచున్నాను. భైరవా! నిన్నటిదినమున—మాటిమాటికిని నిన్ను నేను కష్టపెట్టకుండ ఒకేసారిగా నాకు ఐదువేల రూపాయలనిచ్చెదనంటివి. అవినాకిప్పుడుకావలెను. ఇచ్చెదవా?

భైరవుఁడు మాఱుమాటాడకుండ ఐఁదువేల రూపాయలనోట్లను తీసి ఇంకను గుడ్డపై స్పష్టముగాఁ గనఁబడుచున్న రక్తసందేశాక్షరములపై నుంచెను. దుర్గాప్రసాదు వానిని తన కోటుజేబులోనుంచుకొని, తన సామానును చేతఁబట్టుకొని, ఎవ్వరితోడ నేమియు మాటాడకుండ—అప్రసన్న వదనముతో వెడలిపోయెను. పోవుచున్నవానినిఁజూచి, మతంగుడు మొగమును పరిహాసవికృతముగా నొనరించి భుజములెగురవేసెను.

*  *  *  *

మతం—నీవెంతబుద్ధిహీనుఁడవు! ఒక్కమాఱుగ ఐఁదువే లిత్తురా? ఈపిశాచ మింతటితో వదలెననుకొంటివా? ఈధనమునంతను—ఏద్యూతమునందో—ఒక్కదినములో—నాశనముచేసికొని తిరిగి నీమీఁద పీఱుచుకొనిపడును!

భైర—ఉస్! మెల్లగా మాట్లాడు! తరువాతవచ్చుట యేమోకాని నీ కేకలు విని వాఁ డిప్పుడే రాఁగలఁడు—(రహస్యముగ) ఇచ్చట వానికేద్దియేని అపాయము సంభవించిన యెడల ఆనింద మన

మీఁదికి రాఁగలదు. ఈ దిక్కుమాలిన గొడవయంతయు మన కెందులకు? శని వదలిపోయినది! ఇంతేచాలు!

మతంగుఁడు తన యజమానివంకకు ఆశ్చర్యముతోఁ జూచుచు,

"అనగా—మీమాట నాకర్థముకాలేదు! మీరు వానిని చంపి వేయఁ దలంచుచున్నారా యేమి?" అని యడిగెను.

భైరవుఁడు వాని నోరుమూసి, "చాలు చాలు! అసందర్భ ప్రసంగముచేసి, లేనిపోని గొడవలు తెచ్చిపెట్టకు! రాఘవుని చంపిన హంతకునివలన వీనికి రానున్న అపాయమని నాయభిప్రాయము!" అని పలికెను.

మతం—అందులకై—అతఁడు వేరుప్రయత్నములో నున్నాఁడుగదా—భయమేమి?

భైర—వీని ప్రయత్నము ఫలించినప్పటిమాటగదా!—ఇదిగాక—వీని చేతిలో నిప్పుడు పుష్కలముగా ధనమున్నది! ధనముతో విరోధము సహజముగా వచ్చును. అందులో—దుర్గాప్రసాదుఁడు గుట్టుగా దినములు గడుపు స్వభావముగలవాఁడు కాఁడు! ఏజూద గాండ్రతోడనో—విరోధము పెట్టుకొనును! దానిని వాండ్రు చెలరేగి వీనిని హతమార్తురు. ఇదిగాక—దుర్గాప్రసాదు వీధి వెంట నడచునప్పుడు కడు నిర్లక్ష్యముగా వర్తించుచుండును! ఎప్పుడో యొకనాడు వీఁడు—ఏ మోటారుబస్ క్రిందనో—ఏ టాంగబండి క్రిందనో పడి ఘోరముగా మరణించును.

మతం—అదిసరిగాని—పశ్చిముక్రింది వ్రాతను నీయంతట నీవే వానికి చూపితివి! దానితో వానికి నామీఁద అనుమాన మెక్కువ యైనది!

భైర—వెఱ్ఱివాఁడా! నేను చెప్పకున్న ఆమాత్రము వాఁడు గ్రహింపలేఁడనుకొంటివా? వాఁడు స్వయముగా అనుసంధించుటకన్న మనము

ముందుగా చూపించినచో అనుమానము తగ్గునుగాదా! అందు లకై చూపితిని.

మతం—నీమీఁది అనుమానము తగ్గించుకొంటివి! నాపై నధికముచేసి తివి! ఇంతేకదా చేసిన ఘనకార్యము! నీవు చెప్పుటచేత ఆశనిని వదలించుకొనుటకై నేను చేసితినిగాని నాకిందులో నేమి సంబంధ మున్నదో చెప్పు—

భైర—పోనిమ్ము—అనుమానపడి వాఁడు నిన్నేమి చేయఁగలఁడు?

మతం—నాకొఱకుగాదు—నేను విచారించునది మీకొఱకే! హంతకుని బెదరింపులతోడనే ఏవేళకు మీ కేయపాయమునచ్చునో యని దుఃఖపడుచున్నాను. ఈ విరోధమొకటి క్రొత్తగా వచ్చినది! మీకేదైన అపాయముకలిగినచో నాగతియేమికావలెనో ఆలోచిం పుము! నాకు తల్లిలేదు. తండ్రిలేఁడు—మిత్రులులేరు. బంధు వులులేరు. అన్నియును నీవేయని నిన్ను నమ్మి బ్రమకుచున్నాను. ఇట్లు పలికి మతంగుఁడు గ్రుడ్ల నీరుగ్రుక్కుకొనెను. భైరవుఁడు వాని విశ్వాసమున కానందించి—యోదార్పసాగెను.

*        *        *        *        *

భైరవునిగృహము వదలిపోయిన తరువాత దుర్గాప్రసాదుఁడొక గుఱ్ఱపుబండిని మాట్లాడుకొని దానిలోఁ గూర్చుండి, బెజవాడపురమధ్య మునకుఁ గొనిపొమ్మని చెప్పెను. బండి నడచుచుండెను. దుర్గాప్రసాదు యోచింపసాగెను. అతఁడిప్పటికిని, రక్తసందేశమును రచించినవాఁడు భైరవుఁడుకాఁడని విశ్వసించుటలేదు. ఏఁడేండ్లక్రిందట—బహుజన సమక్షమునందు—సర్కారువారిచే ఉరిదీయఁబడిన ప్రతాపుఁడు—ఇన్ని నాళ్లకు బ్రదికివచ్చి తనపై పగదీర్చుకొన నున్నాఁడనిన మాట నెవఁడు విశ్వసింపఁగలఁడు?

బండి పురమధ్యమునకు వచ్చినపిదప, బాడుగ నిచ్చి పంపివేసి, "ఆనందభవనము" అను పేరుగల విశాలమగు హోటలునకు వచ్చెను.

ఆహోటలునందు భోజనములకును బసలకుగూడ తగిన ఏర్పాటు గలదు. హోటలుయజమానునితో మాటలాడి దుర్గాప్రసాదుఁడు అచట నొక విశాలమగు గదిని అద్దెకుఁ దీసికొని, ఒకనెల అద్దెను ముందుగా చెల్లించెను. ఇదిగాక—తన్ను నిరంతరము కాచి రక్షించుచుండుటకై— "రామన్న—భీమన్న—" అను నిద్దఱు ధైర్యసాహసములుగల కుఱ్ఱవాండ్రను జీతమునకు కుదుర్చుకొనెను. భైరవునికడనుండి తాను గైకొనిన ధనమునంతను, అతఁడు, ఆత్మసంరక్షణమునకై వినియోగింపఁ దలంచుకొనెను.

రామన్న, భీమన్నయను కుఱ్ఱవాండ్రకు, బుద్ధిబలమునకన్న శరీర బల మధికము. ఆబాలురు, తమ యజమానియగు దుర్గాప్రసాదునకు సంభవింపనున్న విపత్తు నాలకించి, అతనికొఱకై తమ ప్రాణములను గూడ ధారపోయుటకు సంసిద్ధులై యుండిరి.

దుర్గాప్రసాదుఁడు ఆబాలురతోకలసి సంచరించుచు—ఉత్సాహ వచనములతో వారి నానందింపఁజేయుచు, వారితో దినమెల్ల చీట్లపేక నాడుచు తనవిచార భయములనుగూడ కొంతవఱకు మఱచియుండెను. రాత్రులందుగూడ వారిని చెఱియొకప్రక్క నుంచుకొనియే నిద్రించు చుండెను. వారి కిద్దఱకును రెండు రివాల్వరుల నిచ్చి తానొకటి దగ్గఱ నుంచుకొని మిగుల జాగరూకుఁడై యుండెను.

ఇన్‌స్పెక్టరుసింగు—దుర్గాప్రసాదుని సర్వప్రయత్నములను గుర్తించియే యుండెను. తాను ఇన్‌స్పెక్టరుగానున్న కాలమునందు పట్టణమున జఱిగిన రాఘవుని హత్యకు, అతఁడు మిగుల లజ్జించెను—తన యుద్యోగకాలమునందు, మఱియొకహత్య జఱుగకుండ ప్రయత్నింపవలయునని, సింగు పంతముఁ బూనెను—దుర్గాప్రసాదుని ప్రయత్నముల కాతఁడెంతయు నానందించి తానుగూడ వానికి తగినసహాయము సేయ సంకల్పించెను. రామన్న భీమన్నల యొక్కయు—దుర్గాప్రసాదుని యొక్కయు రివాల్వరులకు లైసెన్సుగలదా లేదాయను విషయమున

జోక్యము కల్గించుకొనవలదని, అతఁడు తనభటుల కుపదేశించెను. అదిగాక దుర్గాప్రసాదుని, అతని బాలురను అనునిమిషమును కాచియుండ వలసినదనికూడ భటుల కాజ్ఞాపించెను. దుర్గాప్రసాదుని "లైఫ్ఇన్సూ్యరెన్సు" (Life Insurance) చాల విలువగలది. అతఁడెంత వేగముగ మరణించిన అంతవేగముగ అతని జ్ఞాతివర్గమున కాధనము సంక్రమింపఁ గలదు. కావున వారుగూడ సహజముగ దుర్గాప్రసాదునిచావుఁ గోరు చుందురు. అందుచేత, అతని బంధువులపైఁగూడ నొకకన్ను వేసియుండ వలెనని సింగు—పోలీసుభటుల కాజ్ఞయిచ్చెను.

ఒకనాడు నిరూపకుఁడగు గోవిందరావు దుర్గాప్రసాదునితో పరిస్థితులను సంభాషింపఁగా అతఁడు రక్తసందేశవార్తను నిరూపకున కెఱిఁగించెను. నిరూపకుఁడు వెంటనే భైరవుని యింటికేఁ బోయి—ఆ యక్షరములుగల భాగమును గుడ్డనుండి కత్తిరించి తనవద్ద భద్రపఱచుకొనెను.

ఇది జఱిగిన మఱుసటి దినమున గోవిందరావుగృహమున సింగు గోవిందరావు ఈ క్రింది విధమున ప్రసంగించిరి.

గోవిం—సింగూ! ప్రతాపునిపేరు నీకు జ్ఞాపకమున్నదిగాదా?

సింగు—ఆ— అనేకహత్యలు చౌర్యములుచేసి తుదకు ఏఁడు సంవత్సరములక్రిందట సర్కారువారిచే ఉరిదీయింపఁబడినవాఁడే కాఁడా?

గోవిం—ఔను. అతఁడే!—ఇది ఏఁడు సంవత్సరములక్రిందటి విషయముగాన, నీవు వాని జీవితకాలమునందలి స్వల్పవిషయములను మఱచియుందువు? కాని నాకు చాలసంగతులు, అచ్చుగ్రుద్దినట్లు జ్ఞప్తియందున్నవి! వానిలో—ముఖ్యమైన విషయము అతని చేతివ్రాత—ఏఁడేండ్లక్రిందట మరణించిన ప్రతాపుని స్వహస్తాక్షరములు నేఁడు మరల కాన్పించుచున్నవి! ఇది యెంత చిత్రము?

సింగు—ఏమి? నేఁడు మఱల గాన్పించుచున్నవా? ఎచ్చట? ఎట్లు?

గోవిం—ఈవస్త్రఖండముపైఁగల అక్షరములను చూడుము!

గోవిందరావు రక్తసందేశ వస్త్రఖండమును సింగునకుఁ జూపి, తత్సంబంధమైన విషయముల నన్నిటి నెఱిఁగించి—పూర్వపు ప్రతాపుని హస్తాక్షరములుగల రెండు మూఁడు లేఖలనుగూడ నిదర్శనమునకై చూపెను.

సింగు—నిజమే! ఇది ప్రతాపుని దస్తూరివలెనేయున్నది! కాని ఏఁడేండ్ల క్రిందట ప్రతాపుఁడు—ఉరిదీయఁబడిన సంగతి లోకమంతయు నెఱుఁగును!

గోవిం—సింగూ! నీవు చెప్పినది నిజమే! కాని, అప్పుడు కారాగృహ శిక్ష విధింపఁబడిన—ప్రతాపుని యనుచరులగు నలుగురి విషయమును, నేనింకను విమర్శింపవలసియున్నది. కొన్నినాళ్ల క్రిందట—భృగురాముఁడను చోరుఁడుగూడ, నాకిదియే సూచించి యున్నాఁడు. ప్రతాపుని అనుచరులు నలుగురు. శంకరుఁడు—దుర్గా ప్రసాద్—రాఘవుఁడు—అక్షయుఁడు. రాఘవుఁడు అంత ముఖ్యమైనవాఁడు గాఁడు. వాఁడే భైరవుఁడనువాని గుమ్మమున ఉరి తీయఁబడి వక్షమున కళావరునాల్గుముక్క యుంపఁబడినవాఁడు. ఇప్పుడు హత్యకు సిద్ధముగానుండి హంతకునిచే వెఱపింపఁబడు చున్నవాఁడు దుర్గాప్రసాదుఁడు—ఏఁడుసంవత్సరముల కారాగృహశిక్ష విధింపఁబడి అనతికాలముక్రిందటనే విడుదలయైన వాఁడు అక్షయుఁడు—నాల్గవవాఁడు శంకరుఁడు! వీని పోఁబడి అంతగా తెలియుటలేదు. కాని వానిని గుర్తింపఁదగిన ఆధారములు నాకడనున్నవి! నాయభిప్రాయమే నిజమగునెడల వానిని నిదివఱకే నేను గుర్తించితినని తలంచెదను.

సింగు—ఏమి? నీవు వానిని గుర్తించితివా?

గోవిం—అప్పుడే స్థిరముగా జెప్పఁజాలను. గుర్తించితినని నా నమ్మకము—ఐనను నేను పొరబడియుందును. మఱియొకసారిచూచినఁ గాని చెప్పలేను.

# ఆఱవ ప్రకరణము.

## డైమను మూఁడు.

ఆనందభవనము హోటలునందలి మూఁడవఅంతస్తు గదులలో నొకదానియందు దుర్గాప్రసాదు ప్రవేశించి యింకను, ఒకవారము గడువకముందే—అతనిగదికి ప్రక్కగదియందే యొక నూతనుఁడు అద్దెకు వచ్చి ప్రవేశించెను. ఆమందిరపు మూఁడవ అంతస్తునకు రెండుగదులు మాత్రమేయుండెను. ఆనూతనుఁడును ఒకనెల అద్దెను ముందుగా—గృహాధికారికి చెల్లించియుండెను. ఆయింట అద్దెకున్నవారిలో—ఇప్పటి నూతనునకును—మన దుర్గాప్రసాదునకును, అతని పరిజనులగు బాలురకును దప్ప మఱియెవ్వరికిని, మూఁడవ అంతస్తు పైకెక్కి-రావలసిన అవసరము కలుగదు.

ఈనూతనుఁడు విచిత్రముగా చూడఁదగినమానవులలో నొకఁడై యుండెను—అతని శిరోజములు—రంగుపూయుటచేతనో—సహజముగనో కాని, జేగురురంగుగలవియైయుండెను. నోటిలోని దంతములలో నొక్కటిమాత్ర మన్నిటికన్న పెద్దదియై ముందునకువచ్చి వికృతముగా కాన్పించుచుండును. అతఁడు వచ్చినదినముననే జనసామాన్యమునందు "ఎఱ్ఱతలవాఁడు" అని వాడుక పడిపోయెను.

ఆపురుషుఁడు తానటకువచ్చిన దినముననే రాత్రికాలమునందు, తన యింటి నడికప్పునంకకు తేరిపారఁజూచి, తుద కతిప్రయాసమున నిశ్శబ్దముగా, బయటి వరండానుండి, నడుకప్పునకెక్కి—ఒకమనుష్యుఁడు సులభముగా దూరిపోఁగల్గినంత విశాలముగా—పెంకులను తొలఁగించి లోపలి వెదురుతడకను కోసివేసెను. ఇదియంతయు నాతఁడు మఱియొకని చెవికి శబ్దముసోకనంతటి యుపాయముతో నొనరించెను. అప్పటికి చాలరాత్రి మీరినందున, నాతఁడు యథాప్రకారముగా గదిలోఁ బ్రవేశించి, కొంతతడ వేదియో గ్రంథపఠనమును గావించి యారాత్రికి సుఖముగా నిద్రించెను.

మఱునాడు సాయంకాలము—దుర్గాప్రసాదుఁడు తన యిద్దఱు బాలురతోఁ గలసి మేడదిగి బయటికెక్కడికో విహరింపఁబోయెను. దుర్గాప్రసాదుని రాకపోకల నతిజాగరూకతతో అనుక్షణమును కనిపెట్టుచునేయున్న ఎఱ్ఱతలవాఁడు, గతరాత్రివలెనే, డాబామీఁదనుండి తిన్నగా యీసారి దుర్గాప్రసాదునిగది పైకప్పున కెగఁబ్రాకి తన గదికప్పునువలెనే దానిని గూడ మనుష్యుఁడు దూరఁగల్గినంత భాగము పెంకులను తొలఁగించి వెదురు తడకనుకోసి, యొక త్రాటిసహాయమున దుర్గాప్రసాదుని గదిలోఁ బ్రవేశించి క్రిందరాలిన పదార్థమునంతను, కొంచెమైన నుండకుండ శుభ్రపరచి తిరిగి త్రాడుపై కెగఁబ్రాకి కప్పునకు వచ్చెను. అచ్చట తాను తొలగించిన వెదుళ్లను పెంకులను యథాప్రకారముగా సర్ది—తీసినజాడ తెలియకుండఁజేసి, మరలఁ దనగటలోనికివచ్చి పరుండెను. ఈ కలాపమునంతను పూర్తిచేసి ఎఱ్ఱతలకాయవ్యక్తి తన గదిలోనికి వచ్చిన నాల్గయిదు నిమిషముల లోపలనే, దుర్గాప్రసాదుఁడు రామన్న భీమన్నలతో—గదిలోఁ బ్రవేశించిన సవ్వడి వినవచ్చెను.

ఇంచిపేటలో రాఘవుఁడు హంతకునిచే—ఉరిదీయఁబడి యిప్పటికి సరిగా—ఇరువది దినములైనది. తెల్లవాఱిన—ఇరువదియొకటవదినమగును. ఎఱ్ఱతలవాఁడు తన గదిలోఁ గూరుచుండి, తత్కాలపరిమాణమును లెక్కించి తెల్లవాఱినచో—ఇరువదియొక్కటవదినము—అనగా మూఁడు వారములు కాఁగలవని స్థిరపరచుకొనెను.

తెల్లవాఱుజామున 5 గంటలకు ఎఱ్ఱతలవాని తలక్రిందనున్న గడియారము అలారమ్ (ALARM) మ్రోగించినందున అతనికి మెలకువ వచ్చెను. వెంటనే యతఁడు గడియారపుధ్వనిని నిలిపివేసి, కిటికీతలుపు తెఱచి బయటి ప్రకృతిని తిలకించెను.

అది శీతకాలమగుటచేత పొగమంచు సర్వత్ర వ్యాపించియుండెను. ఇంకను చీకట్లు విడిచిపోవలేదు. గజము దూరమునందున్న వ్యక్తియుఁ గాన్పించుటలేదు. తన కార్యమున కది యెంతయు తగియున్న

దని తలంచి యాతఁడు త్రాటిసహాయమున తన గదిలోని పైకప్పురం ధ్రముద్వారా—గృహోపరిభాగము నారోహించి, అచ్చటి రంధ్రమును గూడ తెఱచి లోనికిఁజూచెను. దుర్గాప్రసాదుఁడు ఒంటరిగ దుప్పటిగప్పు కొని తన మంచముపై నున్న శయ్యపైఁ బరుండి నిద్రించుచుండెను. అతని పదపార్శ్వమున దీపము వెల్గుచుండెను.

*　　*　　*　　*

ఆయుదయమున ఆఱుగంటల ఐఁదునిమిషములు గడచినపిదప, డిటెక్టివు గోవిందరావునాయుఁడును, ఇన్‌స్పెక్టరు సింగును కలసి దుర్గా ప్రసాదుని గుమ్మముకడకు వచ్చిరి. వారి వెనుకనే, ఒకడాక్టరును— చిన్న ఛాయాపట యంత్రమును గైకొని ఛాయాపటగ్రాహియును వచ్చిరి. అంతలో పెద్దపెట్టున రోదనముచేయుచు, రామన్నయు భీమ న్నయు వారికెదురుగావచ్చి—"ఘోరము జఱిగినది! భయంకర దృశ్యము! మా యజమాని ఉరిదీయఁబడినాఁడు!" అని పలికిరి. అంద ఱును సంభ్రమాశ్చర్య పరవశులై పోయిరి! ఎవ్వరినోటను మాటలేదు.

ఒకరితోనొకరు మాటాడకుండ నడచుచు—అందఱును కలసి, దుర్గాప్రసాదుని గదిలోనికిఁ బోయిరి. దుర్గాప్రసాదుని శరీరము, ఉరి దీయఁబడి, ఆ గదినడుమ గాలిలో వ్రేలాడుచుండెను! అతని శిరస్సు మేడ పైభాగమునకు తగులుచుండెను. నాలుకబయటికివచ్చి నోటియం దొక ప్రక్కగా వ్రేలుచున్నది! కన్నులలోని గ్రుడ్లు బయటికి వచ్చెను. రక్తము మొగమునఁజేరుకొని నల్లనయ్యెను?—మేడకు వేయఁబడిన ఉరి త్రాడు బలముగా మాంసములోనికి బిగుసుకొనియుండెను. కుడిచేతి నుండి యింకను రక్తము స్రవించుచునే యుండెను!—

ఇన్‌స్పెక్టరు సింగు రామన్నను—భీమన్నను కొంతసేపు బెద రించి చూచెను. కాని వారు తమ కేమియుఁ దెలియదని గోలుగోలున నేడువసాగిరి! రామన్న యిట్లు చెప్పెను.

అయ్యా! గతరాత్రి—మేమిద్దఱమును ప్రసాదుగారి గదిలోనే పరుండుచుమని చెప్పితిమి; కాని, అప్పుడాయన కొంచెము సురాపానము చేసియుండినందున, మామాటలను లక్ష్యపెట్టక "నేనేమి పిఱికిపంద నను కొంటిరా! హంతకుఁడు రానిమ్ము—హరిహరులు రానిమ్ము—ఒక్క దెబ్బన హతమార్చెదనని ఏమేమో బీరములుపలికి,తుదకు తానొక్కఁ డేపరుండెను. మేమిద్దఱమును మెట్లమీఁది అరుగుపైఁ బరుంటిమి. గది తాళపు చెవులు మావద్దనేయున్నవి. బయటవేసినబీగము వేసినట్లే యున్నది. ఉదయమున కాన్‌స్టేబిలు నన్ను నిద్రలేపెను. మేము ముగ్గురమును వెళ్ళి తలుపుతెఱచి చూతుముగదా మాయజమాని, ఘోరముగా ఉరిదీయఁబడి వ్రేలాడుచుండెను. హంతకుఁడు వచ్చినధ్వనిగాని ఉరిదీసినధ్వనిగాని మాకెంతమాత్రమును వినఁబడలేదు!"

శవమును పరీక్షించి—డాక్టరు యిట్లు చెప్పెను.

"ఇంక నెట్టియాశయును లేదు. సంపూర్ణముగ చనిపోయినాఁడు! ఒక్కయురివలనమాత్రమేకాదు. శరీరమునందు విషముగూడ వ్యాపించి యున్నది. సరిగా ఆఱుగంటల కితఁడు మృతినొందెను!"

డెటెక్టివు గోవిందరావు—పై మాటల నన్నిటిని సరిగా వినుచుండెనో లేదోకూడ చెప్పఁజాలము! అతఁడు తీవ్రమైన యాలోచనమున మునింగి యుండి, తలవంచుకొని గదిలో నటునిటు దిరుగుచుండెను. అట్లు తిరిగి తిరిగి యాతఁడు తుదకొకచోట నిలచి నేలవంక కొకమారును, ఇంటి కప్పువంక కొకమారును పరిశీలించిచూచి, నేలపై బడియున్న పదార్థమును దేనినో జాగ్రత్తగా నొకకాగితమునందు భద్రపరచెను.

సింగు నిరూపకుని చర్యలను పరిశీలించి చూచుచు—"వెదురు పొడివలెనున్నది! అంతేకాదా?" అనియెను.

డెటెక్టివు ఇంటికప్పువంకకు సింగును చూడుమని చూపుచు—

"ఇదియంతయు అర్థమైనదా? తాళము వేయఁబడియుండఁగనే గదిలో హత్యయెట్లు జఱిగినదో బోధపడినదా?" అని యడిగెను.

సింగు — ఆ — తెలిసినది! ఇంటికప్పును తొలఁగించి — హంతకుఁడు లోపలఁ బ్రివేశించినాఁడు. పెంకులనుతీసి, వెదుళ్లను కోయుటలో కొంత పొడి నేలరాలినది.

డెటె — కేవలమింత స్వల్పపొడి రాలియుండదు. ఇంకను విశేషముగా రాలియుండును. హంతకుఁడు, గదిలో ప్రవేశించి చాలభాగము శుభ్రపరచినాఁడు. అతని కంటఁబడక మిగిలిన పొడిమాత్రమే మన నిరూపణ కాధారముగా నిలిచినది! నిన్న సాయంకాలము దుర్గాప్రసాదు తన బాలురతో — గదివిడచి బయటికిబోయినట్లు కాన్‌స్టేబిల్సు వలన మనకు తెలిసినది! ఆసమయమున హంతకుఁడు దీని నంతను సిద్ధపఱచియుంచుకొనెనని తోచుచున్నది! వాఁడు ధ్వనికలుగకుండుటకై — కాళ్ళకు రబ్బరుపాదరక్షల నుపయోగించి యుండును! ఆ రబ్బరుపాదరక్షలగుఱుతు స్పష్టముగా నేలపైఁ గనఁబడుచున్నది! దీని ఛాయాపటమును తీసి యుంచుకొనుట మంచిది.

తరువాత పోలీసుఉద్యోగుల యాజ్ఞాప్రకారము — భటులు దుర్గాప్రసాదుని శవమును త్రాటినుండి క్రిందికిదింపి శయ్యపైఁ బరుండఁజేసి దుప్పటిఁగప్పిరి. పిదప త్రాటిసహాయమున నిరూపకుఁడు ఇంటికప్పున కెగఁబ్రాకి అచ్చట నామకఃపేర్పఁబడిన పెంకులను వెదుళ్లను తొలఁగించి ఇంటి పైభాగమున కెక్కి — చూడగా ప్రక్క — గది — కప్పునందుగూడ నిట్టి రంధ్రమే కాన్పించెను. సంగతియంతయు తేటతెల్లముగ నాతని కర్థమైపోయెను. వెంటనే యాతఁడు రెండవ రంధ్రముమూలమున ఎట్టితల వానిగదిలోఁ బ్రివేశించెను. ఆగది నిర్మానుష్యముగా నుండెను. తలుపుఁదెఱచుకొని గోవిందరావు బయటికి వచ్చెను. అచ్చట నొక కాన్‌స్టేబిలు నిలువఁబడి యుండెను. అతనిఁజూచి నిరూపకుఁడు,

"ఈ గదిలో — అద్దెకున్న పెద్దమనుష్యుఁడు బయటికి వెడలిపోయెనా?" అని యడిగెను.

కాన్‌స్టే—చిత్రము! ఒక అరగంటకుపూర్వము—హత్య జరిగినసంగతి తెలియకముందే అతఁడు బయటికిఁ బోయెను.

డెటె—బహుశః వానిచేతిలో నొక సూటుకేసుమాత్రమే యుండి యుండును.

కాన్‌స్టే—చిత్రము. అంతే_

డెటె—బయటికిఁబోయిన ప్రతాపుఁడు తిరిగి యెన్నఁడును ఈ గదిలోనికి రాఁడు.

కాన్‌స్టే—విస్మితుఁడై—"అయ్యా! మీ అభిప్రాయము నాకు బోధపడుటలేదు. ప్రతాపుఁడు మరణించినాఁడు కాదా?" అనియెను.

డెటెక్టివు పరధ్యానముగ—తలపంకించి—"చచ్చియేయుండవలెను. ఇదివఱకు చావకున్న—ఇఁకనైనను, చావక తప్పదు—" అని గొణుగుకొని, దుర్గాప్రసాదునిగదికి వచ్చెను—అతఁడు వచ్చునప్పటికి, ఇన్‌స్పెక్టరుసింగును—రామన్న—భీమన్నలును, ఇరువురు భటులును ఒక చిట్టిపేకముక్కను పరిశీలించి చూచుచుండిరి!

ఇన్‌స్పె—డెటెక్టివ్ మహాశయా! మేమిప్పుడు పరిశీలించునది యేమో చెప్పఁగలవా?

డెటె—ఆ—చెప్పఁగలను. అది, దుర్గాప్రసాదుని వక్షఃప్రదేశమున మీకు దొరికిన డైమనుమూఁడు ముక్క!

ఇన్‌స్పెక్టరు—విస్మితుఁడయ్యెను.

ఇన్‌స్పె—అట్లయిన—అది...నీవు చూచితివా యేమి?

డెటె—లేదు—నేను చూడలేదుగాని—అట్లూహించితిని!...అది సరిగాని నాతో నొకమాటువచ్చి దుర్గాప్రసాదును హత్యచేసిన హంతకునిగదిని చూడఁగోరెదవా?—అతఁడు ప్రతాపుని పేరుమీఁద సంతకముచేసి, అద్దెచెల్లించి ఈ ప్రక్కగదిలోననే ప్రవేశించి యుండెను.

వెంటనే—పోలీసు ఉద్యోగులిద్దఱునుఁ కలసి ప్రక్కగదికిఁబోయిరి. ఆ గదినంతను వెదకిరి. ఆగదిలో నేమియుఁ గాన్పింపలేదు. అంతటితో తృప్తినొందక—గోవిందరావు—ఆనందభవనాధికారి సహాయముంగొని, పోలీసుభటులతో ఆ హోటలునందుగల ప్రతిగదిని—ప్రతి యత్యల్ప ప్రదేశమును, అత్యంత జాగరూకతతో వెదకియు తృప్తినొందఁడయ్యెను. అతఁడు మఱల మఱల చూచినచోటనే చూచుచు, వెదకినచోటనే వెదకుచు—గదులు—చావిడులు, వరండాలు, మెట్లుమూలలు—మరుగుదొడ్లు—వంటశాలలు—భోజనశాలలు—అది యిది యననేల?—చీమచొఱ నశక్యమగుప్రదేశములనుగూడ వేయికండ్లతో వెదకుచుండెను.

సింగు—మీరు దేనికొఱకై—ఇంత సూక్ష్మదృష్టితో వెదకుచున్నారు?

డెలె—ఒకసిరంజి (SYRING) కొఱకు వెదకుచున్నాను!

సింగు—(ఆశ్చర్యముతో) సిరంజికిని, ఈ హత్యకును సంబంధమేమి?

డెలె—సంబంధమా! ఉన్నది!—దుర్గాప్రసాదుని చేతిమీఁద మనము చూచిన గాయము, సిరంజితో చేయఁబడినది! నేటి యుదయమున ఆగదిలో—దుర్గాప్రసాదునకును హంతకునకు—ఒక పెద్ద యుద్ధము జఱిగియుండుననియును, హంతకుని శరీరమున దుర్గాప్రసాదుఁడు అధమము ఒకగాయమైనను చేసియుండకపోఁడనియు తుదకు హంతకునకు, లొంగిపోవుటచే—ఉరిదీయఁబడెననియును మీయందఱి యభిప్రాయము కాఁబోలును! అట్లైయెనచో—నావిమర్శనమును క్షమింతురుగాక! గదిలో—ఏమాత్రపు కలహము జఱిగియుండినను—బయటనున్న బాలురుగాని, పోలీసు భటులుగాని తప్పక వినియుండవలసినది! అదిగాక—ఇంత సమీపమున, తన మృత్యువుగలదని, దుర్గాప్రసాదునకు ఏమాత్రపు సూచనమైయుండినను—ఇంత సులభముగా—ఉరిదీయఁబడుట, జఱిగియుండెడిదిగాదు. ఇప్పుడు సిరంజికిని ఈ హత్యకును, ఎంత

నన్ని హితసంబంధముగలదో చెప్పెదను వినుము! దుర్గాప్రసాదుని శరీరమున విషప్రయోగము చేయఁబడినదని డాక్టరు చెప్పిన మాటలను స్మృతియందుంచుకొనుము. హంతకుఁడు—నిద్రించుచున్న దుర్గాప్రసాదును హఠాత్తుగా ఉరిదీయుట కెన్నఁడును సాధ్యము కాదు. అతనిమెడ త్రాడువేసి ఉచ్చుబిగించుట కనుకూలమైన స్థితియందుండవలెనుగాదా! అందులకై హంతకుఁడీ "సిరంజి" నుపయోగించి యుండును! దానిని చేతికి గ్రుచ్చినచో—ఆబాధకు అతఁడుమేల్కని లేచికూర్చుండి ముందుగా తనచేతివంక పరిశీలించుట సహజము! ఆ తరుణమున ఉరివేసి చంపుటకు—వీలు గల్గియుండును. మరణము తాను మొదటతలంచినంతకన్న సులభముగ గల్గుటకై వట్టి సిరంజిని గ్రుచ్చనేలనని హంతకుఁడు దానియందు కొంత విషమునుగూడ మిళితముచేసెను. ఇది యంతయు నాతఁడు గదిలోనికి దిగకుండ ఇంటికప్పుమీఁదనే యుండి చేయుటసాధ్యము! ఉరివేసి కళేబరమును పైకిలాగుకొనినపిమ్మట— దైవమను మూఁడుముక్కను వక్షమున నుంచియుండును. అప్పటికింకను దుర్గాప్రసాదునిగదిలో దీపము వెల్గుచునేయుండినందున హంతకుఁడు కడు సులభముగా తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనియెను! చీమ చిటుకుమన్నంత ధ్వనియైనఁ గానక్కఱలేకుండ హత్య జఱిగిపోయెను.హత్యోదంతము బయల్పడకముందే—హంతకుఁడు తన సూటుకేసును చేతఁబట్టుకొని నిర్భయముగా— పెద్దమనుష్యునివలె గదినుండినడచి వెడలిపోయెను. అర్థమైనదా?

డెటెక్టివు గోవిందరావు అద్భుతముగా—జఱిగిన విషయములను కంటితోఁ జూచినట్లుగా—నొనరించిన యీ నిరూపణమునకు ఇన్స్పెక్టరు సింగు విస్మయభ్రాంతుఁడై పోయెను.

సింగు—అంతయును బాగుగనేయున్నది గాని—తొలుత రాఘవుని, ఇప్పుడు ప్రసాదుని కడు నైపుణ్యమున చంపిన యీ హంతకుఁ

డెవ్వఁడై యుండును?—ఈ హత్యలు ప్రతీకారవాంఛతో చేయ బడినట్లుమాత్రము స్పష్టమగుచున్నది! అందులో సందేహ మేమియునులేదు!— గోవిందరావుగారూ! మీరును అట్లే తలం తురని నానమ్మకము! ఏఁడుసంవత్సరములక్రిందట ప్రతాపుఁడు సర్కారువారిచే—ఉరిదీయఁబడుటకు కారకులైన యీ నల్వు రికిని తగిన ప్రతీకారము చేయుటకై —ఎవ్వఁడో సంకల్పించె నని నేను నమ్ముచున్నాను. ప్రతాపునిపేరుమీఁదనే ఈ హత్యలు జఱుగుచుండుటవలన అట్లు తలంపవలసి వచ్చుచున్నది! ప్రతా పుని వేషమునే అనుకరించి—యీ హంతకుఁ డాతని యాకృతితో వేషము వేసికొనెననికూడ నాతలంపు.

గోవిం.—వేషము వేసికొనుటయనిన నాకు విశ్వాసము కల్గుటలేదు.

సింగు—ఎందుచేత?

గోవిం—ప్రతాపున కొక కవలసోదరుఁ డుండియుండును!

సింగు—లేఁడు—లేఁడు—ఆవిషయమునంతను నేను చాల లోతుగా విచారణ చేసితిని! ప్రతాపునితండ్రికి ప్రతాపుఁ డొక్కఁడే కుమారుఁడు. వానికి అన్నదమ్ము లెవ్వరును లేరు! వాఁడు ఏకాకి—స్నేహితులుగూడ నెవ్వరునులేరు!

గోవిం—మంచిది. అట్లయిన ప్రతాపునివిషయమై— పోలీసువారు ఎంతవఱకు విషయ సంగ్రహముచేసియుండిరో—ఆ రికార్డునంతను నే నొకమాఱు పరిశీలనగ చూడవలసియున్నది. వానిని నాకు మీరు నేఁడే చూపవలయును. సగము తెలిసియు సగము తెలియక యువ్యవహారమునఁ బ్రవేశించుట ప్రమాదకరము!—హంతకుని దృష్టిలోనున్న నలువురి చరిత్రలునుగూడ విమర్శింపవలసియున్నది.

సింగు—అందులో—ఇద్దఱు హత్యచేయఁబడిరి. ఇఁక నిద్దఱేకాదా మిగిలియున్నది!—

గోవిం—ఔను. ఇఁక ఆఱీను రెండును, ఇస్పేటుఆసును ప్రదర్శింపఁ బడనున్నవి!

## ఏ ( డ వ ప్ర క ర ణ ము.

### అటిక రెండు.

అక్షయుఁడు—కారాగృహమునుండి విడుదలమై వచ్చినపిదపఁ గూడ తన ప్రాతబసయగు రైలుపేటలోని 142 వ నెంబరు గల తుల సెమ్మయింటనే బసచేయుటచేత—అతని యునికి నెఱుంగుటలో పోలీసు వారికంత శ్రమగలుగలేదు. డెటెక్టివు గోవిందరావు అతనికడకు వెళ్ళి—హంతకుని దృష్టియందు తరువాత వంతు నీదేయని అక్షయునకుఁ జెప్పి వెఱపించెను. కాని, ఆమాటల నతఁడు లక్ష్యముచేయక దర్పముతో—"ఆయుర్దాయము చాలనప్పుడు భగవంతుఁడు తీసికొనిపోవలెనేమో గాని హంతకుఁడెవ్వఁడును నన్నుచంపఁజాలఁడు. కిక్కురుమనకుండ రహస్యముగ చంపివేయుట కిది, రామవరప్పాడుగాదు—గుణదలకాదు బెజవాడబస్తీ—అదిగాక మీవంటి సమర్థులగు పోలీసువారు కంటికి ఱెప్పవలె రక్షించుచుందురు. నాకింక భయమేమి?" అని పలికెను.

అక్షయుని జీవితకాలమధ్యమున అతనిని పోలీసువారురక్షించుట కిదియే ప్రారంభదశ—బహుశః—ఇదియే అంత్యదశకూడ నగునేమో!

అపరాధరహస్య పరిశోధకు లాతనిని హెచ్చరించుచున్నను—దినదినక్రమమున, తన్ను మృత్యువు సమీపించుచున్నదని, సహజముగ, నాతఁడెఱింగియున్నను, అతఁడు రైలుపేటలోని, తులసెమ్మ ఇంటిని మాత్రము విడువలేదు. అక్షయుఁడు ప్రత్యేకించి అంత మహావిజ్ఞానశాలి కాకున్నను, ఈ ప్రపంచకమునందలి యితరప్రదేశము లన్నిటికన్నను తాను చిరకాలమునుండి నివసించుచున్న తులసెమ్మ యిల్లే—తనకు విశేష రక్షణస్థానమని అతఁడు విశ్వసించెను.

రైల్వే డిపార్టుమెంటువారి నివేశనములకు సమీపముగా—నేల మట్టమునకు ఎనుబదియడుగుల ఎత్తుననున్న తులసెమ్మమేడలోని మూఁడవ అంతస్తుగదిలో—అక్షయుని నివాసము!—

తన్ను బలవంతముగా మృత్యుదేవత వెంటాడుచున్నదని—ఒక విధమైన నమ్మకమేర్పడినపిదప—అక్షయుఁడు, తత్ప్రతీకార ప్రయత్నములయందు త్వరపడఁజొచ్చెను. సింహద్వారమును సాధ్యమైనంతవఱకు—తెఱచియుంపవలదని, అతఁడు గృహయజమానురాలిని ప్రార్థించెను. ఆ గృహమునందు అద్దెకు నివసించుచున్న ఇతరగృహస్థులందఱకును తన స్థితి నాతఁడెఱిఁగించి, తామును కూడ తగినంత జాగ్రత్తగా కనిపెట్టియుండవలెనని ప్రార్థించెను. అతఁడు కొంచెమించుమించుగా వారిలో నందఱిని చాలదినములనుండియు, ఎఱిఁగియున్నవాఁడే! వారివలన తనకెట్టియపాయమును గలుగదని, అక్షయునకు దృఢవిశ్వాసము గలదు. కాని, ఒక్క వ్యక్తిమాత్రమే వారిలో తనకు నూతనుఁడుగా కాన్పించెను.

ఆవ్యక్తి బక్కపలుచని శరీరావయవములుగలవాఁడు! అతఁడొక వారముదినముల క్రిందటనే అచటికివచ్చి అద్దెకు ఒకగదిలో నివసించుచున్నాఁడు. అతఁడు బెజవాడలో మారుతీ సినీమాహాలులో హార్మోనియం వాయించు ఉద్యోగమునందున్నాఁడు—

అక్షయుఁ డాతని రాకపోకలను, ప్రవర్తనమును సూక్ష్మబుద్ధితో రహస్యముగ పరిశీలించుచునే యుండెను. మేడమెట్లు—ఎక్కి దిగుచుండుటలో—రెండుమూఁడుసారు లాతనిని కలిసికొనిగూడ మాటలాడి యుండెను. సినీమాహాలులో అతని హార్మోనియమును—బసలోనున్నప్పుడు అతని ఫిడేలును—సంగీతమును అదియే ఆతని ప్రపంచకముగాని, ఇతర ప్రపంచకపు గొడవలతో నావ్యక్తికి—ఎట్టి సంబంధమును లేదని, దృఢముగా నెఱింగినపిదప—అతనిని—గూడ, ఇతరుల నఱువటినివలెనే నిరపాయకరమగు మనుష్యునిగా—అక్షయుఁడు విశ్వసించెను.

అందువలన తన్ను చంపదలంచి వచ్చు హంతకుఁడు మొదట సింహద్వారమునను, తరువాత తన గదిద్వారమునను రావలసియుండునని యును, వానిని రెంటిని తగినంత భద్రముగనుంచినయెడల హారిహారులైన లోనికి జొరఁజాలరనియు—ఈ రెండుద్వారములను భేదించుకొని ఒక

వేళ లోనికి హంతకుఁడు రాగల్గినను వానిని వెంటనే చంపవచ్చునని యును–ఒక రివాల్వరునుగూడ సిద్ధముగ నుంచుకొని అక్షయుడు దానిని సదాగుండ్లతో నింపియుంచెను. తన గదితలుపునకు తాను లోపల నున్న ప్పుడుగూడ భద్రముగా తాళమువేసి యుంచుచుండెను. ఇప్పటి హత్యా సంబంధమగు గంద్రగోళము రానప్పటినుండియుఁగూడ పోలీసుభటులు సహాజముగ నిరంతర మాతని వెంటనేయుండి, అతని ప్రవర్తనమును కని పెట్టుచుండుట వాడుకగానుండెను. ఈపద్ధతి ఇదివఱలో నాతని కసహ్యా కరముగానేయుండెడిది. కాని, ఇప్పుడాతని కదియెంతయు ననుకూలము గను, సహాయకరముగను కాన్పించెను.

అతఁడు—ఆత్మరక్షణమునందు సంపూర్ణమైన జాగరూకతతో నుండి హంతకుని కంట దుమ్ముగొట్టితిననియును, రాఘవుఁడును, ప్రసా దుఁడును వట్టి చవటపెద్దమ్మలై మరణించిరనియును తలంచి వారి తెలివి తక్కువకు తనలోఁదానే పరిహసించి నవ్వుకొనెను.

అతఁడు తన గదితలుపులకును గవాక్షములకును తాళములు వేసి, మఱిమేకులతో బంధించివేసెను. బయటి దీపములును—మెట్లదగ్గఱి దీప మును, మెట్లమీఁది దీపమునుగూడ నిరంతరము వెల్గునట్లు కట్టుదిట్టము చేసికొని, వానికి ప్రత్యేకముగ సొమ్ము చెల్లించుచుండెను. అంతయును తగినంత జాగ్రతలోనుండెను. కాని తనగదిలోని ఒక్క కిటికీమాత్రము మొదటినుండియు ద్వారములేకుండెను. అది తన గదిలోనికి గాలియు వెలుగును వచ్చుట కనుకూలముగ నుండునని తలంచి, అక్షయుఁడు దానిని బంధింపకుండ అట్లేయుంచెను. ఆ గవాక్షము మూలమున తన కెట్టి విపత్తును గలుగదని అతఁడు నమ్మియుండెను. ఏమనఁగా—ఆ గవా క్షమునకు క్రింద ఎనుబదియడుగుల యగాధమగు గోడదప్ప మఱేమి యును హంతకుఁడు రాదగిన ఆధారములేదు. ఆ గోడపైనుండి ఎక్కి వచ్చుట మానవమాత్రులకు సాధ్యముకాజాలదు. ఆ గోడకావల రైలు పట్టాలు—దాని కవతలిభాగమున కొన్ని గుడిసెలును మాత్రిముగలవు.

ఆ రైలుపట్టాలమీఁదినుండి నిరంతరము—గూడ్సుబండ్లో—ఇంజెను బండ్లో నడచుచునేయుండును. ఐనను—మఱెంత క్షేమముగనుండుట కై అక్షయుఁడు ఆ గోడనిండ సీసపుపెంకులను బంధింపఁజేసెను. ఇఁక హంతకుఁడువచ్చుట కెట్టి మార్గాంతరమును లేదు.

* * * * *

దుర్గాప్రసాదుని హత్యానంతరము రెండువారములు గడచెను. నాటిరాత్రి తనగదిలో నిద్రించుచున్న అక్షయుఁడు—ఏదో యొక విధ మైన బాధగల్గినట్లు తోఁచుటచేత ఉలికిపడిలేచెను. గదిలో దీపము వెల్గుచునే యున్నది. తాను భద్రముగా తాళమువేసి, మఱమేకులు బిగించిన తలుపు మెల్లఁగా తెఱువఁబడుచున్నట్లు అక్షయునకు కాన్పించెను. మానవమాత్రులకు తాళమును లోపలనుండి తెఱచుటకు సాధ్యమగు నేమోకాని, బయటినుండి యది తెఱనబడుచుండుట యెట్లా యను తలంపుతో నాతని ప్రకృత్యతీతమగు పిశాచభయావేశము గల్గించును, వెంటనే—గుండ్లతో నింపబడియున్న తన రివాల్వరును తీసి, గుమ్మమున కెదురుగా బట్టియుంచెను.

తలుపు పూర్తిగా తెఱువఁబడెను. గదిబయట నుండవలసిన దీపము ఆర్పివేయబడియున్నది. తెఱవఁబడిన తలుపు—ఒక్క విసరున మూసివేయఁబడెను— మఱియొక మనుష్యుఁ డాగదిలో నిలువఁబడి యుండెను—ద్వారమునకు ప్రక్కగా నిలువఁబడియున్న ఆ వ్యక్తియొక్క నల్లని ఆకృతినిఁజూచి అక్షయుఁడు నిలువున కంపించిపోయెను. ఆ వ్యక్తి మాటలాడుటలేదు. అక్షయునికి నోరు పెకలుటలేదు. కొంతసేపటి కతఁడు తుపాకిని ప్రేల్చుటకు ప్రయత్నించుచుండఁగనే తెఱువఁబడి యున్న అక్షయుని గదిలోని గవాక్షద్వారమున ప్రకృతి విపరీతమై—కన్నులను మిఱుమిట్లు గల్గించు— మెఱుపునకన్న నత్యంత ప్రకాశమానమగు గొప్పకాంతియేదియో గదిలోఁ బ్రవేశించెను. అట్టి భయంకరమగు మహత్తర ప్రకాశమధ్యమున నల్లనినీడవలె—ఆ నూతనవ్యక్తి

నిలువఁబడియుండెను. అతని ఆకృతి అంత యున్నతమును—అంత ఖర్వమునుగాక, మధ్యమముగా నుండెను. పూర్వకాలపుపద్ధతి కత్తిరింపుగల ఎఱ్ఱని దుస్తులను ధరించియుండెను. అక్షయునిచేతిలోని పిస్తలు వణకిపోవుచున్నది. అతఁడు ప్రమాదకరమగు స్థితిలో నిలువఁబడియుండెను.

ఆవ్యక్తి ముఖమంతయు—ఏదియో యొక గట్టివస్తువుచే కప్పబడి యగోచరమైయుండెను. అతనికడ నెట్టి ఆయుధమును ఉన్నట్లు తోఁచుట లేదు. వాని రెండుచేతులును ఆయుధవిహీనములై— స్పష్టముగఁ గాన్పించుచుండెను. ఆవ్యక్తికడ ఆయుధములేదని గ్రహించుటతోడనే—అక్షయునకు కొంత సాహసము గలిగెను. అతఁడు ధైర్యముతో—"చేతులుపైకెత్తుము!" అనియెను.

ఆవ్యక్తిచేతులు వెంటనే— యంత్రసహాయమున పైకిలేచిన చందమున లేచెను. అవి శిరస్సువఱకునులేచి—శిరస్సును కప్పియున్న ముసుగును తొలగించెను. ఇప్పుడు వాని నిజమైన భయంకరాకారము స్పష్టముగఁ గాన్పించుచుండెను. వానికన్నులు ఆకుపచ్చనిరంగు గల్గియుండెను. తలవెంట్రుకలు జేగురురంగుగలవిగా నుండెను. నోటిలోనుండి యొకదంతము దీర్ఘమై ముందునకు కోఱవలె గాన్పించుచుండెను. ఆ భయంకరాకార దర్శనమున అక్షయునకు స్వవశత తగ్గిపోయెను. అతఁడు తనచేతిలోని పిస్తలును వెంటవెంట కాల్పదొడంగెను. తుపాకి గుండ్లు—నూతనవ్యక్తిపై నెంతమాత్రమును పనిచేసినట్లు కాన్పించుట లేదు.

అక్షయుఁడు విసిగిపోయెను. అతఁడు రివాల్వరును కాల్చుట మాని—

"మాటలాడగల్గినచో మాటలాడుము!" అని పలికెను.

ఆ వ్యక్తి చిఱునవ్వు నవ్వెను.

వ్యక్తి—నీవు నన్నెఱుఁగుదువు!

అక్ష—ఎఱుఁగను—ఎఱుఁగను. నిన్ను నే నెన్నడును ఎఱుఁగను.

వ్యక్తి—ఎఱుఁగుదువు. బాగుగఎఱుఁగుదువు! నేను ప్రతాపుఁడను. ఏఁడుసంవత్సరములకు పూర్వమునందు—సర్కారుభటులు నన్ను ఉరిదీయుటకై —ఏవేళకు వచ్చియుండిరో—ఆవేళకే—అనగా రేపటి ఉదయమున ఆఱుగంటలకు నేనును నీకొఱకువచ్చెదను. నీవు కారాగృహమునందుండక బయటనే యుండినయెడల నేను నీకొఱకు ఆఱుగంటలకు తప్పకవచ్చెదను. వచ్చి నిన్ను గొని పోయెదను.

ఇంతవఱకు మాటలాడినపిదప ఆవ్యక్తి మఱల తన ముసుగును శిర మునకు తగిలించుకొనెను. అంతకుపూర్వ మాగదియందంతటను నిండి యుండిన విపరీతమైన కాంతియంతయు క్షణములో అదృశ్యమైపోయెను. అక్షయుని కన్నులు చీఁకటులు గ్రమ్మినందున ఆయుత్తర క్షణమున నేమి జఱిగెనో చూడఁజాలకపోయెను. తఱువాత —కొంతసేపటికి క్రమక్రమ ముగా—అంతయు దృగ్గోచరమయ్యెను. అతఁడు ముందుగా—ద్వారము వంకఁజూచెను. అది తాను నిద్రింపఁబోవునపు డెట్లుండెనో—అట్లే భద్రముగ తాళమువేయఁబడి మఱమేకులు త్రిప్పఁబడియుండెను. ఇంత వఱకును తానుచూచిన—విషయములు—స్వప్నములో—నిజమో— నిర్ణయింపఁజాలకపోయెను. అతనిభీతి యుద్రేకించి ఉన్మాదములోనికి దింపెను. కొంతసేపటివఱ కాతనికేమియుఁ దోపలేదు. తల తిరిగిపోవు చుండెను. చేతులు గడగడ వణకుచుండెను.

కొంతసేపటి కాతఁడు తనతలుపు తెఱచుకొని బయటికివచ్చెను. అంతకుపూర్వము ఆఱిపోయినట్లు తనకంటికిఁ గాన్పించిన బయటిదీప మిప్పుడు యథాప్రకారముగ వెలుగుచునేయున్నది! ఆచిత్ర మేమో అక్షయునకు బోధపడుటలేదు. తలుపు నిజముగ తెఱువఁబడెనా? ప్రతా పుఁడనని చెప్పిన యావ్యక్తి గదిలోనికివచ్చెనా? అంతవిపరీతమైన కాంతి యెట్లువచ్చెను? ఎచ్చటినుండి వచ్చెను? అది తనకొక్కనికే కాన్పించెనా? తానుప్రేల్చిన తుపాకి దెబ్బల కావ్యక్తి కొంచమైనను జంకలేదే! అతఁడు

మానవుఁడా! పిశాచమా? నిజముగ ప్రతాపుఁడుచచ్చి భూతమై నన్ను సాధించుటకు రాలేదుగద! తుపాకిదెబ్బలు వానికి తగులకపోయిన పోవు గాక! ధ్వనియైన నింకెవ్వరికిని వినఁబడియుండదా?—

పై సందేహములతో—అక్షయుని మస్తిష్కము అల్లకల్లోల మగుచుండెను. అతనికి వెంటనే మఱియొక విషయము జ్ఞప్తికివచ్చెను! అతఁడు ప్రతాపుని పిశాచస్వ క్తిపై రివాల్వరును ప్రేల్చినప్పుడు క్రింది నుండి యొకదీర్ఘమైన గుద్దుబండి విశేషమైన ధ్వనిచేయుచు నడచి పోయెను. కావున, ఆధ్వనిలో నీతుపాకిచప్పుడు లీనమైపోయియుండును!

అక్షయుఁడు ద్వారమును బంధించి, మఱల తనగదిలోనికివచ్చెను. ధైర్యముకొఱకొక విస్కీబుడ్డిని విప్పి సేవింపఁ దొడఁగెను. రెండు గ్లాసులు సేవించుటతో—ఆతనికి ధైర్యము గల్గెను. ఇప్పుడాతఁడు మీసము దువ్వి "మంచిది! ప్రతాపా! మంచిది! ఇప్పుడు చూతుము నాశక్తి? కారాగృహమునందుండక బయటనే యుండిన యెడల గదా నీవునాకొఱకు ఆఱుగంటలకువచ్చి నన్నుగొనిపోవుట! పోనిమ్ము! నీకోరిక ప్రకారము నేను కారాగృహముననే యుండెదను. అప్పుడునీవు నన్నేమి చేయఁగలవు?" అని పలికెను. వెంటనే, అతఁడు తనదుస్తులను ధరించి తలుపు బిగించి బయలుదేరెను. సింహద్వారమునుకూడ నతిక్రమించి అక్షయుఁడు వీధిలోనికివచ్చెను!

వీధిదీపపు క్రీనీడ నొక వ్యక్తి నిలువబడియుండెను. ఆ వ్యక్తి తన వంకకే చూచుచుండెను. అక్షయుఁడు—ఈల యూదెను. క్రీనీడ నున్న వ్యక్తి యాతని యెదుటకువచ్చి—

"ఏమైన ప్రమాదము సంభవించెనా?" అని యడిగెను.

అక్ష—నీవు పోలీసుభటుఁడవేనా?

వ్యక్తి—ఔను—నాతోనేమైన పనియున్నదా?

అక్షయుఁ డావ్యక్తి యాపాదమస్తకమును పరిశీలించి చూచెను. తాను పొరపాటుపడలేదని తనలో ననుకొనెను. ఆతని జీవితమంతయు

పోలీసువారిని చూచుటతోడనే గడచిపోయెను. ఈ స్వల్పవిషయమున పొరపాటు వచ్చుటెట్లు?

అక్ష—నాపేరు అక్షయుఁడు. ప్రసిద్ధికెక్కిన చోరుఁడను. నేటిరాత్రి విశ్వనాథగుప్త యను వర్తకునియింట నేను చౌర్యముచేసితిని. ఒక రత్నహారమును దొంగిలించితిని. స్వయముగా పోలీసువారికి పట్టుబడనున్నాను. నన్ను బంధించి పోలీసుస్టేషనుకు తీసికొని పొమ్ము.

భటుఁడు—ఏమియుఁ దోఁపక తటపటాయించుచుండెను.

"నాతో నిదియేమి పరిహాసము?" అని యడిగెను.

అక్ష—ఆ ప్రశ్నలతో నీకవసరములేదు. నీవిధిని నీవు నిర్వర్తింపుము. నన్ను బంధించి తీసికొనిపోకతప్పదు.

భటు—కానిమ్ము. ముందు స్టేషనుకు రమ్ము. నీవు చెప్పుకొనఁ దలఁచిన విషయములు నచ్చట చెప్పుకొనవచ్చును.

అచ్చటినుండి వారిరువురును, ఏలూరుకాలువ వంతెనమీఁదికి వచ్చునప్పటికి గుఱ్ఱపుబండియొకటి యెదురయ్యెను. వారిరువురును దానిలోఁ గూర్చుండిరి. భటుఁడు బండివానితో నేమో చెప్పెను. బండి సత్యనారాయణపురమువంకకు నడువసాగెను.

అక్షయుఁడు సందేహమునొంది—"నీవు నన్నెచ్చటికిఁ గొని పోవుచున్నావు?" అని యడిగెను.

భటు—సత్యనారాయణపురము స్టేషనుకు—అది నా హెడ్‌క్వార్టర్సు (Head Quaters)

అక్ష—సత్యనారాయణపురమున స్టేషనుగలదా? నేనెన్నడు విన్నైనలేదే?

భటు—నీవు వినని చోట—స్టేషనుండఁగూడదా?

తరువాత—అక్షయుఁడేమియుఁ బ్రశ్నింపలేదు. కొంతసేపటికి బండి సత్యనారాయణపురమునకు వచ్చెను. సత్యనారాయణపురము బెజవాడకు తూర్పుగా—పట్టణములోని యొకభాగమై యుండెను. ఊరి

బయటనే ఒక గృహమునకెదుట లాంతరు స్తంభముపై 'పోలీసు'(Police) అని వ్రాయఁబడి యుండెను. దానినిగాంచి పోలీసుస్టేషను అచ్చటనున్న విషయమునందు అక్షయునకు నమ్మకము గల్గెనుగాని అది యీనడుమ నెప్పుడు ఏర్పరుపఁబడియెనా యని ఆశ్చర్యము గలుగకపోలేదు. బండి బాడుగను అందుకొని బండివాఁడు వెడలిపోయెను.

భటుఁడు అక్షయునితో—మసక వెలుగానున్న ఒక హాలులో ప్రవేశించెను. అటునిటుఁ జూచి భటుఁడు—"ఇచ్చట చీఁకటిగానున్నది. ఇన్‌స్పెక్టరుగారి గదిలోనికి రమ్ము" అని పలికెను.

అక్షయుఁడు సందేహించుచు—"ఒక్క-క్షణము తాళుము. ఇది యంతయు నాకర్థమగుటలేదు. నేను చెప్పునది......"అనుచుండగనే భటుఁడు ద్వారమునుబంధించి అక్షయుని మణికట్టును గట్టిగాఁబట్టుకొని వెనుకనున్న వేఱొకగదిలోనికి బలవంతముగ నీడ్చుకొనిపోయెను.

ఎవ్వఁడో వచ్చి అక్షయునిచెవిలో "ఇంక నీవొక అఱనిమిష ములో చైతన్యమును బాసెదవు!" అని చెప్పినట్లయ్యెను!

భటునిచేతులలో అక్షయుఁడు గింజుకొనఁజొచ్చెను. ఆతఁడక్ష యుని వేఱొకగుమ్మముగుండ—ఇంకొక చీఁకటిగదిలోని కీడ్చుకొనిపోయి రమారమి నేలమట్టపు ఎత్తుననున్న ప్రాతమంచముపైఁ బడవేసి యొక దుప్పటి మీఁదఁగప్పి కరపాదములను కదులకుండ త్రాటితో బిగించెను.

తరువాత దీపము వెల్గింపఁబడెను. అక్షయుఁడు భయముచే గడగడవణకుచు చుట్టును బరికించెను. అదియొక జీర్ణపురాతన గృహము వలెఁ గాన్పించెను. ఆ గృహమధ్యమున పైనున్న దూలమునుండి క్రిందికి కాలసర్పమువంటి త్రాడొకటి వ్రేలాడుచుండెను. ఆ త్రాటినిఁజూడఁగనే అక్షయుని ప్రాణములు పైకెగసిపోయెను. అది పోలీసుస్టేషనుకాక తన్నురిదీయుటకొఱకై హంతకుఁడేర్పఱచిన యమలోకమనియు—వాఁడు పోలీసుభటుఁడుగాక తన ప్రాణములనుహరింప నీడ్చుకొనివచ్చిన యమ దూతయనియు అక్షయునకు బోధపడియెను.

అక్షయుఁడు తన యవయవములను కదల్ప యత్నించెను—కాని సాధ్యముకాలేదు. కేకలువేయఁబోయెను. కాని కంఠము తన వశమునం దుండలేదు.

ఒక భయంకరమైన కంఠధ్వనిమాత్రము పూర్వమువలెనే వినఁబడెను.

"అక్షయా! ఇప్పుడు—ఇప్పుడు మూఁడున్నఱగంటలైనది. ఇఁక నీవు జీవించుటకు రెండున్నఱగంటల పరిమితిగలదు. ఈలోపల నీపితృదేవతలను స్మరించుకొనుము!" అని—

అక్షయుని నోటమాట వెలువడుటలేదు. ఆవ్యక్తి తానిదివఱ కెన్నడో పరిచితుఁడైన వానివలెనే తోఁచుచుండెను. కాని తానప్పు డున్న హృదయాందోళన స్థితియందు జ్ఞప్తికిఁ దెచ్చుకొన లేకపోయెను. ఆమార్గమునందు ఆసమయమున నొక్క మానవవ్యక్తిగాని, ఒక శకటముగాని, నడచుటలేదు. అంతయు నిర్మానుష్యమై అంధకారబంధురమై యుండెను. హంతకుఁడు బయటకుబోయి—"పోలీస్" అను నక్షరములతోనున్న లాంతరు నచటనుండి తీసివేసి తలుపులను జాగ్రత్తగా బంధించి మఱల లోపలకు వచ్చెను. గడియారమింకను ధ్వనించుచునే యున్నది. కాలచక్ర మతివేగముగ నడచుచున్నది!

హంతకుఁడు లోనికి వచ్చి—తన జేబులోనుండి యొక చీట్లపేక దస్తానుదీసి దానిలోని "ఆటీను రెండు" ముక్కను ఏరి దానిని భద్రముగా అక్షయుని చొక్కాయిజేబులో నిమిడ్చెను.

తరువాత నాతఁడు భయముచే శవప్రాయుఁడై యున్న అక్షయునిఁ దీసికొనివచ్చి ఉరితాడిటికి క్రిందుగానున్న యొక బల్లపై నిలువఁబెట్టి—ఉరి నాతని మెడకుఁ దగిలించి, గడియారమువంకకుఁ జూచెను. ఐఁదుగంటలయ్యెను.

"అక్షయా! ఇంకొకగంట! నీ పాదములక్రిందనున్న బల్లను దూరముగా తన్నివేసెదను. దానితో వ్యవహార మంతమైపోవును!

తెలిసినదా?" అని పలికి హంతకుఁడు సావకాశముగ—ఒక సిగరెట్టును తీసి వెలిగించెను.

*  *  *  *  *

ఉషఃకాంతులు దిక్కులఁ బ్రసరించుసమయమున, నొక జట్కా బండివచ్చి బెజవాడపోలీసుస్టేషనువద్ద నిలిచెను. బండిలో నెవ్వరును లేరు. బండివాఁడొక తురకకుఱ్ఱవాఁడు, వానిపేరు మస్తాన్—

మస్తాను బండిని స్టేషనునెదుట నిలిపి, స్టేషనులోనికిఁ బోయెను. అచ్చట నొక భటుఁడు నిలువఁబడి, "ఎవరికొఱకు వచ్చితివి?" వని ప్రశ్నించెను.

మస్తా—ఇన్‌స్పెక్టరుబాబు లేరండీ కనిస్టీబ్ గారూ!

కాన్—వారితో నీకేమిపని?

మస్తా—వారితో పనికాదండీ! నేను సాలా సాలా సిత్రం సూశానండీ బాబూ! కిందటి రాత్రీ సూశానండీ! అరేబాబూ! హేంతా సిత్రం! హెంతాసిత్రిం!!

ఇంతలో ఇన్‌స్పెక్టరు సింగు బయటకువచ్చి—అదేమిచిత్రము? అని యడిగెను.

మస్తా—(సలాముచేసి) అరేబాబూ! మేం జల్మమెత్తీ ఎప్పుతో సూడా లేదూ—యినలేదూ—సత్తేనారాయణాపురంలో పోలీసూ శేసన్ సూశామండీ మహారాజ్! రాతిరి—మూఁడూఘంటల్ యేల ప్పుడూ సూశామండీ—

సింగు—ఛా! ఛా! మూర్ఖుఁడా! సత్యనారాయణపురములో, పోలీసుస్టేషన్ ఎక్కడిదిరా!

మస్తా—అబేబాబూ! అదేనండి సితిరిం! సెప్తేయెవర్కీకూడా యినే దాన్కీ నమ్మకంలేకుండావుందీ మహారాజ్! మాదీఖండ్లాతో

సూశాయండీ! లాంతర్ మీదాఖూడా—అంగ్రేజీతో—తెలంగీతో ఖూడా—"పోలీస్" అని అచ్చరాల్ ఖూడా రాసీవున్నాయండీ! ఖుదాకీ ఖసం మహారాజ్!

సింగు—అరే చిత్రముగానున్నది! ఇప్పుడు నీ వెంటవచ్చెదను. చూపఁగలవా?

మస్తా—అదీఖూడా మనవీసేస్తాం. యినండీ మహారాజ్! మూఁడూఘంటల్ రాత్రీయేళా మాఖండ్లూతో పోలీస్ ఠేసన్ మేము సూశాం ఏక్ ఘంటా పీఛే మల్లీసూస్తాన్కీ-యెత్తే ఆడా—ఠేసన్ భీ నై గీసన్ భీ నై.

సింగు—బాగున్నది నీసాక్ష్యము! ఇంతకును రాత్రి మూఁడుగంటలవేళ నీ వచటి కేలవెళ్ళితివి?

మస్తా—ఒక కనిస్టీబుసాహెబ్—ఇంకొకడు ఎవఁడో మనిషీ—ఏలూరు కాలవవొంతెనమీదా మాదీ గాడీ ఖిరాయ్‌కీ మాట్లాడుకోనీ, ఆడికీ తీస్కానీ యెల్లారండీ మహారాజ్! ఆడా నాకు ఖిరాయ్ ఇచ్చీ—నన్ను చెలో అనీ సెప్పీ—అల్లూ ఠేసన్‌లోకీ యెల్లారండీ.

సింగు—ఇది చిత్రముగానే యున్నది. ఇటుచూడుము! నీవు వారిని నీ బండిలో నెచ్చట యెక్కించుకొంటినని చెప్పితివి?

* * * *

మస్తా—ఏలూరుకాలవ వొంతెనమీదఅండీ మహారాజ్!

సింగు—అనగా రైలుపేటదగ్గర కాదా?

మస్తా—అదే—అదేనండీ—పూర్ణానందంపేటకాడా—పూర్ణానందంపేటా గాంధీపేటామధ్దెన—

సింగు కానిస్టేబిలువంకకుఁదిరిగి "ప్రతాపునిజట్టులో నొకఁడైన అక్షయునిపైన మనము నిఘాయుంచినది రైలుపేటలోనేకాదూ?" అని యడిగెను.

కానిస్టేబు—చిత్తము. రైలుపేటలోనేనండి!

సింగు—అట్లయిన వెంటనే ఒకకారుమీఁద రైలుపేట కొకఁడును— ఇంకొక కారుమీఁద ఈమనుష్యుని వెంటఁబెట్టుకొని సత్యనారాయణపురమున కొకఁడును ఇద్దఱు కానిస్టేబిల్సు పరుగెత్తవలెను. రైలుపేటలోని తులసెమ్మయింటిలో. అనగా 142 నెంబరుగల ఇంటిలో అక్షయుఁడు క్షేమముగా నున్నాఁడో లేదో చూడవలెను. సత్యనారాయణపురమునందలి ఆగృహము పోలీసుస్టేషనో కాక మరియెట్టి పిశాచమందిరమో తెలిసికొనవలెను. ఈ సంగతులను మాకు త్వరలో తెలియఁజేయవలెను—త్వరపడుఁడు.

ఇన్స్పెక్టరు ఆజ్ఞాప్రకారము కానిస్టేబిల్సు వెడలిపోయిరి. ఒక అరగంటలోపలనే వర్తమానమువచ్చి చేరెను. వెళ్లివచ్చిన భటులిట్లు నివేదించిరి!

"అయ్యా! రైలుపేటలో అక్షయుఁడులేడు. ఇంటికి తాళము వేయఁబడియున్నది. ఇఁక—రెండవది—సత్యనారాయణపురమునందున్న యిల్లు పోలీసుస్టేషనుకాదు. చిరకాలముక్రిందట సర్కారువారిచే బహిష్కరింపఁబడి పాడుపెట్టఁబడిన పురాతనద్యూతమందిరము. రైలుపేటలో అదృశ్యుఁడైన అక్షయుఁడు మాకు సత్యనారాయణపురమునందలి యాపాడుకొంపలో కాన్పించినాఁడు. అతఁడు హంతకునిచే—ఉరిదీయఁబడి ఆగృహమధ్యమమున నిర్జీవుఁడై గాలిలో వ్రేలాడుచున్నాఁడు. ఆయింట మఱియెవ్వరునులేరు. దిక్కుమాలిన దయ్యాలకొంప! మావంటి వారికే దానినిచూడగా గుండె బ్రద్దలైనది! ఇద్దఱుభటుల నచ్చట కాపుంచితిమి. డాక్టరుకొఱకు కబురంపితిమి—అతఁడింకను రాలేదుగాని వచ్చినను ప్రయోజన మేమియునులేదు—అతని ప్రాణములుపోయి చాల సేపైనది! అతని చొక్కాజేబులో ఈ చీట్లపేకముక్క దొరికినది. ఇది ఆటీనురెండు"



## ఎనిమిదవ ప్రకరణము.

### సెర్చిలైటు (Search Light)

డెటెక్టివు గోవిందరావునాయఁడును ఇన్స్పెక్టరు సింగునుకలిసి రైలుపేటకుఁబోయి తులసెమ్మ యింటిముందు నిలువఁబడియుండిరి. వారు తమరాకను ముందుగా గృహాధికారిణికి కబురంపి జవాబుకొఱకు ప్రతీక్షించుచుండిరి. ఇన్స్పెక్టరు సింగు కొంచె మనుమానించి వెను కంజవేయుచు "గోవిందరావుగారూ! మీరుముందుగాఁజని యామెతో మాటలాడుఁడు! ఈ గృహాయజమానురాలగు తులసెమ్మ చాల అసాధ్యపు మనిషియని వింటిని. ఒక్కసారిగా మన యిద్దఱను—విశేషించి నాపోలీసు దుస్తులనుచూచి కలవఁగలదు." అని పలికెను.

ఒకానొక మానవవ్యక్తికి ఇన్స్పెక్టరు సింగు భయపడుచు వెనుకాడుటనుజూచి నిరూపకుఁడాశ్చర్యపడెను. ఆశ్చర్యభరితమును—ఆక్షేపణాపూరితమును నగు నిరూపకుని వీక్షణములు తనపైఁ బ్రసరించుటను గాంచి సింగు తెలివిఁదెచ్చుకొని తన ప్రవర్తనమునకు తానేసిగ్గుపడి, ఏదియోచెప్పబోవునంతలోనే తలుపు తెఱువఁబడెను. ఒక వయస్సుమీరిన కాంత వారియెదుట నిలువఁబడి "అయ్యా! ఏమిపనిగల్గి వచ్చితిరి?" అని ప్రశ్నించెను. గోవిందరావు గౌరవపురస్సరముగా—తన టోపీనితీసి—"నమస్కారమమ్మా" అని పలికెను.

ఆ నమస్కారబాణముతో నావృద్ధకాంత లొంగిపోయెను. ఆమె ప్రీతిపూర్వకమైన మృదులస్వరముతో—"వేయేండ్లు వర్ధిల్లునాయనా!—" అని దీవించెను.

గోవిం—అమ్మా! మీరేనా తులసెమ్మగారు?

వృద్ధ—మఱి నేనెవ్వరనుకొంటివి? నేనుకానిచో—నేనేలవచ్చి మాటలాడుదును. నేనే తులసెమ్మను.

గోవిం—అట్లయిన చాలాసంతోషము! మేమువచ్చిన వ్యవహారమును గుఱించి, ఒక్క తులసెమ్మగారితోడనే మాటలాడుట మంచి దని ఈ పెద్దమనుష్యుఁడిప్పుడే నాతో చెప్పుచున్నాడు........ ఇదిగో! చూడండి! తులసెమ్మగారూ! అక్షయుఁడను నతఁడు మీయింటిలో నివసించుచున్నాఁడఁటగాదా! అతని గదిని మేమొక్కసారి చూడఁగోరుచున్నాము!

ఇన్స్పెక్టరుసింగు చెప్పినట్లు తులసెమ్మ నిజముగా అసాధ్యపు మనిషియే! అక్షయునిమాట చెవినిఁబడుటతోడనే ఆమొగము ధుమ ధుమలాడెను. ఆమె వారివంకకు ఎగాదిగ—అనుమానపూర్వకముగఁ జూచుచు,

"అదిగో! మీరు పోలీసువ్రాండు! మీదిక్కుమాలినఅసహ్యపు చూపులవలననే నేను తెలిసికొంటిని!" అని పలికెను.

గోవిందరావు ఆమెవంకకుఁజూచి ప్రీతిసూచకమైన చిఱునవ్వు నవ్వుచు— "ఔనమ్మా! తులసెమ్మగారూ! మేము పోలీసుఉద్యోగు లమే!" అని పలికెను.

తులసెమ్మ విసుగుకొనుచు, గుమ్మమునుండి కొంచెముగతొలగి నిలచి,

"ఊ—మూఁడవ అంతస్తులోనున్నాఁడు. పొండు!"అనియెను.

సింగు ప్రశంసాపూర్వకముగ గోవిందరావునుజూచి తలయూపి— "తుదకు జయించినారు!" అని పలికెను.

గోవిందరావు తులసెమ్మ వినునట్లు బిగ్గరగా—"సింగుగారూ! మీదగ్గఱనున్న లోపమే అది—మీరు ఉత్తమురాలైన కాంతను చూచుటతోడనే ఆమెయందుగల మంచితనమును గ్రహింపలేరు" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఆ ప్రశంసావాక్యమునువిని తులసెమ్మ యుబ్బి పోయెను. సహజముగా ఆమె గయ్యాళియని ప్రసిద్ధికెక్కినదగుటచేత, ఆమె నెవ్వరును స్తుతించిన పాపమున బోవుటలేదు! ఆమెకు యిాటి

అద్దెను సకాలమునకు చెల్లింపజాలనివారుమాత్రమే, అప్పుడప్పుడు విధ లేక ఆమెకు నమస్కారములుచేయుచు స్తుతించుచుందురు. కాని, అట్టి సంబంధమేమియులేని పోలీసు ఉద్యోగస్థుఁడు తన్ను "ఉత్తమకాంత" అని పలుకుటచేత తులిసెమ్మ నిజముగా తాను ఉత్తమకాంతయే కాబోలునని భావించి ఆవిషయమై తనలోఁదాను యోచించుకొన దొడంగెను.

ఉద్యోగు లిరువురు పైకిబోయి—అక్షయుని గదితలుపులను దెఱచి లోపలఁ బ్రవేశించి మరలఁ దలుపులను బంధించుకొనిరి. అంత గోవిందరావు సింగునుజూచి యిట్లుపలికెను. "సింగుగారూ! మీరు పలికినట్లు—మన మీయక్షయుని గదికివచ్చి యనుసంధించుట కొంత ప్రయోజనకారి కాకపోదు. కాని నాకొక విషయమునందు ప్రబలమైన సందేహముగల్గి పీడించుచున్నది. ఎంతయాలోచించినను, ఆసమస్యను భేదింపలేకున్నాను. మీరు అర్ధరాత్రము మొదలు—తెల్లవాఱులోపల ఇల్లుకదలి యెచ్చటికిపోవలదని, అక్షయునకు కఠినమైనయాజ్ఞ నిచ్చియుం టిరి. ఇంతేకాక తాను ఎప్పుడెప్పుడెక్కెట్లు సంచరించునో వానినెల్ల మీకుఁ దెలియఁబరచుచుండవలసినదనికూడ ఆతని కాజ్ఞాపించియుండిరి! సహజ ముగా అతఁడు మీయాజ్ఞలను నిరాకరించువాఁడు కాఁడనియు నావిశ్వా సము! అతఁడు హంతకుని విషయమున అతీతమైన భీతిఁజెందియున్నాఁడ నినమాట నిజమే! అతఁడు తన గదితలుపులకును కిటికీలకును గూడ తాళములువేసి మఱిమేకులను బిగించుటయే అతనిభీతికి నిదర్శనములుగా కనఁబడుచున్నవి! గతరాత్రి అక్షయుఁడు తన గదిలోనికి పదునొకండు గంటలకు వచ్చినట్లు మీరు కావలియుంచిన భటునివలనఁ దెలియు చున్నది! భటులు పండ్రెండుగంటల రాత్రివఱకును, ఈ యింటిని కాచియుండిరి! అప్పటివఱకును అతఁడు బయటకు రానట్లు తెలియు చున్నది! అతఁడు సత్యనారాయణపురమునందలి దూ్యతగృహమున ఉరిదీయబడియున్నట్లు ఉదయమున ఎనిమిదిగంటలకు మనకుఁ దెలిసినది!

ఈసమస్యనే మనమిప్పుడు భేదింపవలసియున్నది! అతని నాద్యూతమంది రమునకు బలవంతముగా ఏభూత మీడ్చుకొనిపోయి యుండును?"

ఇట్లు చెప్పుచున్నంతసేపును గోవిందరావు—అనుసంధించి కను గొనుటకు వీలగుఆధారము లేవియైన లభించునేమోయను నుద్దేశ్యముతో గదిలో నాల్గుపైపులను దిరుగుచు ప్రతివస్తువును అత్యంతవిమర్శక దృష్టితో పరిశీలించుచునే యుండెను.

గోవిం—రాత్రి శయ్యపైన కొంతసేపు నిద్రించిన సూచనలు కనఁబడు చున్నవి! బయటికిఁ బోవునప్పుడు ధరింపఁదగిన దుస్తులుతప్ప మిగతదుస్తు లన్నియు జాగ్రత్తగా నొకచో నుంపఁబడియున్నవి! గదియంతయు పొందరగా సర్దబడినను అందు జాగ్రత్త కనఁబడుచున్నది. అక్షయుఁడు తన క్షేమముకొఱకు స్థలము మార్పఁదలంచియుండెనా?—

గోవిందరావు అక్షయుని శయ్యపైనున్న తలగడనెత్తి చూచెను. అచ్చట నాతని తుపాకి కాన్పించెను. వెంటనే యాతఁడు వికసించిన ముఖలక్షణములతో—సింగునుచూచి,

"సింగుగారూ! ఇప్పుడు మనమొక చిన్న నిరూపణను చేయఁ గల్గితిమి. అక్షయుఁడు తన తుపాకినిండే వదలిచనినాఁడు. అనగా అతఁడు తనకు తుపాకితో నవసరములేని ప్రదేశమున కరుగఁదలచి యిల్లు వెడలినాఁడు! అక్షయునివంటి దుర్మార్గవ్యక్తికి తుపాకితో అవసరము గలుగని ప్రదేశ మీప్రపంచకమునం దొక్కటిమాత్రమే యున్నది! అది యేదో మీకిప్పుడర్థమైనదా?" అని యడిగెను.

సింగు—నాకేమియు నర్థమగుటలేదు. అక్షయునివంటి వానికి తుపాకితో నవసరములేని ప్రదేశముకూడఁ గలదా?

గోవిం—కలదు. అది పోలీసుస్టేషను......ఓహో! ఇంకేమి? సంద ర్భము బాగుగానే అతికినది! అతఁడు పోలీసుస్టేషనుకు పోవఁ దలంచి యింటినుండి బయలుదేరుటకును—హంతకుఁడాతనిని సత్య

నారాయణపురమునందలి కృత్రిమ పోలీసుస్టేషనుకు నడిపించుటకును సరిపోయినదిగాదా! మనకు తెలియని ఏదో కారణముచేత గతరాత్రి అక్షయుఁడు పోలీసుస్టేషనుకు పోఁదలంచినమాట మాత్రము నిజము. కాని ఎందులకు పోఁదలంచెను! అదియే చిక్కైన సమస్యగానున్నది.

ఇట్లు పలికి గోవిందరావు అక్షయుని తుపాకిని తెఱచిచూచెను. అందు నాల్గుగుండ్లు ఉపయోగింపఁ బడినట్లు కాన్పించుచుండెను.

గోవిం—"నాల్గుగుండ్లు ఖర్చుపడినవి. మొత్తముమీఁద ఎవ్వని మీఁదనో—తుపాకి కాల్పవలసిన అవసరముమాత్రము గల్గెను. గుండ్లులేని వట్టిగుల్లలను తుపాకిలోఁ బెట్టుకొనుటకు అక్షయుఁడంత పిచ్చివాఁడు కాఁడుగదా! అతనిశత్రు వెవ్వఁడైన గదిలోఁ బ్రవేశించి యుండఁడుగదా!

పై విధమున తనలోఁ దాను గొణుగుకొనుచు, గోవిందరావు—ద్వారమును డాసి, తలుపుగ్రంధులను—బిగించిన మఱమేకు భాగములను పట్టి పట్టి కదిలించి చూచెను. అవి మిక్కిలి వదులుగానుండి—సులభముగను నిశ్శబ్దముగను చలించుచుండెను. అతఁ డాశ్చర్యపడెను.

గోవిం—సింగుగారూ! ఈ తలుపులగ్రంధులను మేకుబిగింపులునుగూడ నూనె వేయఁబడియున్నవి. కావుననే అతిసులభముగను, నిశ్శబ్దముగను తిరిగి పోవుచున్నవి. నిశ్శబ్దముగాఁ బయటికిఁబోవుట కనుకూలముగ నుండునని తలఁచి అక్షయుఁడే వీనికి నూనెవేసి యుంచెనా—కాక, ఏదేని దారుణసంకల్పముతో—మన మెఱుంగని యితరుఁ డెవ్వఁడైన నిట్లు గావించెచా—తెలిసికొనవలసి యున్నది!

నిరూపకుఁడు వెంటనే గదివదలి క్రిందికిఁబోయి గృహయజమానురాలి గదిదగ్గఱ నిలచి పారావతమృదులమైన కంఠస్వరముతో—

"అమ్మా! తులసెమ్మపిన్నిగారూ! మాటి మాటికిని మేము ప్రశ్నలు వేయుట తమకు శ్రమగానుండునా?" అనియెను.

"ఉత్తమురాలైనకాంత—" యని గోవిందరావు తులసెమ్మ కిచ్చిన బిరుదు చాల ప్రగాఢముగా పనిచేసినది. అప్పటినుండియు నామె తాను నిజముగా ఉత్తమురాలైన కాంతనలె గాన్పించుటకై చాల ప్రయత్నములు చేయుచున్నది. చెదరిన శిరోజములను దువ్వి ముడివేసికొని ఒక యూలుదారముతో బంధించుకొనెను—సబ్బుపెట్టి మొగమును శుభ్రముగా కడుగుకొనెను. ఇప్పుడు గోవిందరావు "పిన్నిగారూ!" అనికూడ పిలుచుటతో—ఆమె యానందము నభోతలము నంటెను. వెంటనే తులసెమ్మ—"అబ్బే! లేదునాయనా! ఎంతమాత్రమును శ్రమగాలేదు. చాల సంతోషముగా నున్నది!" అని పలికెను.

గోవిం—ఆ—అట్లయిన పిన్నిగారూ! ఇటుచూడండి!—ఈ సింహద్వారమునకు క్రొత్తగా మేకులు బిగించి క్రొత్తతాళములు వేసినారే అవి మీరేవేసినారా?

తుల—ఆ—నేనే వేసినాను.

గోవిం—అద్దెలకున్నవారందఱును ఇంటిలోనికి వచ్చినతరువాత ప్రతిరాత్రియు సింహద్వారమును భద్రముగా మూసియుంతురు గదా?

తుల—ఆ—అక్షయుఁడావిషయమై ప్రత్యేకముగా కోరినాఁడు. అతనికేదో భయము పాపము!

గోవిం—నిశ్చయముగా ఆలాగే—ఈనాటి యుదయమున తలుపులు గతరాత్రి మీకు బంధించినట్లే యుండెనో లేదో మీరు పరిశీలించితిరా?

తులసెమ్మ ఆమాటలువిని ఆలోచనలో మునిగిపోయెను. కొంతసేపటికామె యిట్లనెను.

తుల—అంతగా పరిశీలింపలేదు—ఏమి? యథాప్రకారముగనే యుండును.
......కాదు కాదు—అబ్బాయీ! (క్రిందటిరాత్రి) నేను—
ఏమాత్రమో వానిని బంధించుటలో పొరపాటుపడి యుండును.

అంతవఱకువిని, గోవిందరావు—ఆమెకడ సెలవుగైకొని మరల మేడమీఁదికి వచ్చెను. ఇన్స్పెక్టరు సింగు—సాధ్యమయినంతవఱకు విశ్రాంతిని, సౌఖ్యమును, అనుభవింప నభిలాషపడు స్వభావముగల వాఁడు. అతఁడు కార్యభారమునంతను గోవిందరావు చూచుకొను చున్నాఁడుగదా యను ధైర్యముతో—అవసరమయినప్పుడు తనకు నియమించిన పనిని మాత్రము తాను చేయఁదలఁచి సుఖముగా—అక్షయుని శయ్యపైఁగూర్చుండి సిగరెట్లను కాల్చుచుండెను. గోవిందరావు గదిలోనికివచ్చి తనలోఁ దాను—"ఈ తలుపులకు బిగించిన మరలు బయటినుండి ఊడఁదీయుటకు సాధ్యమగునా కాదా? చూడవలెను." అనుకొనుచుండెను.

సింగు—అది యెట్లు సాధ్యమగును. తలుపునకు బయటివైపున—ఉత్తరములు పడవేయుట కనుకూలమగు రంధ్రమువంటి దేదైన నున్నయెడల—మనమొకవేళ అట్లు సందేహించుటకు వీలగును. ఆ రంధ్రమునుండి ఏదైన యినుపయూచవంటిదానిని లోనికి బ్రవేశింపఁజేసి త్రిప్పి—బయటినుండి కవాటమును భేదింప వచ్చునేమోకాని, ఈతలుపున కట్టిదేమియు గాన్పింపదే! ఎట్లు సాధ్యమగును!

గోవిం—(అతనిమాటకు సమ్మతించి) సరిగాని, బయటిదీపమునకుఁ గల ఎలక్ట్రిక్ బల్బు (Electric Bulb) ఊడదీయఁబడి యున్నది. కనిపెట్టితిరా?

సింగు—లేదు. ఇంతవఱకు కనిపెట్టలేదు గాని, ఆబల్బునకును హత్యకును సంబంధమేమి?

గోవిం—ఏదో కొంతసంబంధముండక తప్పదు.

గోవిందరావు తనజేబులోనుండి చాకును బయటికిఁదీసి, దానిని తలుపునకు బిగించిన మరలలో మెఱయుచున్న ఉక్కుభాగమునకు కత్తి ఒరను తగిలించి - "ఓ! ఇదియావిశేషము!" అనిపలికెను.

సింగు—ఏది విశేషము?

గోవిం—గతరాత్రి యొకనూతనుఁడు ఈ గదిలోనికి బలవంతముగాఁ బ్రవేశించెను. వాఁడు—ఈయింటి సింహద్వారమున కావలి నుండి రాలేదు. ఒకవేళ వచ్చియున్నను, వానికి సంబంధించిన వాఁడు మఱియొకఁ డీలోపలిగదులలో నుండిలీరవలెను. లోపల గదులు తప్ప—బయటిభాగమంతయు వెల్లడిగా నున్నందున, ఎవ్వఁడును గంటలకొలదికాలము దాఁగియుండుట కవకాశము లేదు. అందువలన, ఆనూతనుఁడు లోపలనున్న గదులలోనే—ఒకదానియందుండెననుట నిజము. లోపలిగదులన్నియు అద్దెల కీయఁబడి యాక్రమింపఁబడియేయున్నవి. నూతనుఁడు తుల సెమ్మవద్ద ఏదోగదిని అద్దెకుతీసికొనినవాఁడే—యైయుండవలెను. సింగుగారూ! మనకిప్పుడు కొంత యనుసంధానమార్గము కనఁబడుచున్నది.

సిం—ఏమో! నాకంతయు అగమ్యముగానున్నది! మీరు మాటలాడు భాష నాకేమియు అర్థమగుటలేదు. మొదట మీరు ఎలెక్ట్రిక్ బల్బు సంగతిఁ జెప్పితిరి. తరువాత కత్తినితీసి మరల పైనుంచితిని. వెంటనే ఎవ్వఁడో నూతనుఁడు వచ్చెనని వాని చరిత్రము నంతను చదువుచుంటిరి. ఒకవేళ మీరు జోస్యము చెప్పుచుండుటలేదుగద!

సింగుమాటలను గోవిందరావు సంపూర్ణముగా వినలేదు. అతఁడు, అక్షయుని గదికి ప్రక్కగానున్న మూఁడు నాలుగు గదుల యెదుట నిలువఁబడి—

"ఏదో—నాకు బోధపడుటలేదు" అనియెను.

సిం—"ఏదో"—యనఁగా నర్థమేమి?

గోవిం—మనకు కావలసిన మనుష్యుఁ డాక్రమించియున్న గది ఏదో నాకు బోధపడుటలేదు. ఒక గదివద్దకుఁబోయి—దానిని తట్టు నుద్దేశముతో గోవిందరావు చేయియెత్తెను.

ఆగదిలోనుండి శ్రవణపర్వమైన ఫిడేలువాద్యము వినఁబడుచుండెను. అది యత్యంత మనోహరముగ నుండుటచేత గానమునందు తన హృదయము లీనమైన హేతువువలన, గోవిందరావు కొన్ని నిమిషములు తలుపును తట్టుటకై ఎత్తిన తనచేతి నట్లే యుంచెను. తుదకాతఁడు తలుపు తట్టెను. సంగీత మాగలేదుగాని, లోపలనుండి సన్నని కంఠస్వరమున, "లోనికిరమ్ము—" అను ధ్వని వినఁబడెను.

ఆగది సరిగా అక్షయునిగదివలెనే యుండెను. దానిలోఁగూడ నొక మంచముగలదు. ఆగదిలో నొకవృద్ధుఁడు కుర్చీలోఁ గూర్చుండి, చేత నొక ఫిడేలును పట్టుకొని—మనోహరముగా పాడుచుండెను.

ఆగాయకుఁడు గోవిందరావును లోనికి రమ్మనుటమాత్రమే కాని వచ్చినపిదవ మఱి యెట్టిపరామర్శయును చేయలేదు. అతఁడు—అగాధమైన తన సంగీతసముద్రమున మునిఁగి తేలుచుండెను.

గోవిందరావు—వినివిని ఇఁక మిన్నకుండిన ప్రయోజనములేదని తానే సంభాషించెను.

గోవిం—అయ్యా! లోకాతీతమైన తమ సంగీతమును నేను విఘ్నము చేయుచున్నందులకు నన్ను క్షమింపవలెను—నేనొక డిటెక్టివును. ఈ యింటిలో కాపురమున్నవారిలో నొకరికి ఒక దారుణమైన హత్యతో సంబంధము గలదనుటకు తగినన్ని కారణము లుండుట చేత నేనిచ్చిటికి రావలసివచ్చినది!

గోవిందరావు సంగీతమును నిలుపుమని క్షమాపణవేడినను ఆవృద్ధుడు

సంగీతమును నిలుపలేదు. సంగీతము తీయుచునే అతఁడు— "నన్ను సందేహింపవుగదా!" అనెను.

గోవిం—ఆ—సందేహింప కేమి?— సందేహింతును. సామాన్యముగా ఇతరు లందఱిపాటుగా నిన్నును సందేహింతును. కాని నీవిష యమున నేను సందేహించుటలో పొరపడవచ్చును.

అచ్చటనుండి గోవిందరావు ఇతరుల గుమ్మములకడకుఁ బోయెను. వానిలో రెంటికి తాళములు వేయఁబడి యుండెను. మూఁడవదాని యందు బాలికాపాఠశాలయందలి సంగీతోపాధ్యాయుఁడు వసించుచుం డెను. అతఁడు తత్సమయమున క్షౌరము చేయించుకొనుచుండెను. నాల్గవదానిలో— ఒక చిన్న హోటలుతాలూకు బట్లరు నివసించు చుండెను. ఏగదివద్దను అతని కనుమానము గలుగలేదు. ప్రతి గదిలోని వాఁడును అనుమానింపఁదగని వాఁడుగనే తోఁచెను. గోవిందరావు తిరిగి అక్షయునిగదికిఁ బోయెను. అచ్చట సింగు—ఇంకను ప్రక్క మీఁదపరుండి సిగరెట్టు పీల్చుచునే యున్నాఁడు!

గోవిం—సింగుగారూ! అంతయు బాగుగానే యున్నదిగాని మీరు మాత్రము ఆ గవాక్షసమీపమునకుఁ బోనలదుసుఁడీ!—ఏమనఁగా రైలుపట్టాలకు ఆవలిప్రక్కన ఒకవ్యక్తి తుపాకి చేతఁబట్టుకొని మనవంకకు గుఱిచూచుచున్నాఁడు!

అక్షయుని గదిలోనున్న తలుపులులేని గవాక్షముగుండా క్రిందనున్న ప్రకృతియంతయు కనఁబడుచున్నది! రైలుపట్టాలకు ఆవలనున్న గుడి సెలలో నొకదానియందు గవాక్షమునకు దగ్గఱగా నొక పెద్ద మేజా బల్లయు—దానిమీఁద నొక తుపాకి యుంపఁబడినట్లు స్పష్టముగా కనఁ బడుచున్నదానిగొట్టమును దృగ్గోచరములయ్యెను. ఆగొట్టము సరిగా తమవైపునకే యుండెను. గోవిందరావును సింగును బయటకువచ్చి— పట్టాలనుదాటి గుడిసెవద్దకుఁబోయిరి!—వారిరాకనుగాంచి ఒక గడ్డము

మాసిన బక్కపలుచని పొడుగుపాటి మనుష్యుఁడును సగము బట్టకట్టు కొనుచు అతని వెనుకనే వచ్చుచున్న (అతనిభార్యఁగా దోఁపజేయు) కాంతయు గుమ్మములోనికి జేరుకొనిరి.

ఇట్టి పరిస్థితులందు సాధారణముగా సింగు తానే ప్రసంగోప క్రమణము చేయువాడుక! వాడుకప్రకారముగా — ఇప్పుడును అతఁడే మాటలాడెను.

సింగు — మేము పోలీసుఉద్యోగస్థులము! నీతో నొక మాటాడుటకు వచ్చితిమి.

మను — మీ అభిప్రాయమేమి? ఇంటిలోనికి వచ్చెదరా?

జవాబు చెప్పకుండ సింగు లోనికిపోయెను. గోవిందరా వతనిని వెంబడించెను.

సింగు — రైలుపట్టాలకు అభిముఖముగా నీగది గవాక్షమునం దొక వస్తు వుండవలెను. అదియేమో చూడనిమ్ము.

సింగును గోవిందరావును — ఈ గృహాధిపతి అనుమతి లేకుండగనే, ముందునను త్రోసికొనివెళ్ళి — ఒక గది తలుపుతెఱచుకొని, అనుమా నింపఁబడిన గదిలోనికి వెళ్ళిరి!

సింగు — బల్లమీఁద నున్న వస్తువునంకకు వంగిచూచెను.

సింగు — అది తుపాకి కాదు. గోవిందరావుగారూ! టెలెస్కోపు యంత్రము!

గోవిందరావు — పైకొకసారియు క్రింది కొకసారియు — పరిశీలించి చూచెను. క్రిందనొక పెద్ద ఫోకస్ దీపమును — పైన దానికి సంబంధిం పఁజేసిన ఎలెక్ట్రిసిటీ తీగెయు కాన్పించెను.

గోవిం — ఇదియొక గొప్ప కాంతి నొసంగఁగల సెర్చిలైటు దీపము (Search Light) ఇది సరిగా — అక్షయుని గవాక్షము వంకకు త్రిప్పఁబడియున్నది. ......ఏమయ్యా! పెద్దమనుష్యుఁడా! దీని ప్రయోజనమేమో నీవు చెప్పగలవు — చెప్పుము.

గోవిందరావు ప్రక్కనున్న బల్లపై జూడఁగా—ఒకకాగితముమీఁద "సరిగా రాత్రి రెండుగంటలకు వెలిగింపుము!" అని వ్రాయఁబడి యుండెను. ఆకాగితమునుదీసి గోవిందరావు సింగునకిచ్చెను. అతఁడు దానినిఁ జదివి ఆశ్చర్యముతో "ఇది—సరిగా ప్రతాపుని దస్తూరివలె నున్నది" అని పలికెను.

గోవిందరావు ప్రశ్నకు ప్రత్యుత్తరమీయక, ఆమనుష్యుఁడు తన భార్యతోఁ గలిసి యింటిలోనికిఁ బోవుచుండెను. గోవిందరావు అతనిని వెంబడించి—

"ఏమయ్యా ! నీవు నాప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చినావుగావు! నీవు చెప్పకున్నను నేను గ్రహింపలేకపోను. నేటిరాత్రి రెండుగంటల వేళకు, ఈదీపమును వెలిగించునిమిత్తమె—నీవు లంచమీయఁబడితివి! ముందుగా నేర్పరచుకొనిన ఏదో సాంకేతికముకొఱకై ఇది నీవలన వెలిగింపఁబడినది ! ఈసంగతుల నన్నిటిని, నీవు చెప్పకుండ నేనే గ్రహింపఁగలను. కాని, నాకు నీవలన తెలియవలసినది—ఎవ్వని యాజ్ఞాప్రకారము నీవీపనులనుచేసితివో వాని స్వరూపవర్ణనము మాత్రమే! దానిని నీవెఱిపగింపక తప్పదు!" అని యడిగెను.

ఆ మనుష్యుఁడు తెలతెలపోవుచు, తన భార్యవంకఁ జూచెను. అతఁడొక పశుప్రాయబుద్ధిగలవాఁడని చూపులవలననే వ్యక్తమగుచుండెను. పసుపుపచ్చధాతువుగా నెఱసిన వెంట్రుకలు—పొడుగైన ముక్కు—కొంగమెడ—పొడవైనశరీరము—ఆమనుష్యుఁడు గోవిందరావునుఁ జూచి చికాకుపడుచు,

"నేను నీకేమియు చెప్పలేను. నేనెవ్వరికేమి యపకారము చేసితిని? నాకు విశేషధనము నిచ్చినందున—ఒక్కసారిమాత్రమే, ఆదీపమును వెలిగించి, తిరిగి ఆర్పివేసితిని" అనియెను.

గోవిం—గడుసుమాటలు కట్టిపెట్టు—నీవొక హత్యకు సహకారివై తివి! ఆహత్యతో నీకు సంబంధము గలదని, అనుమానము మీఁద నిన్ను కోర్టుకు లాగగలను! నీవు తిన్నగా నాప్రశ్నలకు జవాబుచెప్పెదవా—పోలీసుస్టేషనునకు నడిచెదనా? ఈరెంటిలో నేదోయొకటి స్థిరపరచుకొనుము.

మను—నీవెవఁడవో నేను నిన్ను నమ్మను. నే నెవ్వరికిని కీడుచేయఁలేదు.

అతనిభార్య తన భర్తపక్షమున వాదింపఁదలఁచి, ముందునకు వచ్చి—

"మీకు నేనేమియుఁ జెప్పవలసిన యవసరములేదు. మేముగౌర వముగా బ్రదుకుచున్నవారము. ఈచుట్టుప్రక్కల ప్రతివారును మమ్మె ఱుఁగుదురు" అనియెను.

గోవిం—ఇదిగో! విశేషముగా పెద్దమాటలాడుటవలన ప్రయోజనము లేదు—నేనెవ్వరికిని కీడుచేయలేదని నీవు మాటి మాటికిని పలుకు చున్నావు. ఉన్నవిషయ మదికాదు. ఒక హంతకుని స్వరూ పము మాకు తెలియకుండ నీవు దాచుచున్నావు!......ఈయన యెవ్వరో చూచితివా? సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరుగారు! ఈయన గారు నిన్ను కోర్టులోనికీడ్చి—నీవు చేయుచున్నపని ఎంతనేరమో తెలియఁజేయఁగలఁడు! అంతదూరము రాకుండ మేము ప్రశ్నించు వానికి సరియైన జవాబులు చెప్పు—మాగోడవ నీకుండదు.

మను—నే నేప్రశ్నలకును జవాబుచెప్పను.

గోవిం—అట్లయిన నీవు మావెంట తిన్నగా పోలీసుస్టేషనుకు నడు వలసినదే! మీఁద గుడ్డవేసికొని నీభార్యకు అప్పగింతలు చెప్పి కదలిరా—ఇక నీజన్మములో తిరిగి నీభార్యను చూడఁజాలవు!

ఇది గోవిందరావు వానిని భయపెట్టుటకై కోసిన పెద్దడాబు! కాని అది వెంటనే ఫలితమునకు వచ్చెను. ఆ మనుష్యునిభార్య—గోవింద

రావు మాటలకు నిలువున కంపించిపోయి బిగ్గఱగా నేడ్చుచు తన భర్తను గౌఁగిలించుకొనెను. ఆ మనుష్యుఁడాకాంతను ప్రక్కకుఁ ద్రోసివేసి గోవిందరావునుఁ జూచి "మీకేమి చెప్పవలెను?" అని యడిగెను.

సింగు—తన నోటుపుస్తకమును కలమును తీసికొని,

"నేను నీవద్దనుండి యొక వాఙ్మూలమును తీసికొనఁదలఁచితిని. దానిని నీవు ఇక్కడ చెప్పినను సరియే! స్టేషనులో చెప్పినను సరియే!—" అని స్పష్టముగా జెప్పెను.

స్టేషనుశబ్దము తిరిగి చెవినిఁబడుటతోడనే—ఆ కాంత హాహాకార మొనరించి స్టేషనుకు తీసికొనివెళ్లవద్దని ప్రార్థించెను. ఆమనుష్యుఁడప్పుడు తానెఱిఁగిన సంగతులను చెప్పుట కాయత్తమయ్యెను.

మను—మంచిదిబాబూ! ఈ గొడవలన్నియు నాకెందుకు? నాకు తెలిసినదేమో చెప్పెదను వినండి—ఒక మనుష్యుఁడు నాదగ్గఱకు వచ్చెను. ఇది మొన్నటిదినమున జఱిగినసంగతి—వచ్చి—తనకొక పనిచేసిపెట్టిన యెడల నూఱురూపాయల నిచ్చెద ననెను. ఆపని ఏదో—బయస్కోపుబొమ్మలకు సంబంధించినదని చెప్పి—ఈస్టీరియస్కోపు యంత్రము నిచ్చుట నుంచెను. తక్కిన పని యంతయు తానే చేసుకొని ఈ బల్లమీఁద అన్నియు—అమర్చుకొని వెళ్ళినాఁడు. తిరిగి వానిని తీసికొనిపోవుటకు అతఁడీదినమున వచ్చునని మే మనుకొనుచున్నాము. రాత్రి రెండుగంటల వేళకు నే నిచ్చటినుండి ఆ యెదురుగా కినఁబడు మేడ గవాక్షములోనికి చూచుచుండునట్లును తలుపు తెఱకొని ఆతఁడు లోనికి వచ్చుటతోడనే నే నీదీపపుమీట నొక్కునట్లును అతఁడు నియమించెను. నే నట్లే చేసితిని. అందులకై ఆతఁడు నాకు ముందుగా 50 రూ॥ ఇచ్చెను. నేను చేసినపనివలన—

ఇంకొకరికి హానికల్గునని నేనెఱుఁగను. కలిగినదని చెప్పుచున్నారు గనుక నాకు చాల విచారముగా నున్నది. నాకుమాత్ర మేమియు దెలియదు.

గోవిందరావు—విని శిరఃకంపనము చేసి ఆ వచ్చిన మనుష్యుని ఆకృతి యెట్లుండునో చెప్పుమని యడిగెను. కాని, అతఁడు చెప్పినది—అసంతృప్తికరముగా నుండెను.

"ఆమనుష్యుఁడు మధ్యరకపు ఎత్తుగానుండెను—కాక—కొంచెము పొట్టిగా నున్నను ఉండవచ్చును—ఒకవేళ బాగుగా పొడవైనవాఁడుగా గూడ నుండవచ్చును. రంగుమాత్రము నల్లనిది—" అని చెప్పెను. ఇంతలో ఆ స్త్రీ యందుకొని—"కాదు కాదు. అతఁడు చాల అందమైనవాడు. మట్టపు ఎత్తుగలవాఁడు—" అని చెప్పెను.

అన్యోన్యవిరుద్ధములగు ఈ వర్ణనలను వినుటవలన గోవిందరావునకు విసుగుబుట్టెను. అతఁ డాప్రసంగముతో ఆపివేసి—"సరే! మంచిది—తుదకు నీవెట్లో—ఆదీపమును మాత్రము వెలిగించితివి. అంతేనా?" అని యడిగెను.

మను—ఆ! వెలిగించితిని. సరిగా అతఁడు నియమించినవేళ తప్పకుండ—

గోవిం—ఆసమయమున గదిలో ఏమిజరిగెనో నీవు చూడఁగలిగితివా?

మను—ఆ—చూచితిని.

గోవిం—నీ వేమిచూచితివి?

మను—ఇద్దఱు మనుష్యులను చూచితిని. ఆగదిలో నొక శయ్య యుండెను. వారిలో నొకఁడు శయ్యకుదగ్గఱగా నిలిచియుండెను. అతనిచేతిలో నొక తుపాకియుండెను. రెండవవాఁడు గుమ్మము నకు దగ్గఱగానుండెను. తలుపు తెఱువఁబడి యుండెను. శయ్య దగ్గతివాఁడు......

గోవిం——అతనిసంగతి యట్లుండనిమ్ము—గుమ్మము దగ్గఱివానిసంగతి చెప్పుము. ఎట్లుండెను? అదియే ముఖ్యముగా కావలసినది!

గుమ్మముదగ్గఱివానిని వర్ణించిచెప్పుటకు ఆ మనుష్యుఁడును, అతని భార్యయుఁగూడ చాల ఉత్సాహపడుచుండిరి. తుదకు వారు చెప్పిన వర్ణనలు రెండును ఒకటిగానే యుండెను. వారు చెప్పినదేమనగా——

"అతఁడు మధ్యవయస్సువాఁడు. మట్టసపు ఔన్నత్యము గల వాఁడు. జేగురురంగు తలకట్టు గలవాఁడు. నోటిలోని ఒకపన్ను పెద్దదిగా ముందునకు వచ్చియుండెను."

ఆవర్ణనమును విని సాభిప్రాయముగ గోవిందరావును సింగును మొగములు చూచుకొనిరి.

సింగు——అది సరిగా ప్రతాపునిఆకృతి!—ప్రతాపుడే! మఱియొకఁడు కాఁడు!——

గోవిం——నిజమే! కాని ప్రతాపుఁడు ఏఁడు సంవత్సరముల క్రిందట ఉరి దీయఁబడియెను. చచ్చిన వారెన్నడును తమ పగదీర్చుకొనుటకై పునర్జన్మము నెత్తఁజాలరు!......ఇదిగో!......ఓ మనుష్యుఁడా!—నిన్నే—ఇటుచూఁడు! నీకు మొన్న ముట్టిన ఏఁబది రూపాయలే దక్కినవి. మిగత ఏఁబదియు నీకెన్నడును ముట్టవు! వానికిబదులుగా నీ కీస్టిరియన్‌స్కోపుమిషనునూ—ఫోకస్ దీపమును మిగిలినవి. వీనిని విక్రయించుకొని నీవు చేతనైనంత ధనము రాఁబట్టుకొనవచ్చును. ఆమనుష్యుఁడు తన జన్మమధ్యమున నెన్నడును వీనికొఱకై నీదగ్గఱకురాఁడు! నీ కాసందేహమెంతమాత్రమును అక్కఱలేదు.

మను——వానిసంగతి కేమిగాని—నేనిఁక పోలీసుస్టేషనుకు రానక్కఱ లేదుగదా!

గోవిందరావు రానక్కఱలేదని చెప్పెనుగాని ఎందులకైన మంచిదని సింగుమాత్రము వాని చిరునామాను తన పుస్తకమునందు వ్రాసుకొనెను.

*     *     *     *     *

అచ్చటినుండి పోలీసుఉద్యోగులు తిన్నగాకదలి తులసెమ్మయింటికి బోయిరి—ఆమె వారికి గుమ్మములోనే కనఁబడెను.

గోవిం—పిన్నిగారూ! మీయింటిలో నొక ఫిడేలువాయించు గాయకుఁడు అద్దెకుండవలెనుగాదా?—

తుల—లేదండీ! పైగదులలో నొక హార్మోనియంవాయించునాతఁడున్నాఁడు. అతనికి బయస్కోపుహాలులోఉద్యోగమని విన్నాను. అతఁడు ఫిడేలు వాయింపఁగా నేనెన్నఁడును వినలేదే!

గోవిం—బాగుగా జ్ఞాపకము చేసికొనవలెను. నల్లని కండ్లఅద్దములు—తెల్లని శిరోజములు—

తుల—లేదులేదు. అట్టియాతఁడు నాగదులలో లేనేలేడు. నేనుచెప్పిన హార్మోనియస్టు చాలాపడుచువాఁడు. యెట్టి వేచీలును పెట్టువాఁడుగాఁడు. చాలామంచివాఁడు.

గోవిందరావు ఆమెతో విశేష చర్చ చేయుటవలన లాభము లేదని యెఱింగి—గబగబ పైగదులలోనికి వెళ్లి—అంతకుపూర్వము తాను చూచిన ఫిడేలు వాయించినవాని బసలో విమర్శించెను. కాని యిప్పుడాగదిలో నెవ్వరునులేరు. అది ఖాళీగా నున్నది.

సింగు—చూచితిరా చిత్రము! ఇప్పుడు మనకొక పెద్ద రహస్యము తెలిసినది!

ఇన్‌స్పెక్టరు సింగు ఏదో పలుకుచుండఁగనే—గోవిందరావు గదిలో వెదకుచుండెను. కొంతసేపటికి అతఁడొక పొడుగైన ఇనుపతీగె నొకదానిని బయటికిఁ దెచ్చెను. దాని చివరభాగము కొక్కెమువలె వం

చఁబడి యుండెను. దానిని గోవిందరావు సింగునకు చూపుచు—
"చూచితిరా రహస్యము! ద్వారము బయటనుండియే ఎట్లు తెఱువఁబడి బయటినుండియే ఎట్లు మూయఁబడియెనో—ఇప్పుడు నీకు బాగుగా అర్ధమగునట్లు చూపఁగలను!" అని పలికెను—

సింగు—దీనితో నేమగును? తలుపును సునాయాసముగా నీతీగె తెఱువఁగలదా!

గోవిం—సందేహమెందులకు! మీరు స్వయముగా ఈ చిత్రమును చూడవచ్చును. అక్షయునిగదిపద్దకు నాతోరండు.

ఇరువురును అక్షయుని గదినద్దకుఁ బోయిరి. తలుపులను బిగించిరి! గోవిందరావు తాళపురంధ్రములోనుండి తీగెయొక్క కొక్కెము గల భాగమునులోనికిపోనిచ్చి రెండవభాగమును బల్బుతీసివేయఁబడిన విద్యుచ్ఛక్తిదీపముయొక్క విద్యుద్బలమునకు తగిలించెను. అంతట నాతఁడు తీగెను ద్వారమునకుబంధింపఁబడిన మరలపైన కెలుకగా విద్యుద్బలము వలన ఆమరలు విచిత్రముగా ఊడిపోయి ద్వారము తెఱువఁబడెను. తలుపులను మూసి మఱల కెలుకగా బంధింపఁబడెను. అంతట గోవిందరావు సింగును చూచి—

"విద్యుచ్ఛక్తిని హంతకుఁ డేవిధముగా నుపయోగించుకొనియెనో, ఎలెక్ట్రిక్ బల్బుతోడను, ఈతీఁగెతోడను ఈవ్యవహారమున కెట్టి సంబంధము గలదో మీకిప్పుడు అర్థమైనదా? హంతకుఁడు తొలుత తన కార్యానుకూలమునకై మరలకు నూనెవేసి సులభముగా త్రిరుగునట్లు చేసికొనెను. తరువాత విద్యుద్బలములు ఈతీగెద్వారా ప్రవేశపెట్టి రంధ్రమార్గమున తీగెను లోనికిబోనిచ్చి మరలకు ఈవంక తగల్చిన విడిపోయినవి. ఆవంక తగిల్చిన బంధించినవి. బయటినుండి సులభముగా నీచిత్రమును చేయఁగలిగినాఁడు!" ఆగాయకుఁడే హంతకుఁడు. చూచుచుండఁగా మన కన్నులలో దుమ్ముచల్లి పారిపోయినాఁడు! మనకు తన

శక్తి నెఱింగించుటకై దీని నాధారముగా విడిచి చనినాఁడు" అని విశదపఱచెను.

హంతకుఁడు చేసినందుల కట్లుండగా—దీనినంతను గోవిందరావు కనిపెట్టినందుల కాతని శక్తికిఁదలంచి సింగు విస్మితుఁడగుచుండెను.

సింగు—గోవిందరావుగారూ! అట్లయిన మనము గదిలోఁజూచినవాఁడు వృద్ధుఁడు—

ఈయింటియామె చెప్పుచున్నవాఁడు యువకుఁడు—ఏది నిజమై యుండును.

గోవిం—రెండునునిజమే!—వాఁడేవీఁడు!—



## తొమ్మిదవ ప్రకరణము.

ఛాయాపటము.

వార్తాపత్రికలలో నెచ్చటను ప్రతాపుని సంఘమునకును ఈ చీట్లపేక హత్యలకును సంబంధమున్న విషయము ఇంకను ప్రకటింపఁబడలేదు. ఐనను—భైరవున కదియంతయు తెలియును. ఇంతేకాక తన మిత్రులు మువ్వురు వరుసగా హంతకునకు బలియైనసంగతి విని నప్పటినుండియు అతఁడు మితిలేనిభీతికి లోనయ్యెను.

గోవిందరావు—ఒక దినమున భైరవుని జూచుటకై ఇంచిపేటకు బోయెను. భైరవుఁడు తన యింటనే ఒక గదియందు తగినంత జాగ్రత్తలో నున్నాఁడని పోలీసుభటులాతని కెఱింగించియుండిరి. పరిస్థితులను బట్టి అతనికంత భీతిగల్గెననుటలో నాశ్చర్య మేమియునులేదు.

గుమ్మముపద్దనే—గోవిందరావునకు భైరవుని సేవకుఁడగు మతంగుఁడు దర్శనమిచ్చెను. అతఁడు తలుపు దెఱచి "లోనికి దయచేయుఁడు" అని పలికెను.

గోవిం—ఓహో! మీయింటిలో ప్రవేశించుట చాల కష్టమని తలంచితిని. కాని నేను పొరపడితిని! నేను తలంచినంత కష్టముగా కనఁబడలేదు.

మతం—మీరు పొరపడలేదు. మీరు కష్టముగా భావించినగది యిది గాదు. మాయజమాని పైగదిలోనున్నాఁడు! ఆగదిలోనికి ప్రవేశించుట ఇంత సులభము కాకపోవచ్చును. ఇప్పుడు మాయజమానియున్నగది బ్యాంకువలె సురక్షితమైనది. దానిలోనున్నంతవఱకును ఆయన ప్రాణముల కెట్టిభయమును గలుగదని నానమ్మకము! అక్షయుఁ డింటినుండి బయటికి వెళ్లియే—ప్రాణాపాయముఁ దెచ్చుకొనెను.

గోవిం—ఈ మాటసత్యమే!—కాని అతఁ డాయర్ధరాత్రమున రెండుగంటలవేళ— ఇంటినుండి యేల బయలుదేరవలసివచ్చెనో—నాకాశ్చర్యముగా నున్నది!—మతంగా! మఱియొక చిత్రము!—ఆరాత్రి—ప్రతాపునివలె వేషమువేసికొనిన హంతకుఁడు చాల సద్భుతమగు నాటకముం బ్రదర్శించెను!—రాత్రి రెండుగంటల సమయమున అక్షయుని గదిలోనికి మహాద్భుతమైన యొక ఫాస్‌ఫరస్ దీపపుకాంతి ప్రవేశపెట్టఁబడినట్లు—కంటితో ప్రత్యక్షముగాచూచిన సాక్ష్యముగలదు. హంతకుఁడు సరిగా ప్రతాపునివలెనే యున్నట్లుగూడ సాక్ష్యమువచ్చినది. బయోనెట్ (Bayonet) వలన చేయఁబడిన ఎలక్ట్రిక్ మ్యాగ్నెట్ (Magnet) సహాయమువలన తలుపులకు బిగింపబడిన మరలు వదలింపఁబడినట్లు కనిపెట్టితిమి! బయటి విద్యుద్దీపముబల్బు తొలగింపఁబడి తద్విద్యుచ్ఛక్తిని వినియోగించినట్లును తెలిసికొంటిమి!

ఇట్లుపలికి గోవిందరావు—తనవెంటఁ గొనివచ్చిన ఒక పొట్లమును విప్పి దానిలోనుండి యొక ఎలక్ట్రిక్ బల్బునుతీసి "ఇదిగో! అదియే ఇది—ఈ యభియోగముందొక ప్రమాణము! ఒకసారి దీనిని పరిశీలించు!" అని పలికెను.

మతంగుఁడు బల్బును చేతఁబట్టుకొని జాగ్రత్తగా పరీక్షించెను.

మతం—ఇందుగల విశేషమేమి? ఇది ప్రమాణముగా నెట్లుపయోగించును.

గోవిం—దీనిని హంతకుఁడు విద్యుద్దీపమునుండి తొలగించి యావిద్యుచ్ఛక్తికి తన ఎలెక్ట్రిక్ మ్యాగ్నెటును తగిలించెను. దీనిమీఁద అసంఖ్యాకములగు వ్రేలిముద్రలు పడియున్నవి? వాని నన్నిటిని ఛాయాయంత్రము ద్వారా పటముతీసి జాగ్రత్తపఱచితిమి. కనుక ఇప్పుడు దీని యుపయోగమంతగా లేదు! కాని మేము హంతకుని బంధించినప్పు డిది ప్రత్యక్షప్రమాణముగానుండునని తలఁచి దీనినిగూడ నొక సాక్ష్యముగా నుంచితిమి! ఇది చాలా ఆశ్చర్యముగా లేదూ?

మతంగుఁడు అది యాశ్చర్యమేయని సమ్మతించెను. కాని, వెంటనే చాలా కుఱ్ఱతనపు అవివేకసాక్ష్యమని గోవిందరావుచర్యకు తనలో నవ్వుకొనెను.

మతంగుఁడు భుజములెగురవేసెను. అతఁడిట్లు పలికెను.

మతం—ఈయిండ్లలో సేవకుల గదులు యజమానుల గదులతో ప్రత్యేకింపఁబడియున్నవి! ఆ భాగమునకును, ఈభాగమునకును నడుమ నొక చిన్న తలుపుమాత్రము ఉండును! ఆ మధ్యతలుపునుగూడ హంతకునివలన భీతిచేత—మా యజమాని బంధించి మరలు త్రిప్పివేసినాఁడు!

గోవిం—అట్లయిన నాకిక యోచింపవలసిన అవసరమే లేదు! హంతకుఁడు అక్షయుని గదితలుపులను తెఱచిన విధానమును నే నిప్పుడు ప్రయోగింపవచ్చును!

అని పలికి గోవిందరావు—గాయకుని గదిలో తనకు లభించిన యినుపయూచను తన కారులోనుండి తీసికొనివచ్చి ఆతీగె తగినంత పొడవుగా నుండుటచేత గదివెలుపలనున్న ఎలెక్ట్రిక్ దీపపు విద్యుచ్ఛక్తికి దానిని తగిలించి ద్వారమును తెఱచుటకు అనుకూలముగనే యుండెను! గోవిందరావు దానిని తగిలించుపనియందుండఁగా ఇదివఱలో తనకు గోవిందరావు చూపిన బల్బును మఱల చూడవలెనని మతంగున కభిలాషకల్గుటచేత అతఁడు పొట్లమువిప్పి పరిశీలించుచుండెను. అంతలో నాబల్బు ప్రమాదవశమున మతంగుని చేతినుండి నేలపైఁబడి తునాదునుకలుగా బ్రద్దలై పోయెను. మతంగుఁడు భయముతో—గోవిందరావును చూచి,

"గోవిందరావుగారూ! చేయిజాఱినందున బల్బు నేలపైఁబడి బ్రద్దలై నది! ఇందులకు నాకు విచారమును భీతియుఁ గల్గుచున్నవి! దీనితో అంత ముఖ్యమైన అవసరములేదని మీరు చెప్పితిరిగా?" అని పలికెను.

మతంగుఁడు తలంచినట్లు—గోవిందరావున కంత యాగ్రహాము కలుగ లేదు.

గోవిం—పోనిండు!—బ్రద్దలై పోయిన గాజుపెంకుల కొఱకు దుఃఖపడి నందువలన లాభమేమి? ప్రమాదములు తఱుచుగా అందఱికిని వచ్చుచుండును!

ఇట్లుపలికి యతఁడు పగిలిన గాజుపెంకులను బూటుకాలితో దూరముగా త్రోసివేసెను. తరువాత నాతఁడు విద్యుచ్ఛక్తి తగుల్పఁబడిన ఆ యినుపయూచను తలుపురంధ్రములోనికి పోనిచ్చి త్రిప్పగా—అనాయాసముగా ద్వారము వివృతమయ్యెను.

గదిలోపల—భైరవుఁడొక వ్రాతబల్లకడఁ గూర్చుండి ఏదియో వ్రాసికొనుచుండెను! దూరమున నిద్దఱు శిలావిగ్రహములవంటి మనుష్యులు శాంతముగ గూర్చుండి చీట్లపేక ఆడుకొనుచుండిరి. తలుపు తెఱువఁబడిన ధ్వని వినఁబడినతోడనే వారు ముగ్గురును ఒక్కసారిగా ఉలికిపడి తమ ఆయుధములపై చేతులువేసిరి!

గోవిందరావు నవ్వుచు చేయియెత్తి—"మఱేమియు ప్రమాదములేదు! నన్నుమాత్రము మీ తుపాకులతో—కాల్పకుఁడు! మీ పుణ్యము!—నేను భైరవునితో రెండుమాటలాడిపోవచ్చితిని!" అని పలికెను.

భైరవుఁడు కోపముతో—గోవిందరావును జూచుచు—"అకస్మాత్తుగా నీవు లోనికేలవచ్చితివి? నీకు నాతో పనియేమియును లేదు!" అనియెను.

భైరవుని పిడికిలి బిగిసియుండెను. అతనిగడ్డము ముందుకువచ్చెను. కంఠస్వరము భీతిచేతను ఆగ్రహముచేతను వణకిపోవుచుండెను.

ఎవ్వఁడు సప్తవర్షపూర్వమున మృతుఁడైన ప్రతాపుని రూపముతో నిప్పుడు కాన్పించుచు పిశాచభ్రమఁ గల్గించుచున్నాఁడో—ఎవ్వఁడు రాఘవ, ప్రసాద, అక్షయులను శ్రమలేకుండ కడు చాతుర్యమున యమసదనమున కంపెనో—ఏభయంకరాకారుని నేటిదనుక పోలీసువారుసయితము బంధింపఁజాలక ప్రయాసముల పాలగుచున్నారో—ఆ భయంకరరాక్షసుని—ఆ యమదూతను—తలంచినంత మాత్రమున భైరవుఁడు తల్లడిల్లిపోవుచున్నాఁడనుటలో సందేహమేమియును లేదు.

రాఘవుఁడు—తొలుదొల్త ఎట్టి సూచనయు లేకుండ ఉరిదీయఁబడియెను. పిదప దుర్గాప్రసాదుఁడు కొంతసూచనతో వధింపఁబడెను—ఆపైన—అక్షయునకు అనేక సూచనలు గల్గియు—తగినంత రక్షణయుండియు మృతితప్పదయ్యెను—ఇప్పుడు ప్రతిధ్వనియు ప్రతిఛాయయు—

హాంతకుని యాకృతితో—భీభత్సస్వరూపమున భైరవుని రక్తనాళము లలోఁ బ్రవేశించి—జీవములతో నుండగనే—ఆతనిని చంపివేయుచున్నవి!

పై హేతువుల నన్నిటిని విమర్శించినయెడల అప్పటి పరిస్థితు లలో—భైరవునకంత ఆగ్రహముగల్గుట విపరీతవిషయము కాదని గోవిందరావు విశ్వసించెను.

భైరవుఁడు మహాగ్రహముతో వణకిపోవుచున్నను గోవిందరావు త్వరపడక శాంతముగ నిలువఁబడి చిఱునవ్వు నవ్వుచుండెను.

యమకింకరులవంటి యిద్దఱుమనుష్యులు భైరవుని రెండువంక లను తుపాకులతో రక్షించుచు నిలచియున్నను—స్వయముగా—భైర వునిచేత నొకతుపాకి యున్నను—లక్ష్యముసేయక గోవిందరావు వారి నడుమనుండి నడచివెళ్లి శాంతముగ భైరవునిచేయి పట్టుకొనెను. ఇది భైరవుని మఱింత క్రోధపరవశునిఁజేసెను.

"ఇచ్చట నీకేమియు పనిలేదు!" అనిపల్కెను.

గోవిందరావు—శాంతమృదుల స్వరముతో—"భైరవా! తొం దరపడకు. నేను నీకు మేలుచేయఁదలఁచి వచ్చితిని. నీకుచాల వింతగల్గించు నూతన విశేషమును నీకెఱిఁగింప నున్నాను!" అని పలికెను.

ఆమాటలు మంత్రాక్షరములవలె—భైరవుని వశపఱచుకొనెను. అప్పటికి భైరవుఁడు తన యెదుటనున్నవాఁడు పోలీసుఅధికారియనియు తానొక అపరాధియగు చోరుఁడనియు—ఆత్మజ్ఞానము గల్గెను. వెంటనే ఆతని ఆకృతియు—కంఠస్వరమును ప్రవర్తనమునుగూడ మాఱిపోయెను.

"ఓహో! ఎవరు? మీరా? గోవిందరావుగారా! ఇంకను చెప్ప రేమి?" అనియెను.

గోవిందరావు అతని ముఖప్రీతులను లక్ష్యపెట్టక—భైరవుని రక్షకులగు ఇద్దఱుమనుష్యుల వంకకును మరలు బిగింపఁబడియున్న తలు

పులవంకకునుచూచి—పెదవి విఱచి, "నిష్ప్రయోజనము—ఇవియన్ని యును బొత్తుగా నిష్ప్రయోజనము తేపటివఱకు......" అనియెను.

భైరవుఁడదరిపడి వెనుకకు జంకి— "తేపటివఱకా?—అనగా మీయుద్దేశ్యమేమి? గోవిందరావుగారూ! మీరు సగముచెప్పి గుప్త పఱచిన రహస్యమేమి?" అని యాత్రముతోఁ బ్రశ్నించెను.

గోవిందరావు శిరము పంకించెను. అతని శాంతవర్తనమును— భైరవుని యాత్రము—విచ్ఛిన్నముచేసెను.

"భైరవా! నిన్ను చంపుటకై హంతకుఁడు పన్నిన వ్యూహ మును కొంతవఱకు గ్రహింపఁ గల్గితినని తలంచుచున్నాను." అని పలికెను.

భైర—ఆహంతకుఁడెవ్వఁడు? ఆతెరమఱుఁగుననున్న యమదూతయెవ్వఁడు? వాని నింకను మీ రనుసంధింపలేదా?

గోవిం—లేదు—నేను సమ్మిళనవిధముగా—వాని ఛాయాపటమును నీకు చూపఁగలను.

భైరవుఁ డాత్రముతో నొక కేకవైచి ముందునకువచ్చెను.

భైర—దానిని మీ రెట్లు సంపాదింపఁ గల్గితిరి?

గోవిందరావు తన జేబునుండి చుట్టము కట్టఁబడని యొక ఛాయా పటమునుదీసి భైరవుని బల్లపై నుంచెను. భైరవుఁడు దానిని పరికించి చూచుచుండగా గోవిందరా విట్లనెను.

"ఇదిచాల అస్పష్టముగను అవ్యక్తముగను కనఁబడుచున్నది! ఐనను గుర్తించుట కనుకూలముగనే యున్నది!—ఈ ఛాయాపట సంగ్ర హణమునకు—రాఘవ ప్రసాదుల హత్యలలో వీలు కలుగలేదుగాని అక్షయుని హత్యలో వీలుగలిగెను." మా ఛాయాపటసంగ్రహులగు పోలీసుఉద్యోగులు ఎందులకైనను మంచిదను సంకల్పముతో ముందుగా అక్షయునిగదిలో నొక ఫొటోగ్రాఫుయంత్రము నుంచిరి! గదిలోనికి

హంతకుఁడు ప్రవేశించినతోడనే అక్షయుఁడు దానిని నొక్కియుండును. కాని గదియందు విపరీతమైన వెలుగు ఉండుటచేత ఛాయాపటము మిగుల అవ్యక్తముగను, అస్పష్టముగను పడినది. ఈయాకృతినే తమ కన్నులతోఁజూచిన మనుష్యులును సాక్ష్యము నిచ్చిరి!"

గోవిందరావు పలుకుచున్నంతసేపును—భైరవుఁడు పటమును చూచుచు ఆ యస్పష్టాకృతిని క్రమక్రమముగా—అర్థము చేసికొనుచుండెను. తుదకాతఁడు విపరీతమగు భీతిచే గడగడవణకి బల్లమీఁద మూర్ఛిల్లునేమో యనునట్లు వాపోవుచు ఆవురని కేకవేసెను.

"హా! హా! ప్రతాపునిరూపము!!"

అట్లాతఁడు భీతిల్లునని గోవిందరావు ఎఱింగియేయుండెను. అతఁడు భైరవుని వీపుపైఁదట్టుచు "భైరవా! భీతిల్లకు! ప్రతాపుఁడు ఉరిదీయఁబడి ఇప్పటి కేఁడుసంవత్సరముల కాలమైనది!" అని పలికెను.

మరల భైరవుఁడు పటమువంకకుఁజూచుచు కేకవేసెను!

"హా! హా! ప్రతాపునిరూపము!!"

ప్రతాపుఁడు మరణించెనని తెలియుచున్నను భైరవుని కన్నులకాపటము భూతాకృతివలె కనఁబడుచుండెను! భైరవునకు భీతిచే వెఱ్ఱియెత్తినట్లయ్యెను! అతఁడు తన యెదుటకు నిజముగా ప్రతాపుడు వచ్చినట్లును తనతో మాట్లాడుచున్నట్లును భావించుకొని వెఱ్ఱికేకలువేయఁదొడఁగెను.

"ప్రతాపా! నేను నీకెన్నఁడును ఏయపకృతిని చేసియుండలేదు. నేను నీకు నమ్మినబంటునై చరించితిని! నేనొక్కఁడనే నీనిజమైన మిత్రుఁడనని నీవనేకసారులు పలికియుంటివి! విధిలేక తుదిసారి నీపై నేను అందఱితోపాటుగా నట్టి సాక్ష్యమును చెప్పవలసివచ్చెను! నన్ను చంపుటకు నీయెడల నేనంత యవిశ్వాసినిగాని, ద్రోహినిగాని కాను!"

అతఁ డాయుద్రేకభావమునుండి తెప్పిరిలి ఆత్మసంయమనమును గావించుకొని శాంతించిన పిదప గోవిందరా వాతనితో

"భైరవా! నీకు వెఱ్ఱియెత్తినదా యేమి? ఆ యున్మాదమేమి? ప్రతాపుఁ డిచ్చట నున్నాఁడా! నీమాటలు వినుచున్నాఁడా! ఇదియేమి అల్లరి?—ఇటు వినుము! ఒక ముఖ్యమైనసంగతి!—రాఘవుని మృత దేహము ఉదయము ఏఁడుగంటలవేళ 9వ జనవరితారీఖునఁ గాన్పించెను! కాని డాక్టరుల తీర్మానము ననుసరించి అతఁడు 6 గంటలకు చనిపోయి నట్లు తెలసెను! 30 వ జనవరి తేదీనాఁడు దుర్గాప్రసాదుఁడు చంపఁబడెను! 9 వ తేదీకిని 30 వ తేదీకిని నడుమ 21 దినముల సావకాశము గలదు!—ఫిబ్రవరి 20 వ తేదీనాఁడు అక్షయుఁడు మరణించెను. జనవరి 30 వ తేదీకిని ఫిబ్రవరి 20 వ తేదీకిని నడుమ—మరల 21 దినముల అవకాశము గలదు! ప్రతిహత్యకును నడుమ 3 వారముల కాలముంచుట—చూచు చున్నాము! ప్రతిహత్యయు ఉదయమున సరిగా 6 గంటలకే జఱుగు చున్నది! ఱేపటిదినము మార్చి 13 వ తేదీ! అక్షయుని మరణము జఱిగి నేటితో మూఁడువారములు గడచినవి! ఱేపటికి ఇరువదియొకటవ దినము! ఱేపటి ఉదయమున 6 గంటలకు హంతకుఁడు నిన్ను చంపు ప్రయత్నము చేయునని నాయంతరాత్మ దృఢముగా తెలియఁజేయు చున్నది! నేను ముందుగా నిన్ను హెచ్చరించుటకును సాధ్యమైనచో నిన్ను రక్షించుటకును వచ్చితిని!" అని పలికెను.

భైరవుఁడు ఆపాదశిరఃపర్యంతమును గడ గడ వణకుచుండెను! కొంతసేపటి కాతఁడు గోవిందరావు మాటలను అర్థముచేసికొని ధైర్య ముఁదెచ్చుకొని,

"గోవిందరావుగారూ! మీరు నన్ను రక్షింతురుగాదా! నా కభయమిచ్చితిరిగాదా! అట్లయిన—వాఁడు నన్ను చంపలేఁడు! వాఁడు ప్రతాపుఁడైనను సరియే—ప్రతాపుని భూతమైననుసరియే—నన్ను చంపలేఁడు! వాఁడు నన్నెట్లుచంపఁగలఁడో చూచెనుగాదా! ఇంతవఱకు

నా హత్యవిషయమై—ఎట్టి ప్రయత్నమును చేయని యీ హంతకుఁడు ఉదయమున ఆఱుగంటలకు నన్నెట్లు హత్యచేయఁగలఁడు?—నాకు మీవంటి పోలీసువారి సంపూర్ణసహాయముండఁగా నన్ను వాఁడెట్లు చంపఁగలఁడు? అసంభవము!"

గోవిందరావు భైరవుని యున్మాద—ఉద్రేకప్రసంగమును విని,

"భైరవా! నేడు నీమెదడు చెడియున్నట్లున్నది. నీవు చాల భీతిల్లితివి! నేటికి సుఖముగా నిద్రింపుము!" అని పలికెను.

భైరవుఁడు డంబముతో—"ఏమి నేను భీతిల్లితినా! చచ్చిన వానికిఁగాని, బ్రదికియున్న వానికిఁగాని ఎవ్వనికిని నేను భీతిల్లను" అని పలికెను.

గోవిం—అట్లయిన నీవు మఱింత సౌఖ్యముగా నిద్రింపఁగలవు.నామాట విని నిద్రింపఁబొమ్ము.

అని పలికి గోవిందరావు వెడలిపోఁబోవుచుండెను. కాని భైరవుఁ డాతని బట్ట గట్టిగాఁ బట్టుకొని—"గోవిందరావుగారూ! మీరు నిజముగా నన్ను రక్షించెదరుగాదా?" అని యడిగెను.

గోవిం—ఆ—నిజముగా రక్షింతును. తెల్లవారఁగా—ఆరుగంటలకు నేనును సింగుగారును అవసరమైనచో కొందఱు భటులను వెంట గొని వత్తుము. సరిగదా.



# పదియవ ప్రకరణము.

## ఇన్స్పెటులాను.

మార్చి—నెల 12వ తేది—ఉదయము 5 గంటల 45 నిమిషము లైనది. బెజవాడ ఇంచిపేటలోని భైరవునియింటి మొదటి అంతస్తులోని భైరవుని విశాలమైనగదియందు భైరవుఁడును అతఁడు తన యాత్మరక్షణమునకై నియమించుకొనిన యిరువురు మనుష్యులును నిరూపకుఁడగు గోవిందరావును ఇన్స్పెక్టరుసింగును ఆయుధసహితులై యుండిరి. భైరవుఁడు తన తలుపులకును ద్వారమునకును బిగించిన ఇనుపమరలు యథాప్రకారముగ నుండెను. గదిలోని విద్యుద్దీపము వెల్గుచునే యుండెను. గుమ్మము బయట నొకపోలీసుభటుఁడు సాయుధుడై నిలచియుండెను.

భైరవుఁడు తనగదిలోని వ్రాతబల్లకడఁ గూర్చుండెను. అతని ఎదుటబల్లపై నొక తుపాకియును—ఒక విస్కి—బుడ్డియు నుండెను. ఆ బుడ్డి సగము ఖర్చుపడియుండెను.

భీతిచే—అతఁడు కొన్ని దినములనుండియు నిద్రాహారములను విసర్జించి చాల దారుణముగా సురాపానము చేయుచుండెను.

గోవిందరావును, సింగును, భైరవున కెదురుగా గోడదగ్గఱనున్న కుర్చీలలోగూర్చుండి ధూమపానముచేయుచు మందస్వరమున తమలో తాము సంభాషించుకొనుచుండిరి. వారిద్దఱిచేతులందును తుపాకులు గలవు. ఇద్దఱును జాగరూకులై—చుఱుకుగా నుండిరి.

భైరవుఁడు నియమించిన మోటుమనుష్యు లిరువురును తమ ప్రాణములకైనను తెగించి—భైరవుని రక్షింప సంసిద్ధులై యుండిరి! వారతి జాగరూకతతో నాల్గువైపులను కన్నులుగల్గి—పరిశీలించు చుండిరి! వారి చర్యలను జూచి. సింగు గోవిందరావుతో నిట్లనెను.

సింగు—చూడండి! గోవిందరావుగారూ! ఈ కుఱ్ఱవాండ్రిద్దఱు మన పోలీసువారికన్నను—అధిక శ్రద్ధతో భైరవుని రక్షించుచున్నారు. ఈసమయమున ఎవ్వరైనను పరిహాసమునకైనను భైరవునిపై చేయివేయ యత్నించినను—వీరు కాల్చివేయుదురు! నన్ను మాత్రము కాల్చుటకు నేను సమ్మతించను.

ఆమాటకు గోవిందరావు తలయూపి చిఱునవ్వు నవ్వెను! అతఁడును అట్టి అభిప్రాయములోనే యుండెను. ఇట్లు కొలఁదికాలము గడిచెను. గోవిందరావు గడియారమువంకకు జూచుచుండెను. 6 గంటలకు 5 నిమిషములు వ్యవధిగానుండెను. అనగా—భైరవుని దుర్మరణ ఘటనా కాలము 5 నిమిషముల సమీపములో నుండెను. ఏవంకనుండి యేపిట్ట పిడుగువచ్చిపడునో యను తలంపులతో అందఱి గుండెలును కొట్టుకొనుచుండెను. నాలుగు నిమిషములు—మూఁడు నిమిషములు—రెండు నిమిషములు—గడియారము టిక్—టాక్—టిక్ టాక్ అనుచు జఱిగి పోవుచున్నది.

భైరవుఁడు త్రాగుచున్న విస్కీతోపాటుగా గ్లాసునుగూడ నేలపై జాఱవిడచి—భీభత్సస్వరముతో నొక వెఱ్ఱికేకవేసి వ్రేలితో గవాక్షమువంకకు చూపెను.

గోవిందరావుచూచెను. కిటికీ అగ్నిజ్వాలలచే దహింపఁబడిపోవుచుండెను! అంతటను అగ్నియొక్క వేడిమి చుట్టుముట్టి తపింపఁ జేయుచున్నది! గవాక్షమునకు బిగింపఁబడిన ఇనుపయూచలు విచిత్రముగ నీటివలె కఱగి ప్రవహించిపోవుచున్నవి! ధూమము సర్వత్ర నిండిపోవుటచేత—ఎవ్వరికిని ఎదుటనున్న వస్తువుగూడ కాన్పించుటలేదు. అంతటను అస్పష్టధ్వనులు పొగ—మంటలుదప్ప నింకొకవిషయము గోచరించుటలేదు. గోవిందరావుమట్టునకు గోవిందరావునకు—కన్నులు తెఱచుట కసాధ్యముగ నుండెను. కనుగ్రుడ్లు అగ్నిగోళములవలె మండుచున్నట్లుండెను. ఆగంధ్రిగోళములో—మహాధూమాగ్ని ప్రళయములో—

భైరవుఁ డేమయ్యెనో చచ్చెనో బ్రదికెనోకూడ తెలియుటలేదు. భైరవుని మరణమట్లుండఁగా నిప్పుడు సంఘమరణము ఘటిల్లునట్లు తోఁచెను ఎవని యంతట వాఁడు స్వప్రాణ రక్షణమునకై ప్రయత్నించుకొన వలసి వచ్చెను.

భైరవుఁడు—ఆమహాకోలాహలములో—"కాలిపోవుచున్నాను. మండిపోవుచున్నాను. రక్షింపుఁడు! గోవిందరావుగారూ! రక్షింపుఁడు" అని కేకలువేసెను. కాని, అవి యెవ్వరికి వినఁబడును ?— వినను, ఆసందడిలోఁగూడ తన్ను భైరవుఁడు పేరుపెట్టి పిలుచుట శరణాగతత్రాణపరాయణుఁడగు నాపత్తేదారుని చెవినిఁ బడెను. అతఁడు "భైరవా! అచ్చటనే నిలువుము! కదులకు. నేను వచ్చుచున్నాను. అని కేకవేయుచు ఆవంకకు పరుగెత్తెను. కాని భైరవుఁ డాగదిలో లేఁడు! ఆవలిగదిలో నుండెను. తలుపు సులభముగా తెఱచుకొనినసందుల కాశ్చర్యపడుచు, గోవిందరావు రెండవగదిలోఁ బ్రవేశించెను. ఇంతలో నొక పెద్ద ధూమతరంగము వచ్చి యాపత్తేదారును గ్రమ్మివేసెను. ఆసందడిలో నెవ్వనిదో శరీరమాతని రాచుకొని రయమున పరుగెత్తినట్లయ్యెను. ఆవ్యక్తిని పట్టుకొనవలెనని—గోవిందరావు తన సర్వశక్తులను వినియోగించెను. కాని యంతలో మఱియొక ధూమతరంగము వచ్చి యాతనిఁ గ్రమ్మెను. అతని కేమియుఁ గాన్పింపనందున కర్తవ్యవిమూఢుఁడై పోయెను. అతని ప్రయత్నము లన్నియును వ్యర్థములై పోయెను.

ఆసందడిలో ఆఱుగంటలయ్యెను. ఆ సమయమునకే మేడమెట్ల మీఁద బ్రహ్మాండభాండములు బ్రద్దలైనంత మహాధ్వని యేదియో యయ్యెను. అందఱికిని చెవులు గడియలు పడిపోయెను. వెంటనే పెద్ద మంటలతోఁ గూడిన ధూమతరంగ మొకటి యావరించెను! ఆధ్వనియేమో తెలియలేదు. ఏమియుఁ గాన్పింపలేదు. క్షణములో ప్రళయము ఘటిల్లినట్లయ్యెను. గోవిందరావు సింగుతోఁ గలసి గదివదలి బయటికివచ్చెను.

కాని, సోపానములనిండ పొగ యలముకొని సర్వప్రాణులను అంధులనుఁ జేసెను. వారిరువురును డాబామీఁదికి వచ్చిన, అచ్చట కొంచెము పొగ—తక్కువగా నున్నందున, ఊపిరి విడువ నవకాశము గలిగెను. భైరవుఁ డెందున కాన్పింపలేదు.

గోవిందరావు సింగునుచూచి—"నీవు ఎడమచేతివైపు గదుల లోనికిఁ బొమ్ము—నేను కుడివైపు గదులు వెదకెదను" అని పలికి అతివేగముగ గదివెంట గది నన్వేషింపసాగెను. కాని భైరవుని జాడ యెందునుఁ గాన్పింపలేదు! అతఁడు వింతగా నదృశ్యుఁడయ్యెను.

ఒక పొగక్రమ్మియున్న గదిలో—నెవ్వఁడో యొకవ్యక్తి తిరుగాడుచున్నట్లు తుదకు గోవిందరావునకు దృశ్యమయ్యెను. ఆవ్యక్తి—హంతకుఁడో—కాక, భైరవుఁడో కాక తప్పదను నిశ్చయముతో మనోవేగమున నాతఁడా గదిలోనికి దూకెను. ధూమప్రకోపమునవలన వ్యక్తి యిదమిద్ధమని నిర్ణయించుట సాధ్యముగాకుండెను. కాని, ఆవ్యక్తి యొక దృఢదేహుఁడని మాత్రము నిర్ణయింపఁగలిగెను. గోవిందరావు వానిపైఁబడి దృఢముగా బాహుబంధమున, నిఱికించిపట్టెను. వ్యక్తియు సులభసాధ్యుఁడు గాక హోరాహోరి నాతనితోఁ బోరఁదొడఁగెను. ఇరువురి కరములందును ఆయుధములు లేవు. కావున వారి కత్తరుణమున ముష్టియుద్ధమే శరణ్యమయ్యెను. ఒకరి నొకరు బలముకొలదియుఁ బ్రహరించుకొనుచుండిరి. ఒక్కొకవేళ నొక్కొకరు క్రిందగుచుండిరి. ఒక్కొకరు మీఁదగుచుండిరి. ఆ మందిరమధ్యమున, ఆ మహాధూమసాగరాంతరమున వారిరువురును—మదించిన యాఁబోతులవలె నేలయంతయు దొరలుచుఁ బోరాడుచుండిరి. ఒకవంక ధూమము నాశికావక్త్రమార్గములలోనికిఁ బోవుచు నుక్కిరిబిక్కిరియగునట్లు చేయుచుండెను! ఇంకొకవంక శత్రు నిరోధము విజయాకాంక్షను వృద్ధిచేయుచుండెను. ఒకరి మొగమొకరికిఁ బోల్ప వీలుగలుగలేదు. తుదకు గోవిందరావుధాటి కావ్యక్తి నిలువలేక విజితుఁడై పోయెను. అంత గోవిందరావాతనిం దన సందిట

నదిమిపట్టుకొని యా గదివీడి—ధూమరహితమగు నావలి ప్రదేశమునం గొనిపోయెను.

బయటికిఁ గొనిపోయిన పిదప—గోవిందరావా వ్యక్తిని పరిశీలించి చూచెను. ఆతనిప్రాణములు నిలువున నెగిరిపోయెను. ఉద్రేకముతో నొక వెట్టికేక వేసెను. ఆవ్యక్తి హంతకుఁడునుగాఁడు—భైరవుఁడునుగాఁడు—మఱియెవ్వరు?

## "ఇన్‌స్పెక్టరు సింగు!!!"

జఱిగిన ప్రమాదమునకు పశ్చాత్తాపవిషాదములచే కలతనందిన హృదయముతో గోవిందరా వాతనికి పరిచర్య చేయుచు మెల్ల మెల్లగా జాగరూకునిగావింపయత్నించుచుండెను. సింగు క్రమక్రమముగా కన్నులను దెఱచి తన యెదుటనున్న గోవిందరావునుఁ జూచి—హీనస్వరముతో

"గోవిందరావుగారూ! ఇంతసేపటినుండియు పోరాడినది మనలో మనమేనా?" అని యడిగెను. గోవిందరావు సకరుణస్వరమున "మనమే సింగుగారూ! ధూమవ్యాప్తినలన ఒకరి నొకరము గుర్తించుకొనఁజాలక కేవలము అవివేకులమై ప్రమాదకరమగు కలహము నొనరించితిమి! అదృష్టవశమున ప్రాణహానిగలుగలేదు. మీ శరీరమునం దెట్లున్నది?" అని ప్రశ్నించెను.

సింగు—అంతగా భయములేదు! ప్రమాదమున కెవ్వరేమిచేయఁగలరు? మీ రేమియు విచారింపకుఁడు—ఇంతకును—హంతకుఁడుగాని తుదకు భైరవుఁడుగాని కాన్పింపలేదా?

గోవిం—కాన్పింపలేదు. కేవలము భ్రమపడి అమూల్యమగు కాలమును వ్యర్థపఱచుకొంటిమి! పొగ కొంచెము కొంచెముగా తగ్గుచున్నది. మీకు కొంచెము ఓపికగల్గినచో—రండు—భైరవు నన్వేషింతము! ఈ ప్రళయమునకు హేతువేమో కనుఁగొందము.

సింగు—ఆఱుగంటలై చాలసేపై నది! శతవిధములచేత—ఈ విప్లవ మధ్యమున—భైరవుఁడు హత్యచేయఁబడియే యుండునని నా నమ్మకము!

గోవిం—నాకును అట్లే తోఁచుచున్నది!—మీకు నాతో వచ్చుటకు శక్తిగలదా?

సింగు—ఓ! నాకంతగా శ్రమయేమియును లేదు.

ఇట్లు సంభాషించి వారిరువురును మేడమెట్లదగ్గఱకుఁ బోయిరి—అచ్చట నేమి కాన్పించెనోకాని గోవిందరావు పెద్దకేకవేసి "సింగుగారూ! సింగుగారూ! ఐనదయ్యా! అనుకొన్నంతయు నైనది!" అని పలుకుచునే—యతిత్వరముతో—తన జేబులోని చాకుఁదీసి మేడమెట్లకు కట్టబడి క్రిందికి వ్రేలాడుచున్న యొక త్రాటిని కోసివేసెను—వెంటనే యొక భారమైనవస్తువు గుభాలున క్రిందఁబడిన ధ్వనియయ్యెను. దానివెంటనే గోవిందరావు గబగబ మెట్లుదిగి పోయెను. అతని వెంటనే సింగుకూడ పరుగెత్తెను!—క్రిందబడియున్న మందభాగ్యుఁడగు భైరవుని మృతదేహము భయంకరాకారముతో వారికిఁ గాన్పించెను.

ఇఁక నేమున్నది? వారి ప్రయత్నము లన్నియు వ్యర్థమయ్యెను! భైరవుఁడు తుదకు హత్య చేయఁబడినాఁడు!—ఎంత విపరీతము!!!

* * * *

ఇంతలో వీధియందొక కలవరమును పోలీసువానిఈలయు వినఁబడెను. అదివిని గోవిందరావు వికసితవదనముతో—"సింగుగారూ! వినండి! మన పరిజనులు హంతకుని పట్టుకొనిరని తోఁచుచున్నది!" అని పలికెను. సింగు—త్వరితముగ ద్వారముం దెరచెను. వీధిలో కొందఱు జనులు గుంపుగూడియుండిరి! ఆ సమూహమధ్యమునందు—ఇరువురు మనుష్యులు తగవులాడుచుండిరి. ఇన్స్పెక్టరు సింగు వారివంకకుఁ బరుగెత్తెను. కాని అతఁడు సమీపింపకపూర్వమే కలహము పూర్తిసందెను. పోలీసుభటులు ఒక మనుష్యుని చేతులకు సంకెలలు వేయుచుండిరి!

ఆమనుష్యుఁ డొక పెంకెదిప్పకాయవలె కనఁబడుచుండెను. వాని పెదవులనుండి రక్తము కారుచుండెను వానిమొగముఖు, బట్టలును బురదవారియుండెను. వాఁడు ఉద్రేకముతో నేదో ఫిర్యాదు చేయఁ బోవువానివలె నుండెను. భటుఁడు సింగునుచూచి "అయ్యా! వీఁడు అనుమానపు మనుష్యునివలె కనఁబడుచున్నాఁడు. చిత్తగించవలెను!" అని పలికెను.

ఇన్‌స్పె—మంచిపని చేసితివి! ఈచీట్లపేక హత్యలకు సంబంధించిన హంతకుఁడు వీఁడేయని నాకు తోఁచుచున్నది! కదులనీయకుము.

బంధింపఁబడిన మనుష్యుఁడు ఆక్షేపణపూర్వకముగా వికటహాస మొనరించి "అయ్యా! మీరు మతియుండి మాటలాడుచున్నారా? నేను హత్య గావించితినా? ఎవరిని?—ఎప్పుడు?" అని యడిగెను.

ఇన్‌స్పె—ఎప్పుడా? ఏఁడు నిమిషములక్రిందట!—

మను—(మఱల నవ్వి) అట్లయిన నేను బ్రిదికితిని! ఏఁడు నిమిషముల క్రిందట నేను రైలుస్టేషనువద్ద—ఒక పోలీసు కాన్‌స్టేబిలుతో సంభాషించుచుంటిని. అప్పటికి నే నీవీధికైనను రాలేదు.

ఇన్‌స్పెక్టరు వానిమాటలు నిజమేనాయని ప్రశ్నించు సూచనగా భటునివంకఁ జూచెను. భటుఁడు "నిజమేనండి! రైలుస్టేషను ప్రక్క నుండి వీఁడిప్పుడే యిచ్చటికి వచ్చెను." అని చెప్పెను. ఆమాట విని ఇన్‌స్పెక్టరు చికాకుతోను, కోపముతోను పోలీసుభటుని చురచురఁ జూచుచు "ఓయీ! నీవు అపరాధికాని వానిని బంధించుటయేకాక ఈవ్యవధిలో నిజమైన హంతకుఁడు పారిపోవునట్లుగూడ చేసితివి!" అని పలికెను. భటుఁడు సిగ్గుతో తలవంచెను. సింగు బంధితునివంకకుఁ జూచి "అట్లయిన పోలీసు ఈలయూదిన వారెవరు!" అనెను.

మను—నేనే యూదితిని!

ఇన్‌స్పె—ఎందుల కట్లుచేసితివి?

మను——నాకుక్కను పిలుచుకొనుటకు నాకది సాంకేతికము!
ఇక్స్పె——అది పోలీసుఈలయని నీవెఱుఁగవా?

బంధితుఁ డందుల కెట్టి యుత్తరము నొసంగలేదు. తలవ్రాల్చి నిలువఁబడెను. అతనిని సావకాశముగ స్టేషనువద్ద విచారింప నచ్చునని తలఁచి సింగు—ఇరువురు భటులను వెంటనిచ్చి యామనుష్యుని స్టేషనుకుఁబంపి——మఱి యిరువురు భటులకు భైరవుని యిల్లువెదుక నాజ్ఞాపించెను.

అప్పటికి పొగయంతయు నంతర్ధానమై తేటగానుండెను. ఈ లోపల గోవిందరావు——మూర్ఛిల్లియుండిన యొక భటున కుపచారము చేయుచుండెను. ఆభటుఁడు భైరవుని గుమ్మమున కాపలాయుంపఁ బడినవాఁడు. ఏకారణముననో వాని తలపై బలమైన దెబ్బ తగులుటచేత స్పృహతప్పి పడిపోయియుండెను. కొంతసేపటి కాతనికి స్పృహకలుగగా——అంతకుఁపూర్వమే భైరవుని గదిగుమ్మమునకుగల పరదాల వెనుక దాగియుండినవాఁడెవ్వఁడో హఠాత్తుగ వెనుకనుం డివచ్చి తన తలమీఁద భయంకరముగ కొట్టి పారిపోయెనని చెప్పెను. ఆ గుమ్మములకు శీతగాలి చొఱకుండు నుద్దేశ్యముతో పరదాలు కట్టఁ బడియుండెను.

గోవిం——ఈవాఙ్మూలమునుబట్టి చూడఁగా హంతకుఁడా తెఱచాటుననే దాగియుండెనని తెలియుచున్నది. సింగుగారూ! మీరింక విశేషశ్రమపడి ఇల్లు వెదుకనక్కఱలేదు. అంతయు——నేను విమర్శించితిని. ఒకానొక ద్రావకముతో——హంతకుఁడు కిటికీ ఇనుపయూచలను కరగించెను. విపరీత ధూమవ్యాపకముచేయఁ గల అగ్నిగోళముచేత (Smoke Bomb) ఇంటినిండ పొగ గ్రమ్మించి——మనల నంధులనుగావించి, యాతరుణమున హంతకుఁడు తన సంకల్పమును సులభముగా నెరవేర్చుకొనఁ గలిగి నాఁడు. గుమ్మమునందలి భటునిఁ బ్రహరించి అచ్చటికి దగ్గ

అనేయున్న మేడమెట్లకు భైరవుని ఉరిదీసి పలాయనసూత్రము ను పఠించినాఁడు. సహజముగా హంతకునిపేరు విన్నంతనే గుండెలు బ్రద్దలయి పోవుచున్నట్టియు, అమిత సురాపానముచేతను, నిద్రాహారశూన్యతచేతను బలహీనుఁడై యుండినట్టియు—నిర్భాగ్యుఁడగు భైరవుఁడు హంతకుని చూడఁగనే ప్రాణములను విడిచియుండును. ఈవిషయమున మాకు సందేహ మేమియు నక్కఱలేదు—ఇదియంతయు—ఒక్కమనుష్యుని కార్యము! ఒక్కమనుష్యుఁడు ఈవిధముగా మనలను జయించెనని తలంచుకొనగా నాకు లజ్జగల్గుచున్నది

గోవిందరావు ఇట్లు పలుకుచున్న సమయమున భైరవుని యాత్మరక్షణకై నియమింపఁబడియుండిన యిద్దఱిలో నొకఁడు మిగుల శ్రమపడుచు నటకు వచ్చెను. గోవిందరావు వానినిఁ జూచి—"ఈ మహాధూమప్రళయమున మీరెచ్చట నున్నా?"రని ప్రశ్నించెను. అతఁ డిట్లు చెప్పెను.

"మేమిద్దఱమును ధూమముచే కల్లోలపరుపఁబడుచుండియును భైరవుని రక్షింపఁ దలఁచుచుంటిమి. ఇంతలో—ఆ పొగలోనికి—ఎవ్వఁడో వచ్చి—వెనుక గుమ్మముకడ భైరవుని హంతకుఁ డురిదీయఁ బోవుచున్నాఁడు. పొండుపొండని యాజ్ఞాపించెను. వాని ఆకృతియంతయు పొగవలన మాకుఁ గాన్పింపలేదు. కాని వాని తలపాగవలనను, కంఠస్వరమువలనను, ఇన్స్పెక్టరు సింగుగారై యుందురని భావించితిమి! అందుచేతనే—వెంటనే ఆయాజ్ఞను శిరసావహించి వెనుక గుమ్మముకడకుఁ బరువెత్తితిమి. కాని, యచ్చట నేమియుఁ గాన్పింపలేదు—నాసహచరుని తలపై నెవ్వఁడో కర్రతో మోదగా వాఁడు, స్పృహతప్పి పడిపోయెను. వాని నొకచో నుంచినాను. ఇప్పుడే లేచినాడు. కొంచెము సోడాయిచ్చి ఇట్లువచ్చితిని!—" అని చెప్పెను.

హంతకుఁ డేమార్గమున, బహిర్గతుఁడై పోయెనో—యనుసంధింపఁ దలఁచి, గోవిందరావు కొంతప్రయత్నము చేయఁగా, ద్రావకము లచే కరగింపఁబడిన గవాక్షమునకు బంధింపఁబడి క్రింది సందులోనికి వ్రేలాడుచుండిన త్రాడొకటి దృగ్గోచరమయ్యెను! ఇఁక సందేహ మేమియున్నది? హంతకుఁడు తద్గవాక్షపథముననే పలాయనుఁ డయ్యెను!—

గోవిందరావు వెంటనే యీ త్రాడుబట్టుకొని తానును క్రింది సందులోనికి జారెను. కాని అచ్చటి ప్రదేశమంతయు గడ్డిచే నిండి యుండినందున పాదచిహ్నముల గుఱుతులేమియుఁ గాన్పింపలేదు. హతాశుఁడై—గోవిందరావు సందులోనుండి వీధిలోనికి వచ్చెను. అచ్చట నొక యింటిముందర ఇరువురు మనుష్యులు—ఒక మోటారుకారును శుభ్రము చేయుచుండిరి! వారినిచూచి గోవిందరావు—"ఈమార్గమున నొక మనుష్యుఁ డిప్పుడే వెడలిపోయెను. వాఁడు ఎట్టి గుఱుతుగల కారు మీఁద వెళ్ళెనో మీరు చూచియుండిన చెప్పఁగలరా?" అని యడిగెను.

కొంచెము—విపరీతముగానుండిన యీ ప్రశ్నను విని—యీ మనుష్యులు విస్మితులై—"అయ్యో! ఎద్దియేని ప్రమాదము జఱిగెనా?" అని యడిగిరి.

గోవిందరావునకు సావకాశముగా ప్రశ్నలకు జవాబులు చెప్పు చుండుట కవకాశములేదు గావున అతఁ డాతురముతో—"అవును. హత్యజఱిగినది! త్వరగా చెప్పవలెను!" అనియెను.

గోవిందరావుతో భాషించినవాఁడు రెండవవానివంక దిరిగి "నీ కారులలో నొకదానిమీఁదనేకాదూ అతఁడు వెళ్లినది!" అని ప్రశ్నించెను.

ఆ యిద్దఱిలో—రెండవవాఁడు మొదటివానియంత తెలివిగల వాఁడు కాఁడు. అతఁడు—మొదటివాని ప్రశ్నకు—"ఓహో! ఇప్పుడు వెళ్లిన మనుష్యుని సంగతియా! అవును. అతఁడు నా కారులలో నొక దానినెక్కి వెళ్లినమాట నిజమే! ఆఱుగంటల ఐఁదునిమిషముల కిచ్చట

కారును సిద్ధముగా నుంచవలెనని నిన్న మనకుచెప్పి ముందుగా డబ్బొసంగినవాఁడు! అట్లయిన హంతకుఁ డాతఁడేయందురా యేమి?" అని యడిగెను.

గోవిం—నిశ్చయముగా—వాఁడే హంతకుఁడు. వాఁడు వెళ్లినకారు ఎట్టి ఆకృతిగలది? దాని నెంబరు ఎంత?—వేగిరముచెప్పు—

మను—నెంబరు "186_M."—కారు నీలిరంగుగలది. 8 సీటరు—ప్లెజరుకారు.

గోవిందరావు నెంబరును మాత్రము నోటుపుస్తకములో అతివేగముగ వ్రాసికొని కదలుచున్న ఆ కారులోనేయెక్కి కూర్చుండి, "నాపేరు గోవిందరావునాయఁడు_పోలీసు_సి. ఐ. డీని—పోలీసుఅధికారముతో నేను మీకారును ఉపయోగించుచున్నాను!" అని యొక్క కేకవేసి స్టీరింగు చక్రముపట్టుకొని నడుపసాగెను. ఈలోపల సింగుకూడనచ్చి కారును అందుకొని యొకచోఁ గూర్చుండెను. ఆ మనుష్యులు తెల్లపోయి—"అది ప్రైవేటుకారనియును, ఏపరిస్థితులలోగాని, ఎవ్వరికిగాని, దానిని ఇచ్చుటలేదనియును—ఏమేమో సమాధానము లింకను చెప్పుచుండఁగనే—గోవిందరావు—సింగు—కారుతో—అదృశ్యులై పోయిరి!

ఉదారంగుగల హంతకునికారు—గవర్నరుపేటవైపు రైలుగేటువద్ద ఒకసారియును ఐస్‌ఫ్యాక్టరీ సమీపమున నొకసారియును దూరముగా గోవిందరావుకు కనఁబడెను. గోవిందరావు తనకారును వాయువేగముతో నడిపించుచుండెను. మార్గమునందలి యాతాయాతజనులు దాని వేగమును గాంచి విభ్రాంతులై తప్పుకొని పోవుచుండిరి. దారిలోని పోలీసుభటులకు గుఱుతుగా సింగుకారులోనుండియే తన యెఱ్ఱటోపీని బయటికి చూపుచుండెను. ఇంతటి మహావేగమున కారును నడుపుకొని చనినను ప్రయోజనమేమియును లేకపోయెను_కాన్పించుచున్నట్లే యుండి—హంతకునికారు—ఏదో సందుమలుపున అకస్మాత్తుగ అదృ

శ్యమై పోయెను! ఎటుపోయినదియు తెలియలేదు—సరూపకుఁడు—అనేకులను ప్రశ్నించి ప్రశ్నించి వేసారిపోయెను. తుదకు—గోవిందరావు నిరాశతో కారును మఱల్చి—మఱల ఇంచిపేటకు నడుపసాగెను. మార్గమధ్యమున గోవిందరావును—సింగును—ఇట్లు సంభాషించిరి.

సింగు—గోవిందరావుగారూ! హంతకుఁడు భైరవునిగదిలో ఒక టార్చిలైటునువదలి వెళ్లినాఁడు. దానిమీఁద వాని వ్రేలిముద్రలు పడినవి! అవి సరిగా ప్రతాపుని వ్రేలిముద్ర లనుటకు సందేహము లేదు—ఇదియంతయును బహు క్లిష్టమైన సమస్యగా నాకుఁగనఁబడుచున్నది! హంతకుఁడు ప్రతాపుఁడుదక్క వేఱొకవ్యక్తికాఁడని మనకు తగినన్ని ప్రమాణములు లభించియున్నవి. ఈ నిమిషమునందు మనము వానిని ఉరిదీయింపఁగలము. కాని మన దురదృష్టవశమున వాఁడిదివఱకు చాలకాలము క్రిందటనే ఉరిదీయింప బడినాఁడు! చచ్చినవానిని తిరిగి చంపుటెట్లు? హత్య చేయఁబడిన ప్రతివ్యక్తియు తన మరణకాలమున ప్రతాపునిఁ జూచియున్నాఁడు! ఆవిషయమంతయు—అభేద్యరహస్యముగా నున్నది! దీనిని భేదించుమార్గము తోఁపకున్నది!

గోవిం—(తలనూపి చిఱునవ్వుతో) తొందఱపడవద్దు సింగుగారూ! ప్రతాపుడు చనిపోయినమాట సత్యము! ఛాయాపటముల తోడను వ్రేలిముద్రలతోడను అనేక అనేక విషయములను ఋజువుచేయవచ్చును గాని, ఒకసారి చనిపోయినవ్యక్తి తిఱిగి—తన శత్రుత్వమునకు ప్రతీకారము చేయుటకై—భూతలమునకు తిఱిగి యవతరించు ననుమాటను మాత్రము—ఋజువు చేయఁజాలము! ఈవ్యక్తి—చచ్చినప్రతాపుఁ డెన్నడును కాఁజాలఁడు—వీఁడు సంపూర్ణముగా ప్రత్యేకించి యింకొకవ్యక్తి కాకతప్పదు. అయితే—వీఁడు ప్రతాపుని ఆకృతి ననుసరించినాఁడు! ప్రతాపునియొక్కయు—వీనియొక్కయు వ్రేలిముద్రలకు భేదమేమి

యునులేదు. వీఁడు ప్రతాపుని శత్రుత్వమును ఏకారణముచేతనో తనదిగాభావించి ప్రతికృతి సేయుటకై ఈహత్యలనుసేయ సిద్ధపడినాఁడు! నిలకడమీఁద సర్వవిషయులను అనుసంధించి నిరూపింపఁగలము. మొత్తముమీఁద—ప్రతాపుడు చాల తెలివిగలవాఁడే—కాని ఈయనుకరణ ప్రతాపుఁడు అసలు ప్రతాపునికన్నను తెలివిగలవాఁడుగా కనఁబడుచున్నాఁడు. వ్యూహమంతయు చదరంగపు—ఎత్తువలె పన్నఁబడినది. గతరాత్రి హంతకుఁడు—భైరవుని గదిలోనే నిద్రించెను—ఇందఱి కన్నులలో దుమ్ముగొట్టి తన సంకల్పమును నెరవేర్చుకొనిన యీ హంతకుడు మనకు సరియైన ప్రతిస్పర్ధి—వీనిని జయించితీరెదను. మీరు తొందఱపడవద్దు—

ఇట్లు సంభాషించునంతలో కారు ఇంచిపేటకు వచ్చెను. గోవిందరావు కారును తిరిగి వారికప్పగించుచు— "ఆ మొదటికారు తిరిగి రాలేదా?" అని యడిగెను.

"అదియేమి? మీరు వెంబడించితిరిగాదా? తుదకు మీకు దొరకనేలేదా?" అని వారడిగిరి. గోవిందరావు నిరాశతో లేదనిచెప్పి—ఆ కారుడ్రైవరు వచ్చినయెడల పోలీసుస్టేషనుకు వానిని పంపవలెనని ఆజ్ఞాపించి వారి ఎడ్రెసువ్రాసుకొనెను.

పిదప గోవిందరావు సింగుతోగలసి భైరవుని యింటికి నడచెను. మతంగుఁడు తన యజమానుని మృతికి దుఃఖించుచు విచారసూచకముగా నల్లని బట్టలను కట్టుకొనెను. గోవిందరావునుగాంచి యాతఁడు నమస్కరించి ఏడువసాగెను.

మతం—గోవిందరావుగారూ! తుదకు నాగతి యేమగునోయని నేను గుండె బ్రద్దలయి పోవుచున్నాను. ఈ ప్రపంచకమున నాకు నిలువనీడలేదు. ఆమహారాజు నాయజమానియైన భైరవుఁడు

నన్ను మిక్కిలి ప్రీతితో చూచెను. ఇప్పు డామహారాజు మర ణించుటచేత నేను దిక్కులేని పక్షినై పోయితిని.

గోవిం—మతంగా! దుఃఖింపకుము! విధివిధానము దుర్ఘటమైనది! మానవమాత్రులము మనము దాని నతిక్రమింపఁజాలము. ఇంత కును నీయజమానుని హత్యవిషయమున, నీవెఱింగిన విషయ మేదైన నున్నచో చెప్పఁగలవా?

మతం—అయ్యా! ఆదుర్మార్గుఁడగు హంతకుని విషయము నాకేమా త్రము తెలిసినను నాబలహీనస్థితిని పాటింపక, కేవల ప్రభు విశ్వాసమున, నాప్రాణములనైన లక్ష్యపెట్టకుండ నేను వానిని మట్టుబెట్ట సాహసించియుందును. కాని ఇదియంతయు భేదనము నకు సాధ్యముగాని మహారహస్యముగా నున్నది! కాని నాకేమి యుఁ దెలియక అంధకారమునఁ బడి కొట్టుకొనుచున్నాను. ఐనను—మహాసమర్థులగు మీరున్నారు. ఇదే నాధైర్యము!— యెట్లయినను ప్రయత్నించి మీరాపాపాత్ముని బాధింతురని, నానమ్మకము!—

గోవిం—మతంగా! నీకేమియుఁ దెలిసియుండదని నేనెఱుఁగుదును. హంతకుని పట్టుకొనుటకై—నేను సర్వవిధములచేతను ప్రయ త్నించెదను.



## పదునొకండవ ప్రకరణము.

### కాగితపు సంచి.

భైరవుని హత్యాసందర్భమున, పోలీసుఈల నూదినవానిని ఇన్‌స్పెక్టరు సింగు విచారింపఁ బ్రారంభించెను. ఆపురుషుఁడు సజ్జనుఁడైనను—దుర్జనుఁడైనను మొత్తముమీఁద తాను పోలీసు సాంకేతికమగు ఈలనూదిన కారణమున, హంతకుఁడు తప్పించుకొని పారిపోవుట కవకాశమును గల్పించినవాఁడయ్యెను.

అతఁడు ధైర్యశాలియైన జవసత్త్వములుగల్గిన పురుషుఁడు. నాగరిక పద్ధతిప్రకారము దుస్తులను ధరించెను. ఐనను—అతఁడు కొంచె మనుమానాస్పదుఁడే యని, సింగుయొక్క సూక్ష్మదృష్టికిఁ దోఁచక పోలేదు. ఆపురుషుఁడు చాల డాబుదర్పములతోఁ బ్రవేశించెను. తన వద్ద నెట్టియాధారమును పోలీసువారికి లభింపదని యాతఁడు బాగుగ నెఱింగియుండెను. ఇన్‌స్పెక్టరు సింగును జూచి, ధైర్యముతో నాతఁ డిట్లు పలికెను.

"ఇదిగో! చూడండి! నన్ను స్వేచ్ఛగా వదలివేయవలసినదని నేను మిమ్ము అధికారరీత్యా అడుగుచున్నాను. నేను పోలీసుఈలను ఊదితి నను నేరము తప్ప నన్ను మీరింకేవిధముగను, నిర్బంధింపఁజాలరు కాని నాకుక్కను పిలుచుటకై సాంకేతికముగా ఆయీలను వేయుట అపరాధ మనిమాత్రము, మీరు సిద్ధారణచేయఁజాలరు!"

తరువాత—అతఁడు, దెబ్బవలన రక్తము స్రవించుచున్న తన చెంపను, పోలీసుభటునితో పెనగులాడునప్పుడు రోడ్డుమీఁది బురద వలన ఎఱ్ఱనైన తన బట్టలను చూపుచు,

"చూచితిరా? నేను పోలీసువారివలన నిష్కారణముగ, అవమానింపఁ బడితినని వారిపై—ఛార్జీ పెట్టెదను." అని పలికెను.

పరిహాసప్రియుఁడైన ఇన్స్పెక్టరు ముఖమున నెట్టిభావభేదమును గాన్పింపలేదు. అతఁడు సావధానముగ నొకసిగరెట్టును కాల్చుచు—సిగరెట్టుపెట్టెను బల్లపై నుంచి—

"నీపేరు—ఏమని చెప్పితివి?—వీరభద్రుఁడని కాదూ?

వీరభద్రుఁడు ఇన్స్పెక్టరు నడుగకుండ అతిసాహసమున సిగరెట్టును తీసి—అగ్గిపెట్టెకొఱకు దిశలు పరికింపసాగెను. సింగు అగ్గిపెట్టె నాతని చేతికందించి,

"నీపేరు?—అదేకాదూ?" అనియెను.

వీర—అవును. వీరభద్రుఁడే! కాని తక్షణము విడుదలచేయఁబడక పోయినచో పోలీసువారిమీఁద చార్జిపెట్టెదను.

ఇన్స్పెక్టరుసింగు—చిఱునవ్వు నవ్వెను.

ఇన్స్పె—అంత కోపపడగూడదండి వీరభద్రుఁడుగారూ! కాని ఇటు చూడండి! రాజమండ్రి పోలీసువారివద్దనుండి నా కొక రిపోర్టు వచ్చినది! అందు మీపేరు బలభద్రుఁడని యున్నది! మీమీఁద బలవత్తరమైన నేరముగలదు. ఇప్పుడు నేను మిమ్ము వీరభద్రుఁడని పిలువవలెనో—భలభద్రుఁడని పిలువవలెనో తోఁచుట లేదు.

ఇన్స్పెక్టరు పలికిన ఆమాటతో వీరభద్రునకు మతిపోయెను. అతఁడు సిగరెట్టును కాల్చుటమఱచెను. ఈయిన్స్పెక్టరు తన రహస్య విషయమును రహస్యనామమును— రహస్యాపరాధములను ఎట్లు గ్రహింపఁ గలిగెనాయని నిర్ఘాంతపడెను.

ఇన్స్పె—మంచిది వీరభద్రుఁడూ! నీపేరు—ఏదైననేమి? అది యిప్పుడు నాకంత ముఖ్యము కాదు. నాకు నీవిప్పుడొక ముఖ్యవిషయము నెఱిఁగింపక తప్పదు.

వీరభద్రుఁడు తన బెదరుపాటును పోలీసుఉద్యోగి గ్రహింపకుండ కప్పుకొనఁదలఁచి నిదానముగ సిగరెట్టునుకాల్చి—"అయ్యా! నేను

దొంగనుగాను. హంతకుఁడ నంతకన్నకాను—నావద్ద మీకెట్టివిషయ మును లభింపఁజాలదు!" అనియెను.

ఇన్స్పె—వీరభద్రుఁడూ! ఇటువిను—నీకు ఏదో మహత్తరరహస్యము తెలియుననికాదు. మేము వాస్తవమును సరిగా నెఱుంగుటకు నీ ప్రత్యుత్తరములు కొంత సహాయపడునని నాయుద్దేశ్యము! తెలిసికొంటివా?

వీర—(వికృతముగానవ్వి) అయ్యా! నన్నులాలించి—నానోట నేదో వాగించుటకు నేను పసిపిల్లవాఁడనుకానండీ!

ఇన్స్పె—ఆఁ—అలాగటోయ్ వీరభద్రుఁడూ! హత్య జఱిగినవెనుక దానివిషయమై జఱిగిన విషయములనెఱిఁగియు—చెప్పకదాచుట ఎట్టి నేరమో నీవెఱుఁగుదువా?

ఇట్లుపలికి సింగు తన యెదుటనున్న—ఏదో దీర్ఘమైన రిపోర్టును చదువుచున్నట్లు నటించి అది ఇంగ్లీషులో నున్నది. వీరభద్రున కింగ్లీషు తెలియదు. కాని సింగు చదువుచున్న రిపోర్టునందు అచ్చటచ్చట—"మర్డర్ కేస్ (Murder Case) అనియు భైరవుడు అనియు బలభద్రుఁడు—వీరభద్రుఁడు" అనియు కొన్నిమాటలు వినఁబడుచుండుట చేత అదియంతయు తన విషయమేయను తలంపుతో వీరభద్రుని గుండెలు బ్రద్దలై పోయెను. నిజములో అదియంతయు ఇన్స్పెక్టరుగారి స్వకపోలకల్పనమే యని మా పాఠకులకు తెలియును. ఇదివఱకే అతఁడు రాజమహేంద్రవరమున కొంతవఱకు అపరాధిగానున్నాఁడు. ఇప్పుడు ఇది యొకటి నెత్తిపైఁ బడినచో ప్రాఁతటంకులు బయలగునని యాతఁడు కంపించిపోయెను. కాని అతఁడు సాధ్యమైనంతవఱకు నిరపరాధివలె నటింపఁదలచి,

"నేనేమియు నెఱుఁగనండి—ప్రమాణపూర్తిగా ఏమియు నెఱుఁగను" అనియెను.

ఇన్స్పె—ఇదిగో! వీరభద్రుఁడూ! ప్రయోజనములేని మాటలతో కాల యాపన మేలచేసెదవు? నీవు ఏమైన నెఱిఁగియున్నను—ఎఱుఁగకయున్నను మొత్తముమీఁద నీవు పోలీసువారి ఈల నూదితివి! అనుమానస్థునివలె నటించితివి! ఇందు వలన పోలీసువారి దృష్టినీయందు ప్రసరించుటచేతనిజహంతకుఁడు పారిపోఁగలిగెను. తమ్ముమోసగించినట్లు పోలీసువారు నీపై నిపుడు అపరాధమును మోపెదరు. ఒకవేళ ఆ నేరారోపణము నిలువబడకపోవచ్చును. కాని ఆవిషయము తేలునంతవఱకును నీవు పోలీసువారి చేతులలో బాధపడుటమాత్రము తప్పదు. ఈ అసహ్యాకరమైన గంద్రగోళమునకన్న—కొంచెమో—గొప్పయో—నీకు తెలిసినదాని నెఱిఁగించి క్షేమముగానుండుట మంచిదిగాదాయని నీకు తెలియఁజెప్పుచున్నాను. నిన్నైనను నేనిప్పుడేదో కొంపముంచుకొనిపోవు విషయము నడుగనున్నానని భ్రమపడబోకు! ఆ విధముగా పోలీసు ఈల నుపయోగించి వారిని భ్రమింపఁజేయుమని నిన్ను పంపినవాని రూపమెట్టిదో చెప్పవలెను.

వీర—నాకు తెలిసినదేమనగా............

ఇన్స్పెక్టరు వీరభద్రుని చేయిపట్టుకొని వాత్సల్యపూర్వకముగ నిట్లనెను.

ఇన్స్పె—అంతే—వీరభద్రుఁడూ! నీవుమంచివాఁడవనినాకు తెలియును. నేను కోరిన విషయమును మాత్రము నీవుచెప్పిన చాలును. ఈ యపరాధమునందు నీకేపాటిదైనను సంబంధముకలదని విషయమును సయితము మేము మఱచి పోవుదుము!

ఇట్లుపలికి—ఇన్స్పెక్టరు మరల తన పూర్వపు రిపోర్టును చదువుకొనుచున్నట్లు నటించుచు "ఆలోచించుకొనుము!" అని పలికి వీరభద్రుని ప్రత్యుత్తరముకొఱకై వేఁచియుండెను.

కాని వీరభద్రుఁడు సామాన్యవ్యక్తికాఁడు! అతఁడంత శీఘ్రముగ సాధ్యపడునట్లు తోఁచలేదు—అతఁడు తనచేతనున్న సిగరెట్టును విసరి కిటికీనుండి యావలఁ బారవేసి "నే నాలోచించుటకేమియును లేదండి; నాకేమియును తెలియదు!" అనియెను.

ఇన్‌స్పెక్టరు చిఱునవ్వు నవ్వెను. అతఁడు తన బల్లమీఁది గంటను వాయించుచు వీరభద్రునిఁజూచి—"అట్లయినచో—వీరభద్రుఁడూ! ఇఁకనిన్ను వదలివేసెదను!" అని పలికెను.

వీరభద్రుని మొగము వికసించెను.

వీర—అట్లయిన ఇంక నెంతకాలము నే నిచటనుండవలెను?

ఇన్‌స్పె—ఎందులకు? నీవు వెళ్లవచ్చును!

ఇన్‌స్పెక్టరుగారి గంటను విని దుస్తులతోనున్న పోలీసుభటుఁ డటకు వచ్చెను.

ఇన్—ఈ మనుష్యుని బయటికి పంపివేయుము; రాంసింగ్!

వీరభద్రుఁడు తన సత్వరబంధవిమోచనమునకు విస్మయము నందక అలవాటుపడిన ప్రాఁతనేరస్థుఁడే కావున అతఁడు తన తెలివితేటల చేతనే తనకాసద్గతి లభించెనని గర్వించెను. భటునితో వీరభద్రుఁడు బయటికేఁ బోయిన తరువాత—సింగు టెలిఫోనులో గోవిందరావును పిలిచి—"నీవు చెప్పినట్లే చేసితిని. కాని ఆ నిర్భాగ్యుని నోట నొక్క-విషయమైనను బయల్పడలేదు. ఇఁకముందు కార్యము నీకే వదలుచున్నాను!" అని చెప్పెను.

* * * * *

వీరభద్రుఁడు వీధిలోనికివచ్చి—సంతృప్తికరమైన యొక దీర్ఘనిశ్వాసమును వదలి యచటినుండి దక్షిణముగా నడువసాగెను. దీర్ఘాలోచనము గావించుచు దారినడచుచుండిన యాపురుషుని కెఱుకలేకుండ అతని వెనుకనే వేరొక ఛద్మవేషధారియగు వ్యక్తి నడచుచుండెను. అతఁడు బహుశః డిటెక్టివు గోవిందరావు కాకతప్పదని మాపాఠకు

లనుమానింపకపోరు. వీరభద్రుఁడు తుదకొక యింటఁ బ్రవేశించెను. అది హోటలువలె కనఁబడుచుండెను. వీరభద్రుఁడొక బల్లవద్దనున్న కుర్చీలోఁ గూర్చుండి ఒక్కొక్క గుక్క వంతున నిదానముగ తేనీటిని సేవించుచు మాటి మాటికిని ద్వారమువంకకు ఉద్దేశ్యపూర్వకముగఁ జూచుచుండెను. ఆ ప్రవర్తనమునంతను రహస్యముగ గమనించుచుండిన డెటెక్టివ్ గోవిందరావు—వీరభద్రుఁ డెవరికొఱకో నిరీక్షించుచున్నాఁడని తెలిసికొనెను.

అనేకులాహోటలునందు—ఆవంకనుండి యీవంకకు కార్యాంతర నిమగ్నులై చనుచుండిరి. కాని, వీరభద్రుఁ డింకను ఎవ్వరికొఱకో ప్రతీక్షించుచుండెను. మధ్యాహ్నము రెండుగంటలవఱకును ఆవిధముగా వేచివేచి ప్రాణమువిసిగినందున అటనుండిలేచి, ద్వారము నతిక్రమించి బయటకు వచ్చెను.

అతని నిష్క్రమణమునుఁగాంచి డెటెక్టివ్ గోవిందరావు అతని పోకడ నొకకంటఁ బరికించుచు, వేగముగ వీథిలోనికివచ్చి—అచట నిలచియున్న యొకమనుష్యుని రహస్యసౌజ్ఞచేఁ దనవంకకుఁ బిలిచి, మెల్లగా—“ఇటురమ్ము—నీతో మాటలాడవలెను!” అనియెను.

ఆమనుష్యుఁడు దగ్గఱకువచ్చి—“ఏమిపని?” అని యడిగెను.

గోవిం—(మెల్లగా) ఆపోవుచున్న మనుష్యునిఁజూచితివా? ఇటుచూడుము! ఈకాగితపుసంచిని ఎట్లైన వానికి తెలియకుండ వానిజేబులో పెట్టవలెను. అందులకై నీకు ఏఁబదిరూపాయలు బహుమాన మిచ్చెదను.

దొంగలను పట్టుకొనుయుక్తియందు ఆకాగితపుకవరును దొంగల జేబులలో పెట్టఁబడుటకై ఇదివఱకు అనేకసారులు గోవిందరావు ఏఁబది రూపాయల బహుమానములనిచ్చియుండెను. అది యాతని కొకమంచి సాధనముగానుండెను.

ఆమనుష్యుఁడు గోవిందరావును అనుమానదృష్టులతోఁజూచుచు “నీతలకు ముంగును వెనుకనుగూడ కన్నులున్నట్లున్నవే! నీవొకపోలీసు

వాఁడవని నాతలంపు!" అనిపలికెను. గోవిందరావు తాను పోలీసు వాఁడనుకానని పలికెను. ఆమనుష్యుఁడు జేబులుకొట్టుటయందు మిగుల నేర్పరియై పోలీసువారిదృష్టియందున్న వాఁడే! ఐనను గోవిందరా విప్పుడు ఛద్మవేషమును ధరించియుండుటచేత అతఁడు గుర్తింపలేకపోయెను. గోవిందరావు ప్రత్యుత్తరమున కతఁడు తృప్తినందియు—మఱల నను మానించుచు—"కవరును అతనిజేబులో నెట్లుపెట్టఁగలను. వానికిని నాకును పరిచయమైనను లేదే" అనియెను.

అప్పటికప్పుడు వీరభద్రుఁడు నూఱుగజములదూరము చనెను. అతఁడొక సందుమలుపు తిరుగుచు—వెనుకకుజూచెను. గోవిందరావు తాను జేబుదొంగతో సంభాషించుచున్నట్లు కనిపెట్టెనేమోయని అను మానించెను. అందువలన నతఁడు త్వరపడుచు "నామాటకు తుదకే మనెదవు?" అని యడిగెను. ఆజేబుదొంగ యింకనుఅనుమానించుచు నే యుండెను.

"నీవు నాకు ఏఁబదిరూపాయలనిచ్చి నీపనిని నీవు గట్టెక్కించు కొందువనుకో! ఆతరువాత నేనెన్నినాళ్లు జైలులో నుండవలెనో—అది యును నీవే చెప్పుము!" అనియెను.

ఆప్రశ్నకేమి సమాధానము చెప్పవలెనో గోవిందరావుకంత శీఘ్రముగతోఁచలేదు. ఆలోచించుట కవకాశమునులేనిస్థితిగా నుండెను. ఇంతలో—జేబుదొంగ తానే యొకదారికివచ్చెను.

జేబు — మంచిదయ్యా! ఈస్వల్పవిషయమునకింతతగ్గనభర్జనములెందుకు? వ్రతముచెడిన ఫలమైన దక్కవలెనుగదా! ఈపని చాలప్రమాద కరమైనది. ఏఁబదిరూపాయలతోకాదు—నూఱురూపాయలిమ్ము. నిమిషములో చేసెదను.

అందులకు గోవిందరావు సమ్మతించుట అసాధ్యముగనుండెను. ఇదివఱకుఁగూడ ఆసంచికి లంచముగా ఏఁబదికన్న నధికమీయఁబడలేదు. అదిగాక అప్పటికి గోవిందరావునద్ద అంతకన్న నధికద్రవ్యమును లేకుం

డెను. ఏదియెట్లున్నను—అట్టిపనులు జఱుగవలయుననిన అట్టిజేబుదొంగల తోడ్పాటులేనిదే జఱుగదు. ఆసంచి తనవశమునసున్నట్లు వీరభద్రుఁ డెఱుఁగఁజాలనంతటినేర్పుతో అతనిజేబులో పెట్టబడవలసియున్నది.

గోవిం—అంత మొత్తమును నేనొసఁగఁజాలను. ఇప్పుడు నావద్దనున్నది ఏఁబదిమాత్రమే!—కాని— మఱియొకమాట!— ఇటుచూడుము!— నాపేరు డెటెక్టివ్ గోవిందరావు! నేను ఒక హత్యాపరాధమున పనిచేయుచున్నాను! చీట్లపేక హత్యలసంగతిని నీవు వార్తాపత్రికలలో చదివియేయుందువు!

జేబుదొంగ ఆశ్చర్యముతోను పరిహాసముతోను అతనినిచూచెను. గోవిందరావు ఛద్మవేషముతో నున్నందున వాడాతని పలుకుల నెంతమాత్రమును విశ్వసింపక పోయెను.

జేబు—ఏమీ! నీవా?—గోవిందరావువా? నేనెంత గోవిందరావు నగుదునో నీవునుఅంతే గోవిందరావు వగుదువు! గోవిందరావు డిటెక్టివును నే నెఱుఁగననుకొంటివా?—అతనితో నేనిదివఱ కొకసారి మాటాడితిని. అతఁడు చాల పెద్దమనుష్యుఁడు! నీవంటి నావంటి తుంటరికాఁడు! నేనెఱుఁగననుకొని సొరకాయకోతలు కోయకు? నీవు! గోవిందరావువు!!—ఆహాహాహా!—ఈ తుంటరిపనిని గోవిందరావెన్నడును తలపెట్టడు!—పో! పో!!—

ఇట్లుపలికి జేబుదొంగ పెద్దగానవ్వి పరిహసింపసాగెను.

ఇక వానివలన ప్రయోజనముగలుగదని గోవిందరావుకుతోఁచెను. వీరభద్రుఁడరిగిన దిశకుచూచెను. అతఁడు సందుమలుపు తిరిగి చాల దూరముపోయినట్లు కనఁబడెను. అతనిని స్వయముగా వెంబడించి తానే యాకార్యమునొనర్ప సంసిద్ధుడై గోవిందరావు వెంబడింపసాగెను. జేబుదొంగ వెనుకనుండి "ఇదిగో! ఒకమాట!" అని కేకవేసెను.

కాని గోవిందరావు నిలువలేదు.



# పండ్రెండవ ప్రకరణము.

## విద్రోహనిలయము.

గోవిందరావు సందుమలుపు వఱకును వేగముగఁజని పరికింపఁగా—వీరభద్రుఁడు పురపాలకకార్యస్థాన సమీపమునందలి మిలిటరీహోటలు (Military Hotel) నందు ప్రవేశించుట కాన్పించెను. ఆహోటలు సర్కారు అధికారము పొందకయే—సారాయిని విక్రయించు విద్రోహనిలయమని గోవిందరావుకు బాగుగ తెలియును. గోవిందరావుకే కాక పోలీసువారి కందఱికిని తెలియును—అట్లయినచో—దానిపై పోలీసువారు తగిన చర్యనుగైకొని ఏల యింకను మూయించివేయక అనుమానించుచున్నారని ప్రశ్న బయలుదేరెను. కాని కొన్ని బలవత్తర కారణములచేత అధికారు లుపేక్షించిరి. దానియజమానియైన త్రివిక్రమసింగు మిక్కిలి బలశాలియగుట యొకకారణము. అధికారముపొంది నడుపబడు సారాదుకాణము లన్నియు కట్టివేయఁబడిన రాత్రివేళలయందు సయితము త్రివిక్రమ భవనమున సారాయి దొరుకునుగావున పట్టణములోని సారాయిత్రాగు రౌడీలయొక్క పలుకుబడి విశేషముగా గల్గుట యింకొకకారణము—తాను సహజముగ సారాయి నుపయోగింతు ననియును అందులకై నిలువచేసికొన వలసివచ్చుననియును తానెవ్వరికైన ఇచ్చినను అది విక్రియముకాక స్నేహసన్మానమనియు త్రివిక్రమసింగు చెప్పుచుండుట మఱియొక కారణము—ఇట్టి ప్రదేశములయందు ద్రోహులను పట్టుకొనుట సులభము కావున దానిపై చర్యగైకొనుటకన్న చూచి చూడనట్లుండుటయే శ్రేయమని పోలీసువారు తలచుట వేఱొక కారణము—ఇవిగాక మఱికొన్ని కారణములున్నను ఉండవచ్చును.

వీరభద్రుఁడు త్రివిక్రిమభవనమునఁ బ్రవేశించుటను డెటెక్టివు చూచెను. అతఁడు కొంతసేపాభవనమున నిలచునని యూహించి నిరూపకుఁడు ఆ సమీపముననేయున్న యొక క్షౌరశాలం బ్రవేశించి

అచట తన రూపమును మఱియొకవిధముసమార్చుకొని యాక్షౌరశాలాధి కారి యగు మంగలికి ఒక రూపాయి బహుమానముగా నిచ్చెను.

తరువాత—నిరూపకుఁడు—ఇతరు లెవ్వరును తన్ను గుర్తింప సాధ్యముగాని వేషముతో—త్రివిక్రిమభవనపు పశ్చాద్ద్వారమునఁ బ్రవేశించెను. ఆ ద్వారమున బలిష్టుఁడగు త్రివిక్రిముఁడే స్వయముగా నిలువఁబడి యుండెను. లోపలఁ బ్రవేశింపఁబోవుచున్న గోవిందరావును త్రివిక్రముఁడు ఆటంకపరచెను.

త్రివి—అందఱును వచ్చునట్లు నీవు సింహద్వారమునుండి యేలరాగూడదు?

గోవిం—అది నిజమే! కాని—సింగుగారూ! నారాక ఇతరులెఱుంగకుండుట నాయుద్దేశము!—ఒకఁడు నన్ను కనిపెట్టుచున్నాఁడు!

త్రివి—అదినల్లగాదు. ఇదియొక ప్రయివేటు హోటలు! (Private Hotel.) సింహద్వారమునసే రావలెను.

గోవిం—నాకు అది తెలియకకాదు. ఇచ్చట ఈ సమయమునకు సరిగానే నొకనితో మాటలాడుటకు నిర్ణయించుకొంటిని! అతనితో కలసి నేను వ్యాపారముచేయుచున్నాను. అతని పేరు వీరభద్రుఁడు! వానికి మఱియొకపేరుకూడ గలదు; కాని దానిని నే నిప్పుడు వెల్లడించుట కిష్టపడను.

త్రివి—వీరభద్రుఁ డెవ్వఁడో—నీ వెవ్వఁడవో—నాకు సంబంధములేదు. ఇందు ప్రవేశింపఁ దలంచెదవేని నీవు—నేను చెప్పినట్లు సింహద్వారముననే వచ్చితీరవలెను. మఱియొక సమాధానమును నేను వినను.

త్రివిక్రముని నిరోధమును చూడగా తనయెత్తు సాగుటలేదని గ్రహించి గోవిందరావు మఱియొక పన్నాగము పన్నెను—అతఁడు తనచేతిని నొసట నొకమాఱును—ఎడమ భుజమున నొకమాఱును—కుడి భుజమున నొకమాఱును కొట్టుకొనెను. అది త్రివిక్రముని ఆంతరంగికులగు

రౌడీలయొక్క రహస్య సౌజ్ఞాచిహ్నము. ఈ విషయమును గోవిందరావిదివఱకే యెఱిఁగియుండెను. అట్లు రహస్యసౌజ్ఞ నెఱిఁగించి "సింగూ! నన్నెవ్వనిగా నెంచితివి? నేను భృగురాముని మిత్రుఁడను!" అని పలికెను. భృగురామునకు ప్రపంచమునందలి రౌడీలందఱును మిత్రులుగా నుందురని గోవిందరావు వూహించుట సులభము. ఈ రహస్య ప్రసంగముతో త్రివిక్రమసింగు వశుఁడై పోయి—గోవిందరావును వదలెను.

ఇరువది సంవత్సరములకు పూర్వము నందామందిరము గొప్ప వర్తకకార్యస్థానమై యుండెను. కాని నేఁడు బహు శిథిలావస్థయందున్నది. ఇదివఱకు రూపాయలు లెక్కింపఁబడుచు అహోరాత్రములు ధనలక్ష్మి మూల్గుచుండిన ప్రదేశములం దిప్పుడు త్రివిక్రముని యధికారమున సారాయిపెగ్గులు లెక్కింపఁబడుచు—త్రాగుబోతుల మూల్గులు వినఁబడుచున్నవి! నిరూపకుఁడొక బల్లదగ్గఱనున్న కుర్చీలోఁ గూర్చుండి ఒకపెగ్గు విస్కీ తెమ్మని కోరెను. అతని కనతిదూరమున ఎదురుగానున్న యొక బల్లవద్ద వీరభద్రుఁ డాతనికిఁ గాన్పించెను. అతఁడిప్పు డెవ్వరికొఱకును ప్రతీక్షింపకపోవుట చూచి వెనుకటి హోటలునందే కాని ఈ హోటలునం దాతఁ డెవ్వరికొఱకును సమావేశమునకై రాలేదని గోవిందరావు గ్రహించెను. వీరభద్రుని బల్లవద్ద మఱియొక యాసనము వట్టిదిగానుండెను. గోవిందరావు ధైర్యముతో నటకరిగి ఆ యాసనమున నుపవిష్టుఁడయ్యెను! అట్లు కూర్చుండుటలో వీరభద్రుని చొక్కాయిజేబునకు దగ్గఱగా నుండునట్లు చూచుకొని మెల్లనిస్వరముగ "ఏమి? విషయము లెట్లున్నవి?" అని యడిగెను.

వీరభద్రుఁడు మెల్లగా నతనివంకకుఁ దిరిగి గోవిందరావును ఆపాదమస్తకమును పరిశీలించిచూచెను. కాని ప్రత్యుత్తరమునొసంగలేదు.

గోవిం—నిన్ను నేనెఱుఁగుదును. నీవు మఱచితివి కాఁబోలును. నీపేరు బలభద్రుఁడు కాదూ? నిన్ను నేను గుంటూరులో చూచితిని.

బలభద్రుఁడు చకితుఁడయ్యెను.

బల—ఓహో! నీకు చాలసంగతులు తెలియునట్లున్నది!

గోవిం—ఔను—నీవు గుంటూరులో "చిత్ర" యను వేశ్య నుంచుకొంటివిగాదూ? అచ్చట నేను నిన్ను చూచితిని—కాని, అదియిప్పటి సంగతియా? రెండేండ్లక్రిందటిమాట! అంతకన్న నెక్కువకూడ కావచ్చును.

బల—(అనుమానముతో) ఏమి? నీవు నన్ను చూచితివా? నిజముగా అచ్చటనేనా?—

గోవిం—ఔను—నిజముగా అచ్చటనే చూచితిని. సందేహమెందుకు? అచ్చటనే! అప్పుడు నిన్ను బలభద్రుఁడని పిలిచెడివారు! ఇప్పుడు నీవు నీపేరుమార్చుకొనినట్లున్నది!

బల—నీవెవఁడవై యుందువో నాకు జ్ఞప్తికిరాకున్నది!

గోవిందరావు తన పరిచయవిషయమున నొకచిత్రకథనుగల్పించి బలభద్రునకు చెప్పఁబోవుచుండగా అంతలో త్రివిక్రముఁ డచటికివచ్చి గోవిందరావును తనతోరమ్మని యాజ్ఞాపించెను. ఆయాజ్ఞ నాతఁడానందముతో శిరసావహించెను. ఏమనఁగా—అప్పటికే అతఁడు తలంచిన కార్యము నిర్వర్తింపఁబడెను. గోవిందరావు కాగితపుసంచి అతిగోప్యముగా బలభద్రుని జేబులోనికి పోయినది! త్రివిక్రముని యాజ్ఞాప్రకారమాతఁడు బయటికి పోవునప్పుడు రహస్యముగ బలభద్రుని చెవిలో—"మిత్రుఁడా నీకొకరహస్యము నెఱిఁగింపవచ్చితిని. ఇప్పుడు నీవెవ్వరికొఱకు పనిచేయుచున్నావో అతఁడు నీకు వ్యతిరిక్తుఁడై యున్నాఁడు! ఆపైకము నీకికముట్టదు. అతనికొఱకు నీవు ప్రతీక్షించుట నిష్ప్రయోజనము!" అనిచెప్పెను.

ఆమాటవిని బలభద్రుఁ డులికిపడి "ఇదిగో! మాట! నీయుద్దేశ్యమేమి?" అని యడిగెను. కాని గోవిందరావు గమనింపకుండ వెడలిపోయెను.

* * * * *

త్రివిక్రముఁడు, గోవిందరావును—ఎట్టియాసనములును లేని యొక గదిలోనికి నడిపించుకొనిపోయెను. ఆగది భూగర్భముననున్నది. బహుశః ఆహారమునం దమితముగా త్రాగి యొడలు తెలియకుండ పడిపోయిన వ్యక్తులను దానిలోని కీడ్తురని డెటెక్టివు ఊహించెను. పై గృహము యొక్క ద్వారములందంతటను బలమైన మనుష్యుఁడు కావలియుండు టనుగూడ గ్రహించి, అప్పుడు తానొకబోనులో చిక్కుపడితినని తెలిసికొనెను. ఇఁకముందు తాను కొన్నికష్టముల నెదుర్కొనవలసియుండు ననికూడ విశ్వసించెను.

గోవిందరావుతోఁగూడ ఆగదిలోఁ బ్రవేశించినంతనే త్రివిక్రముఁడు తలుపును బంధించి దానికానుకొని నిలువఁబడెను. అతనివద్ద నెట్టియాయుధమును నున్నట్లు నిరూపకునకు తోఁపలేదు. అతని కది యవసరమున్నట్లును లేదు. వానిభుజములే ఆకవాటములకన్న విశాలములై యున్నవి. వీఁపుతో తలుపులకానుకొని కాళ్లను నేలకుతన్నిపట్టి—త్రివిక్రముఁడు రౌద్రముగ నిరూపకునిజూచుచు నిట్లుపలికెను.

త్రివి—ఇదిగో!—ఇటు చూడుఁడు! నీజేబులో నొకకాగితపుసంచియున్నది! అదినాకు కావలెను. దానికొఱకై నిన్ను బాధపెట్టెదను!

త్రివిక్రముఁడు మోకాళ్లవఱకును వ్రేలాడు చేతుల నూఁగులాడించుచు వికృతమైన ముఖచిహ్నములతో——నొక హనుమద్వానరము వలె నిరూపకునకుఁ దోఁచెను.

గోవిందరావు—శాంతస్వరముతో—“ఓహో! అదియా?” అని పలుకుచు జేబులోనుండి—యొక కాగితపుసంచిని దీసెను. ఆసంచిలో ఐఁదు నూఱురూపాయల కరెన్సీనోట్లుండెను.

త్రివిక్రముఁడు వికటహాసముచేసి “మన స్నేహితుఁడు దాసకర్ణుఁడుకాఁడూ!” అని పలికి రా! నాదగ్గఱకురా! వచ్చి యాసంచిని నాకందిమ్ము. లేదేని చాల కష్టపడెదవు!” అనెను. గోవిందరావు తన కేమియు అర్థముకానట్లు నటించుచు,

"నీయభిప్రాయము నాకు తెలియలేదు! నీకిది కావలెనా?" అని యడిగెను.

త్రివిక్రముఁడు ఒకయడుగు ముందునకిడి "ఓయి దేవయ్యా! అంతేనోయ్!" అని పరిహసించెను.

గోవిందరావు చిఱునవ్వునవ్వుచు—"ఓస్! ఇంతేకద! సంచి నీకు కావలెనా? ఓ! ఆనందముతో నిచ్చెదను. తీసికొనుము!" అని పలికి సంచి నాతని కందించెను.

త్రివిక్రముఁడు సంచినితీసికొని దానిలో నోట్లు లేక వట్టి సంచిమాత్రమే యగుటచే నాగ్రహించి పటపట పండ్లుకొఱుకుచు "ఏయ్! నాతో పరిహాసము లాడుచున్నావా? అసలునస్తువుఁదాచి వట్టిసంచినా నాకిచ్చెదవు! ఆఁ?" అని గర్జించెను.

గోవిందరావు మఱల సంగతి గ్రహించినట్లు నటించి "ఓహో! రూపాయలు కావలెనా? నీవు వట్టిసంచినే అడిగితివని నేననుకొంటిని. నోట్లు కావలసినచో—వానినిగూడ నిచ్చెదను!" అని పలికి—నోట్ల కట్టను చేతిలోనుంచుకొని వానిని త్రివిక్రమున కందిచ్చు వానివలెనే నటించుచు దగ్గఱకువచ్చి యొక బలమైన ముష్టిప్రహారమును త్రివిక్రముని గడ్డమునకు క్రిందుగాఁ బ్రసాదించెను.

ప్రబలమైన యామష్టిఘాతము హనుమద్వానరతుల్యుఁడగు నానరరూపరాక్షసు నాగ్రహోన్మత్తునిఁ గావించెను. చేతులు సాచుకొని బుసలుకొట్టుచు—ఏటువడ్డ బెబ్బులివలె త్రివిక్రముఁడు గోవిందరావు మీఁదికి వచ్చుచుండఁగా—గోవిందరావు — ఒడుపుఁజూచి—దెబ్బమీఁదదెబ్బగా—మూఁడుదెబ్బలను వానిముక్కుమీఁదను మొగముమీఁదను గడ్డముమీఁదను గుద్దెను. త్రివిక్రమునకు స్మృతితప్పెను. వాని ముక్కునుండియు, నోటినుండియు రక్తముకారుచుండెను. తెల్లవాఱినచో రక్తముపేరుకొని కన్నులుగూడ నల్లఁబడునట్లుండెను. వాని బలమంతయు క్షీణించెను. అట్టిస్థితిలోగూడ ఆనరపశువు—గోవిందరావు

గొంతుక పిసుకనెంచి, చేతులెత్తుకొని పైపైకి వచ్చుచుండెను. గోవిందరావు—తనయెడమకాలితో—వానిఱొమ్మునఁ దన్నెను. ఆతన్నుతో వాఁడు సింహమువలె గర్జించుచు వెనుకకుఁ బడిపోయెను. అంతటితో మిన్నకుండక, గోవిందరావు—ఆమనుష్యవానరమును ఆగదిలో—నొక మూలనుండి యింకొకమూలకు, కాలిబంతినివలె తన్నజొచ్చెను. గోవిందరావు కన్నులుతిఱిగి, రక్తోజ్వలమయ్యెను. కొంచె మించుమించుగా—అతఁడు త్రివిక్రముని ప్రాణములుదీయ సిద్ధముగా నుండెను. ఆతరుణమున వాఁడు గొడ్డువలె నొకపెద్దమూల్గు మూల్గెను. దానిపై నిరూపకుఁడు తన మోకాలితో నెత్తిపై పెద్దపోటుపొడువగా—స్మృహాతప్పి పడిపోయెను. ఈయుద్ధము జఱిగినంతసేపును ఆగఁద్రిగోళమేమియు—త్రివిక్రముని పరిజనమునకు తెలియకపోవుటచేత—ఎవ్వరును గోవిందరావు సాహసమును నిరోధింపవచ్చినవారు కారైరి. అందువలన అతని కెట్టి మేధశ్శక్తిని ఉపయోగింపవలసిన అవసరము లేకపోయెను. త్రివిక్రముని స్మృహ తప్పువఱకును కొట్టినతరువాత, గోవిందరావు అచ్చటినుండి స్వేచ్ఛగా వెడలిపోవుటకుఁగూడ ఆటంకము లేకుండెను. కాని— ఆ విద్రోహనిలయమున నాతని కంత సులభముగ స్వేచ్ఛ లభింపఁగలదా?

ఆకలహము కొంతకాలము జఱుగుటచేత పై యింటిలోనున్న పరిజనమునకు కొంతవఱకైనను వినఁబడియుండవలసియుండెను. స్వల్పముగ వినఁబడినను, త్రివిక్రముఁడే గోవిందరావును బాధపెట్టుచుండెనని తలంచి కొంతసేపటివఱకును ఆనందించుచుండిరి!— తుదకు త్రివిక్రముని మూల్గు వినఁబడినప్పుడు వారికి నిజము తెలిసెను. వారందఱును గుంపులుగుంపులుగా వచ్చి, గోవిందరావుపైఁ బడిరి. కొంద ఱాతని ముందునుండి ప్రతిరోధించుచుండఁగా—వారిలో నొకఁడు వెనుకనుండి వచ్చి యొక బలమైన ఇనుపగొట్టముతో—డిటెక్టివు నెత్తిపైఁగొట్టెను. దానితో నాతనికన్నులుతిరిగి స్మృహతప్పి నేలపైఁ బడిపోయెను!

ఇంతలో—త్రివిక్రమునకు మెలకువవచ్చెను. భయంకరములగు కన్నులతో—ముడుచుచు తెఱచుచునున్న చేతులతో నాతఁడు లేచి, తూలుచు డెటెక్టివుకొఱకు వెదుకసాగెను. కొంతసేపటికాతఁడు స్మృహ తప్పియున్న గోవిందరావుపై పర్వతమువలెఁబడి రెండుచేతులతో నాతని కంఠముంబట్టి పిసికివేయ నుద్యుక్తుఁడయ్యెను.

ఇంతలో—మెల్లఁగా—ద్వారముం దెఱచుకొని, యొక ముసుగు మనుష్యుఁడు లోపలఁ బ్రవేశించెను.

ఆమనుష్యుఁడు— "వద్దు—చంపవద్దు— ఇచటగాదు" అని పలికెను.

త్రివిక్రముఁ డామాటను వినలేదు. ఆస్థితిలో నాతనిచెవివద్ద పెద్ద ధ్వనితో—తుపాకిపేలినను వినఁబడియుండదు. వాని దృష్టియంతయు, తన శత్రువగు ఆనిరూపకుని బలిగొనుటయందే కేంద్రీభవించి యుండెను. ముసుగువాఁడా స్థితినిగ్రహించి, యొక పొడవైన బల్లెముతో—త్రివిక్రముని వీపుమీఁద పొడిచెను. దానిబాధవలన, త్రివిక్రముఁడు గర్జించెను. ముసుగువాఁడు పరిజనులం జూచి— "ఆమనుష్యవానరమును లాగివేయుఁడు; ఇక్కడ వీఁడు వానిని హత్యచేయుట నాకిష్టము లేదు, ఆత్రివిక్రమున కొక బుడ్డెడు సారాయినిచ్చి సుఖముగా పరుండఁ జేయుఁడు. నేను మఱలవచ్చెదను". అని యాజ్ఞాపించెను.



## పదమూడవ ప్రకరణము.

### దేవదారు పెట్టెలు.

జేబులుకొట్టు దొంగతనమునం దారితేఱిన దొంగయగు సేతురాముఁడు కాగితపుసంచిని వీరభద్రుని జేబునందిడు కార్యమున గోవిందరావు కోరికను నిరాకరించిన తరువాత—డిటెక్టివు వీరభద్రు నెట్లు వెంటాడెనో తానుగూడ నట్లే డెటెక్టివును వెంటాడెను. గోవిందరావు

త్రివిక్రమభవనమునం బ్రవేశించుటనుచూచి సేతురాముఁడు, ఆ భవనపు ప్రక్కయింటఁ గూర్చుండి త్రివిక్రమభవన సింహద్వారమున లోనికేఁగువారిని—బయటికి వచ్చువారిని కనిపెట్టి చూచుచుండెను. సంచిని, వీరభద్రుని జేబునం దిడుట కాతఁడేల వాంఛించెనో—ఆసంచియం దేమిగలదో—దానిని జేబునందిడుటకే ఏఁబదిరూపాయల నిచ్చెదనని నపుడు ఆసంచిలో సంతకస్న యెన్నిరెట్ల విలువగల నోట్లు గలవో—దానిని దొంగిలించిన నెంత లాభించునో యను ఆలోచనములతో, సేతురాముఁ డందే కూర్చుండెను.

సేతురాముఁడు, మన కథతో నిప్పుడే సంబంధముకలవాఁడు గాఁడు!—భైరవహత్యాసందర్భమున పోలీసువారల నూమటకై—హంతకుఁడగు ప్రతాపునికడనుండి వీరభద్రునికడకు సందేశముగొని చనినవాఁడీ సేతురాముఁడే! అందులకై ప్రతాపుఁడు, సేతురామునిద్వారా—వీరభద్రునకు ఐఁదురూపాయలనుపంపి మిగతసొమ్ముకొఱకై - వీరభద్రుఁడు మొదట వెళ్లినహోటలును నియామకస్థలముగా నేర్పరచెను. కాని ప్రతాపు నింతవఱకు వీరభద్రుఁడు చూచియుండలేదు. గోవిందరావు ప్రవర్తనము నంతను—త్రివిక్రముని చెవినూది యింతటి గంద్రగోళమును చేయించినవాఁడుకూఁడ సేతురాముఁడే!

త్రివిక్రముఁడు—మేడమీఁదిగదిలో నొక శయ్యపై—పూర్తిగా సారాయి త్రావి గుఱక వెట్టుచు బకాసురునివలెపడి నిద్రబోవుచుండెను.

డెటెక్టివ్—గోవిందరావు నిర్మించిన వ్యూహమింతవఱకును సక్రమముగనే సాగెను. ఇంతవఱకును అతఁడెవ్వఁడో యొక తమ శత్రువుఁ డని మాత్రమే త్రివిక్రమప్రముఖులు తలంపఁగలిగిరిగాని—ఆ వ్యక్తియే జగద్విఖ్యాతుఁడగు రాజమహేంద్రవర పరిశోధకుఁడగు గోవిందరావు నాయుఁడని మాత్ర మెవ్వరును గ్రహింపఁజాలకపోయిరి!

సాజ్ఞారహితుఁడై పడియుండిన గోవిందరావు మొగమునంగల కృత్రిమవేషము—కృత్రిమవర్ణము చెరిగిపోయినందున—డెటెక్టివు

గొుక్క నిజస్వరూపము బహిర్గతమయ్యెను! అతనిఁజూచిన వెంటనే—త్రివిక్రముని పరివారజనము తలకొకమాటగా నిందింపసాగిరి!

"ఈ దుర్మార్గుని గోవిందశాస్త్రిగా నెవ్వరమును గ్రహింపఁజాలక పోయితిమి! వీనిని మోటారుబండిక్రింద బరుంతఁ బెట్టి చంపుఁడు!" అని గొుకఁడు పలికెను.

* * * * *

వీరభద్రుని జేబులోని కాగితపుసంచి నెట్టులైన దొంగిలింపఁ దలఁచిన సేతురాముఁడు పొంచువేసియుండెను. అతఁడు వీరభద్రుని జూసి మొదట బీడీకాల్చుటకు అగ్గిపెట్టెగలదా యని యడిగెను. ఇచ్చిన పిదప బీడీనికాల్చుచు సంచి తానునుకొనినజేబునందే యుండుటను చూచి సంగ్రహించుటకు సమయము నాలోచించుచుండెను! ఇంతలో త్రివిక్రమ భవనమునుండి బలునైన సామానులతోనిండిన యొక మోటార్‌లారీ బయలుదేరి పోవుచుండెను. ఆ తరుణము సేతురామునకు చక్కగా ననుకూలించెను. అది తనకు సరిగా కనఁబడుటకై తొంగిచూచినట్లు నటించుచు—సేతురాముఁడు వీరభద్రుని భుజముమీఁదికి వంగి చూచు సమయమున అతని కనుమానముగల్గకుండ జేబులోని కాగితపుసంచి నపహరించెను.

ఈకార్యము నతఁడెంతో చాకచక్యముననే నిర్వహించెను. ఆయుత్తరక్షణముననే మాఁటుమాటాడకుండ అతఁడాప్రదేశమును వదలి యుండవలసినదే! కాని ఇంతలో—వెనుకనుండి సేతురాముని చేతిని గట్టిగఁ బట్టుకొని యెవ్వరో నిలిపివేసిరి!

"సేతురా! దొరికితి! నిన్ను చాలసేపటినుండి కనిపెట్టుచుంటిని నిలువుము!" అని యెవ్వరో పలికి యావ్యక్తియే వీరభద్రునివంకకు దిరిగిచూచి,

"అయ్యా! మీవస్తువేదైన పోయినదా?" అని యడిగెను.

ఇంతకుముందే పోలీసువారికి తనప్రవర్తనము అనుమానాస్పదముగానున్న కారణమున వీరభద్రుఁడు తానప్పుడు పోలీసుస్టేషనుకు ఫిర్యాదిగాఁగాని, ముద్దాయిగాఁగాని పోవనభిలషించుటలేదు. అందుచే నతఁడు—ఇన్స్పెక్టరుసింగును గుర్తించి జేబుచూచుకొనకుండఁగనే—"ఏమియును పోలేదండి!" అని వెంటనే ప్రత్యుత్తరమిచ్చెను. ఇంతే కాక—అతని ముఖచిహ్నములను—ఏదేని యొక వస్తువు తనది పోయి నట్లాతఁ డెఱుంగఁడనియే తోఁపింపఁజేసెను. ఐనను చౌర్యమును ప్రత్యక్షముగఁ జూచి—దొంగయగు సేతురాముని పట్టుకొనియున్న సింగుకు వీరభద్రునిమాట యత్యాశ్చర్యముం గలిగించెను.

సింగు—"నిజముగా నీదేదియునుపోలేదా?" అని మఱలతీవ్రముగ ప్రశ్నించెను.

వీరభద్రుఁడు తనజేబు నొకసారిపరీక్షించిచూచికొని "లేదండి! నాదేదియును పోలేదండి! క్షమింపుఁడు. నాకు తొందఱపనియున్నది. పోవలెను!" అనిపలికి—తనదారిని తాను నడువసాగెను. సింగు పోవుచున్న వీరభద్రుని నిలిపి—"ఇదిగో! ఒక్కక్షణమాగుము! నీవు—నీ వస్తువు పోలేదని చెప్పినను సరియే! వీనిపై నేరారోపణముచేసినను మంచిదే! చేయకున్నను మంచిదే! కాని నాతోపాటు—నీవు పోలీసుస్టేషను వఱకును రాకతప్పదు. వీరభద్రుఁడు— భుజము లెగురవేసి, యభ్యంతరము చెప్పకుండ సింగును వెంబడించెను—పోలీసుస్టేషనునందు సేతురామునిపై విచారణ జఱుగును. ఒక కాగితపుసంచివిషయమైన చోరనేరమే యిప్పు డారోపింపఁబడనున్నది. నిజములో ఆసంచియందేమిగలదో సేతురాముఁ డెఱుంగఁడు. అదిదొంగిలించిన వస్తువుకాదనియు, తనస్వంతమేయనియును—సేతురాముఁడు తానెట్లు స్థిరపఱచుకొనుట సాధ్యమగునో—యిప్పటికింకను యోచించుకొనలేదు. ఐనను—సేతురాముఁ డారితేఱిన జేబుదొంగ— అందుచేత అతిస్థైర్యమున స్టేషనుకు నడిచెను.

ఇన్‌స్పెక్టరుసింగు—కాగితపుసంచిని తెఱచిచూచెను. వానిలో కొన్ని కర్రెన్సీనోట్లుండెను—ఆకర్రెన్సీనోట్లు ప్రతాపునిసంఘపు దొంగలచే నిర్మింపబడియుండెను. వానిని చాలవఱకు పోలీసువారు పట్టుకొనిరి! కొన్నిటిని డెటెక్టివ్ గోవిందరావునాయుడు తనస్వాధీనమునం దుంచుకొని దొంగలను పట్టుకొనుటకై—ఈవిధముగా నుపయోగించు చుండెను. ఆనోట్లు నెంబరులు పోలీసువారి రికార్డులోనుండెను. ఆనోట్లు నీకెట్లువచ్చెనని సింగు ప్రశ్నింపఁగా—సేతురాముఁడు "అయ్యా! నేను నిజముచెప్పుచున్నాను. ఈసంచి నాదికాదు. ఇందేమికలదోగూడ నే నెఱుఁగను. ఈదినమున ఉదయమున నొకయపరిచిత పురుషుఁడు నాయద్దకువచ్చి దీని నీతనిజేబునందుంచినచో—కొంతలంచమునిత్తుననెను. కాని నేనుసమ్మతింపలేదు. తరువాత ఆపురుషుఁడే దీని నీతనిజేబులో నుంచెను. ఇందేమిగలదోయని ఆశపడి నేను దీని నిప్పుడు దొంగిలించితిని—ఇదిమాత్రము నానేరము!" అని నిజమును వెల్లడించెను.

ఆమాటవిని వీరభద్రుఁ డదరిపోయెను. ఇంకను తనజేబులో నేమిగలదోయని వేవేగ పరీక్షించుకొనెను. తన్నుఁదాను పరీక్షించుకొనుటయేకాక సింగునుగూడ పరీక్షించుకొన ననుమతించెను. ఆసంచి తనదగ్గఱనున్నసంగతియే వీరభద్రుఁడెఱుంగడని సింగు నమ్మినందున ఆతనిఁ బరీక్షింపలేదు. సేతురామునిగూర్చి సింగు ప్రశ్నించెను.

సింగు—ఈసంచిని అతనిజేబులోనుంచుటకై నీకు లంచమునిచ్చెదననిన యాతని రూపమెట్లుండెనో కొంచెము యోచించి చెప్పఁగలవా?

సేతురాముఁడు తనకు జ్ఞప్తియున్నంతవఱకు వర్ణించిచెప్పెను. ఆవర్ణనము నాలకించి అది గోవిందరావునాయని ఛద్మవేషమని గుర్తించి సింగు మఱింత తొందఱపడెను.

సింగు—అతఁడిప్పు డెచ్చటనున్నాఁడు?

సేతు—త్రివిక్రమభవనముఁ బ్రవేశించినాఁడు. ప్రవేశించుటమాత్రమే చూచితిని! తిరిగివచ్చుటను చూడలేదు.

తరువాత సింగు వారిరువురి చిరునామాలను గైకొని తిరిగి తాను పిలచినపుడు రావలయునని యాజ్ఞాపించి తాను త్రివిక్రమ భవనమున కరిగెను. ప్రతాపుఁడే తన జేబులో నోట్లసంచినుంప నేర్పాటుచేసెననియు అతనిని కలసికొనవలెననియు తలంచి—వీరభద్రుఁడును త్రివిక్రమ భవనమున కరిగెను. అచ్చట నొక విశాలమైన గదిలో అనేకులు సురాపానమునఁ బ్రవృత్తులై యుండిరి. సింగు—ఒక "బార్ బాయ్ (Bar boy)ను జూచి—"సేతురాముఁడు వర్ణించి చెప్పిన తెలుంగున గోవిందరాయని ఛద్మాకృతిని వివరించి చెప్పి "అట్టిమనుష్యుఁడచ్చటికివచ్చెనా?" యని యడిగెను.

బార్ బాయ్—అటునిటుఁజూచి తలగోకుకొనుచు,

"అట్టిపురుషుఁడు కొంతకాలమునకు పూర్వమిచ్చట నుండెను. కాని ఇప్పుడు లేఁడు! వెడలిపోయియుండును!" అని జవాబుచెప్పెను.

వీరభద్రుఁడు దీనిని విశ్వసింపలేదు. అతఁడు సాహసముగల మనుష్యుఁడు. అందుచేత—ప్రతాపుఁడాభవనముననేయుండునని నమ్మి క్రిందిగదులం బరీక్షింప నరిగెను. రహస్యాలోచనముల కుపయోగింపఁబడు నొక పాతాళగృహమును—వీరభద్రుఁడెఱుంగును. అప్పుడు—వీరభద్రునికడ బెదరించి రహస్యసంగ్రహము చేయుటకైనను ఎట్టి యాయుధమును లేదు. ఐనను దొంగనోట్లను తనకు ప్రతిఫలముగా తానెఱుఁగకుండ నిచ్చి తన్ని బ్బందిపాలుచేయఁజూచిన మోసగాఁడగు ప్రతాపుని గనుగొనుటే ముఖ్యకార్యముగానెంచి యాతఁడు వెదుక సాగెను.

ఒకగదిని పరిశీలించెను—కాని యందెవ్వరునులేరు. ఐనను నేల మీఁదమాత్రము కొంతరక్తము కాన్పించెను. అచ్చట నొకటిరెండు దేవదారు పెట్టెలుండెను. వానిని సందేహించి—వీరభద్రుఁ డొకదాని మూఁతనెత్తిచూచెను. అందేమియు కనఁబడలేదుగాని, రెండవదాని మూఁతఁ దెఱచునప్పటి కాతఁ డాశ్చర్యముతో త్రుళ్లిపడెను. అందొక

స్మృతిలేని పురుషుఁడు క్రుక్కఁబడియుండెను. అతఁడు మృతినంది యుండెనేమో యని వీరభద్రుఁడు తొలుత సందేహించెనుగాని తుదకా పురుషుఁడు బలువైన స్వల్పనిశ్వాసమును వదలుచుండెనని గ్రహించెను. అతని కరపాదములు బంధింపఁబడియున్నవి. టోపీ—ఆపెట్టెలోనే యొక ప్రక్కన క్రుక్కఁబడియుండెను. అతనికరపాదములను బంధించిన త్రాటిని వీరభద్రుఁడు మెల్లగా విప్పివేసెను.

ఇంతలో—నెవ్వరో యాగదిలోఁ బ్రవేశించి—"నిలువుము! పారిపోకుము!" అని కేకవేయుచు వీరభద్రుని వక్షమునకుసూటిగా పిస్టలునుపట్టియుంచి సాంకేతికమగు ఈలనూదినంతనే మఱియిద్దఱుమనుష్యులచటికి పరుగెత్తుకొనివచ్చిరి. మొదఁటివాఁడు—తరువాత వచ్చిన వారితోఁ—తాను చూచిన పరిస్థితులను వర్ణించిచెప్పి—"వీఁడు డెటెక్టివ్ గోవిందరాయుని బంధనములను విడిపింపవచ్చినాఁడు త్రాళ్లనిది వఱకేవిప్పినాఁడు! దుర్మార్గుఁడు!" అని పలికెను.

ఆయిద్దఱిలో నొకఁడు వీరభద్రుని వశపరచుకొనెను. రెండవ వాఁడు వీరభద్రునిఁజూచి—"ఇంకెవ్వరైన నీతో వచ్చి బయటనున్నారేమో మేము చూచివచ్చువఱకును నీవు క్రుక్కినపేనువలె నిచట పడి యుండవలసినదే!" అని చెప్పెను.

తుపాకిపట్టుకొనిన మొదఁటివాఁడు "చేతులు పైకెత్తుము! నీవద్ద ఆయుధ మేదైనఁ గలదేమో పరీక్షింపవలెను!" అనెను.

వీరభద్రుఁడు తదాజ్ఞప్రకారము వర్తింపఁగా—వాఁడు వెదకి చూచెను. వీరభద్రుని మొలయందొక చిన్న లాంటీమాత్రము దొరికెను. దానితో వాఁడాగ్రహపూరితుఁడై—"బద్మాష్! ఎవని చావఁ గొట్టఁదలఁచి దీనిని తెచ్చితివిరా?" అని పలుకుచు దానితోనే వీరభద్రునితలపై నొకపెట్టు బెట్టెను. వీరభద్రుఁడు "అబ్బా"యని యఱచుచు—స్మృతితప్పి నేలపైఁబడెను. తరువాత వాఁడు తనతుపాకిని భద్రపఱచుకొని వీరభద్రుని జేబులు వెదుకఁజొచ్చెను. వీరభద్రుఁడు

దాచుకొనిన స్వల్పధనమును చేతిగడియారమును వాడపహరించి గోవింద రావు బంధింపఁబడిన దేవదారుపెట్టె ప్రక్కనేయున్న రెండవపెట్టెలో వీరభద్రునుంచి మూతవేసెను.

ఇంతలో బయటికరిగిన వాఁడొకఁడువచ్చి—"వానిని రెండవ పెట్టెలో నుంచితివా! మంచిది. కారుప్రయాణమునకు వీనినిగూడ సిద్ధపఱుపవలసియుండు ననుకొందును!" అనెను.

మొద—అవును—వీనివెంట బహుశః నీవే వెళ్లవలసియుండునేమో!—

రెండవవాఁడొక త్రాటినిదెచ్చి వీరభద్రుని కదులకుండ బంధించి మరల పెట్టెలోఁ బెట్టెను. తరువాత—వీరభద్రునిచే విప్పఁబడిన గోవిందరాయని త్రాళ్లనుగూడ గట్టిగబిగించెను. పిదప వారిరువురును తత్ప్రదేశమును వదలి చనిరి.

* * * * *

పోలీసుస్టేషనునుండి వీరభద్రుఁడు త్రివిక్రమ భవనమునకు వచ్చియందు బంధింపఁబడిన విషయమంతయు—ఇన్‌స్పెక్టరుసింగుచే పంపఁబడిన గూఢచారి యగు పోలీసుభటుఁడు కనిపెట్టి—వెంటనే సింగు కెఱిఁగించెను.

గోవిందరావుతోఁ గలసి—మొదటినుండియు—ప్రతాపుని పరిజనమును—వారు దాచియుంచిన ధననిక్షేపమును కనిపెట్ట యత్నించుచుండినవాఁడు ఇన్‌స్పెక్టరుసింగు! కావున అతఁడీవిషయమునందు సర్వ రహస్యములను బయటికీడ్వ స్థిరసంకల్పుఁడై యుండెను. అతఁడు వెంటనే త్రివిక్రమ భవనమునకు బయలుదేరెను.

* * * * *

ఇంతలో—రెండు దేవదారుపెట్టెలతో నొక పెద్ద మోటారు లారీ (Lorry) త్రివిక్రమ భవనమునుండి బయలుదేరెను. అవి దొడ్డి త్రోవనుండి బయలుదేరెను. దీనినంతను సేతురాముఁడును, సింగునుకూడ

కనిపెట్టుచునే యుండిరి. సేతురాముఁడు త్రివిక్రమభవనపు బార్ బాయ్ నొకని కలసికొని—

"ఏమైన క్రొత్తసామానులను తెచ్చినారా?" అని యడిగెను.

బార్ బాయ్—ననుగుచు—"లేదు అదియొక పొరపాటు— అసలు ఆపెట్టెలు మావికావు—తప్పుచిరునామావలన ఇచ్చటికిఁ దీసికొనివచ్చినారు. దానిని గ్రహించి మఱల సరియైన చిరునామాకు తీసికొని పోవుచున్నారు! ఇది సంగతి!" అని పలికెను.

ఆ సంభాషణమునంతను సింగు వినుచునేయుండెను.

ఇంతలో—సమీపమునందలి టెలిఫోనునందు దత్తు—ఇన్స్పెక్టరుసింగును పిలిచెను. దత్తు ఇట్లు చెప్పెను.

"డెటెక్టివుబాబుగారి విషయమున నాకు భయముగా నున్నది. ఐఁదుగంటలకు వత్తుననిచెప్పి వెళ్లిరి. తాను రాలేకపోయినచో ఫోనులో తన్ను పిలువమనిరి. వారు రానూలేదు ఫోనులో పిలిచిన పలుకనూలేదు."

దత్తు చెప్పినదానిని వినినపిదప—మోటారులారీలోని దేవదారుపెట్టెలోనున్నది గోవిందరావేమోయని; సింగుకు అనుమానము గలిగెను. వెంటనే—ఒక మోటారుకారుతో తన్ను త్రివిక్రమ భవనముకడ కలసికొనుమని, దత్తుకు టెలీఫోనులో నాజ్ఞాపించెను. ఐఁదుగంటలకు వచ్చెదనని చెప్పివెళ్ళిన గోవిందరావురాకపోవుటకు ఏదియో ప్రత్యేక ప్రమాదహేతువుండకపోదని సింగు గ్రహించెను.

అనతికాలమునకే—దత్తు—స్టేషనులోని యొక సార్జెంటుతోను ముగ్గురు భటులతోను, కారుతోను సింగువద్దకువచ్చెను. అకస్మాత్తుగా వారందఱును, త్రివిక్రమభవన సురాపానమందిరమునఁ బ్రవేసించిరి. సింగు గంభీరస్వరమున,

"ఏయ్! ఒక్కఁడైనను ఈయింటి పొలిమేరలను దాటవద్దు. త్రివిక్రముఁ డెక్కఁడ నున్నాఁడో చెప్పుఁడు" అని పలికెను.

"బార్ బాయిస్"లో నొకఁడు సింగును ఎదిరింపఁబోయెను. కాని సింగు సాధ్యపడలేదు. అతఁడా బార్ బాయిను, గోడకు అణఁచి పెట్టి—"ఎవ్వఁడైనను సరే! వెంటనే త్రివిక్రము నిచటికి తేవలెను. పెంకెతనమువలన లాభము లేదు" అని పలికెను. ఒకఁడు భయముతో మేడమీఁద నున్నాఁడని సౌజ్ఞచేసెను. సింగు వెంటనే మేడమీఁదికిఁ బోయెను.

త్రివిక్రముఁడు విస్కీ త్రాగిత్రాగి మైకమున నొక శయ్యపైఁ బడియుండెను. అతని మొగము పాలిపోయియుండెను. ప్రక్కగా నొక ఖాళీయైన విస్కీబుడ్డి దొరలుచుండెను. సింగు వానినిఁజూచి డెక్టెక్ట్ వు నేమి చేసితివని అడిగెను. కాని త్రివిక్రముఁడు తనకేమియుఁ దెలియదని చెప్పెను.

వానిమాటలను సింగు నమ్మలేదు. క్రిందిగదులలో నొకదాని యందు నెత్తురుమడుగు కలదని యొకభటుఁడు చెప్పెను. సింగు కోపముతో—త్రివిక్రమునిఁ జూచి—

"ఇదిగో! త్రివిక్రమా! నీవు సరిగా దారికి రానిచో కష్టముల పాలయ్యెదవు. నీవు దెబ్బతిని పడియున్నావు! ఇంత బలముగా నిన్ను కొట్టిపడవేయఁగల శక్తిగలవాఁడొక్క గోవిందరావుతప్ప మఱియొకరు లేరని నేనెఱుఁగుదును. నిజము చెప్పుము" అనియెను.

త్రివిక్రముఁడు తన్ను గోవిందరావు కొట్టలేదనియు— మేడమెట్లమీఁదనుండి క్రిందఁబడితిననియుఁజెప్పెను. అదియునుగాక ఒకమోటారు ప్రమాదమువలన తనకు చాల శ్రమగల్గియున్నదనియు చెప్పెను.

ఇన్స్పెక్టరొక వికటహాసము గావించెను.

ఇక్ స్ప — ఇదిగో ! చూడు త్రివిక్రమా ! ఇన్ని యేండ్లువచ్చినవిగాని, నీకు బుద్ధిమాత్రము రాలేదు. ఈహోటలును నేను బంధింపఁ జేయుచున్నాను. మేము నిమిషములో ఆపని చేయఁగలము. నీవు జూదమాడుచున్నావని నేరస్థాపన చేయఁబడినది. అందు లకై నిన్నీక్షణమే బంధింపఁగలము. క్రిందిగదులలో నలువది మంది భటులు సిద్ధముగా నున్నారు. నీపరిజనులలో నొకని వద్ద నున్న తుపాకి—ఉపయోగింపఁబడినట్లు కనిపెట్టినాము. ఖూనీ అనుమానముపైఁగూడ ఛార్జిచేయఁగలము. ఒక్క— గోవిందరావు కొఱకు మాత్రమే మేము వెదకుటలేదు. వీర భద్రుఁనను మఱియొకనికొఱకుఁగూడ వెదకుచున్నాము. వాఁడీ యింట ప్రవేశించి మఱల బయటికిఁ బోలేదు. ఎక్కడదాచితివి వానిని ? హత్యయే జఱిగియుండెనా—అందు నీవొక ముద్దా యివి ! జాగ్రత్త !—

త్రివిక్రముఁడు భయపడెను!

త్రివి—వీరభద్రుని విషయము నాకేమి తెలియును ? నేను వాని సంగ తియే వినలేదు— అదిగాక కొన్నిగంటలనుండి నేనిచట గాఢ నిద్రలో నున్నాను. నాకేమియు దెలియదు !

ఇక్ స్ప—మంచిది—కాని నిన్ను కొట్టిపడవేసినవాని మాటయేమి ? అతఁడెక్కడ ?

త్రివి—నాకేమియుఁ దెలియదు. వాఁడు నన్నుకొట్టినాడని మా కుఱ్ఱ వాండ్రు నాకు చెప్పిరి. నేనేమియు నెఱుఁగను. అతని కేమైన జఱిగియుండినను నేనుమాత్రమేమియు చేయలేదు !

ఇక్ స్ప—అట్లయిన అతని నేమైన చేసినవారెవ్వరై యుందురు? త్వరగా చెప్పుము. ఏదోయొకటి నీవు తేల్చివేయకపోయితివా—ఏమి సంభవించునో—నీకే తెలియును. నేను చెప్పనక్కఱలేదు.

త్రివిక్రముఁడు సింగు తన్ను బంధింపనున్నాఁడని నమ్మెను.

త్రివి—మాకుఱ్ఱవాండ్రు—ఏమిచేసిరో!—మొత్తముమీఁద అతనిని కొంత బాధపెట్టిరి. కాని నీకు పుణ్యముండును బాబూ—ఇట్లు నేను మీతో నంటినని వాండ్రకు తెలియనీయవద్దు; నన్ను చంపివేతురు.

వెంటనే—సింగు క్రిందికిదిగి, త్రివిక్రమభవన పరిజనముం జూచి, బిగ్గఱగా—"మంచిది—ఇదిగో మీరందఱును ఇటు వినుఁడు! డెటెక్టివ్ గోవిందరావును, వీరభద్రుని మీరేమిచేసితిరి? ఎచ్చటనుంచితిరి?" అని యడిగెను.

ఎచ్చటనుండియు ప్రత్యుత్తరము రాలేదు.

సింగున కాగ్రహమువచ్చి—తానిదివఱ కెఱిఁగియున్న ప్రాఁత నేరగాని నొకని గొంతుపట్టుకొని, "నీవు—ఇటురా—వాండ్రిద్దఱ నేమిచేసితివి? నీకిందు సంబంధము గలదు—అబద్ధమాడకు. నిజము చెప్పి నీక్షేమమును నీవు చూచుకొందువా—హత్యాపరాధము మోపబడి జైలుకు వెళ్ళెదవా?" అని యడిగెను.

వాఁడు—సింగుమాట కాగ్రహపడి, "మీరు నాపై హత్యాద్రోహమును మోపఁజాలరు!" అనియెను. సింగు క్రోధముతో మండిపోవుచుండెను. నిజము తెలియువఱకును ఎంతపనిచేయుటకైన నాతఁడు వెనుదీయుటలేదు. అతఁడు తనభటులను జూచి—"హత్యాపరాధమునకై వీనిచేతులకు సంకెలలువేయుఁడు" అని శాసించెను. తరువాత—ఇదివఱకు తనపై విజృంభించిన బార్‌బాయ్‌ను జూచి—"ఊఁ—నీవు—నీమాటయేమి? నీవును దీనిలో జేరితివి—చెప్పుము" అనియెను.

సింగు క్రోధమున కందఱును అదరిపోవుచుండిరి. బార్‌బాయ్ దారికివచ్చెను. వాఁడు సింగుతో—"అయ్యా! ఆదేవదారుపెట్టెలలో నేమియున్నవో నేనెఱుఁగను కాని—వానితో నొక మోటారు లారీ మాత్రము వెళ్ళినది!" అనెను.

సిం—దేవదారుపెట్టె లేమిటి ?

బార్—ఈయింటినుండి తీసికొనిపోఁబడినవి.

సిం—అది యేదారిని వెళ్ళినది ?

బార్—గొల్లపూడి రోడ్డున—

ఆమాట వినుటతోడనే సింగు దత్తువంకఁ జూచెను. అతని యభిప్రాయము నెఱింగి దత్తు కారులో నెక్కి స్టీరింగు పట్టుకొనెను. సింగు ఒకగంతు కారులోనికి వేసెను.

దత్తుకారును గొల్లపూడి రోడ్డున వాయువేగముతో నడుపసాగెను.



## పదునాల్గవ ప్రకరణము.

### మృత్యుశకటము.

ఇన్స్పెక్టరుసింగు—సర్వత్రి పోలీసు ప్రపంచకమున సుపరిచితుఁడగుటచేత దత్తు పోలీసు నిరోధములనుగాని, వారి సూచనలనుగాని, కుడి యెడమ గమనింపులనుగాని, లక్ష్యముచేయకుండ అతిరయమున—కారును నడుపుచుండెను. కన్యకాలయ సమీపపు కొండదరిని ఒకమాఱును—గొల్లపూడి ఊరిచివర నొకమాఱును కారును నిలిపి—లారీ (Lorry) యామార్గమున వచ్చెనా లేదా యని విచారించిరి. కాని ఎవ్వరును వారికి దానిజాడ నెఱిగించువారు లేకపోయిరి.

దత్తు మొగమున భయచిహ్నములు గాన్పించెను. ఏదియో కీడు జఱిగినదని అతని యంతరాత్మ బోధించుచుండెను.

ఇన్స్పెక్టరుసింగు—ఎదురుగా విమర్శించి చూచుచు వినుగుకొనుచుండెను. అంధకారము దిశల నాక్రమించెను. ఇంతవఱకు లారీ

సంగతి వారి కెఱిఁగించినవారొక్కరును లేరైరి. ఆమోటారులారీ యందే వారి యూహప్రకారము నిజముగా గోవిందరావుండినయెడల—అది తమకు కనబడకపోయినను—కనబడినను తాము వానిని కలసికొనుట కాలస్యమైనను గోవిందరావుకు ప్రాణాపాయము తప్పదని వారు గ్రహించిరి!

గమ్యస్థానము నెఱుఁగుండెడ దత్తు—వెఱ్ఱివానివలె కారును నడుపుచుండెను. మార్గమునకు రెండుప్రక్కలను అనేకములగు దట్టమైన పొదలును—విశాల శాఖాన్వితములగు పెనుమ్రాకులును గాన్పించుచుండెను. మెల్లనుసూచించు ముల్లు—ఏఁబదియైదునొద్ద సూగుచుండెను.

దినకాంతి క్షీణించిపోయెను. దూరమున నేదియో వస్తువు దృగ్గోచరమగుచుండెను. అది మోటారుబండియో జట్కాబండియో కూడ ప్రారంభమున సరిగ నిర్ణయించుట కసాధ్యమయ్యెను. చాలసేపు నిశ్శబ్దముగనుండిన పిదప ఇప్పటికి దత్తు—ఒక్కమాటాడెను.

“అదియే కావచ్చును!”

ఇన్‌స్పెక్టరుసింగు తానును అట్లే తలంచితినని చెప్పెను. దత్తు కారు వేగమును హెచ్చించెను. ఇప్పుడు ముల్లు డెబ్బదివద్ద నూగుచున్నది.

లారీ యొకచోట నిలువఁబడియుండుటచేత దత్తు చాల సమీపమునకు వచ్చెను. సింగు—భవిష్యత్కార్యవిధానమున దత్తునకెట్టి సూచనయు నొసంగలేదు. అది యనవసరమని ఇన్‌స్పెక్టరెఱుంగును. మోటారులారీని సమీపించిన తరువాత వారిరువురును పెద్ద నిట్టూర్పు బుచ్చిరి. దానిచుట్టును తెరలువేయబడియుండెను—లోపల నెందఱు జనులు గలరో యనిగాని, అందు దేవదారుపెట్టెలు కలవో లేవో యని గాని, పరిశీలించుటకే వీలుగలుగకుండెను. కాని అది యిదివఱకు వర్ణించినవిధమగు లారీయనుటకు మాత్రము సందేహములేదు.

దత్తు తన కారు వేగమును తగ్గించెను. సింగు—కారుకిటికీనుండి రెండవకారువంకకుఁ జూచి దానిని నిలుపుమని డ్రైవరుకు సౌజ్ఞచేసెను. కాని యా డ్రైవరు దానిని లక్ష్యపెట్టలేదు.

సింగు—దత్తూ! వాఁడు పెంకెముండకొడుకుగానున్నాఁడు. అపునట్లు లేదు. మనము వెన్నాడుచున్న ద్రోహులింతే యుందురు; సందేహములేదు.

దత్తు—అట్లయిన మనము త్వరపడవచ్చునా?

సింగు—అనుమానమేల? తుపాకి ప్రేల్చుము.

దత్తు గురిచూచి—ద్రోహులకారుయొక్క వెనుకచక్రమునకు తుపాకిప్రేల్చెను. నాల్గుదెబ్బలు ప్రేలినతరువాత—వానిలో నొకటి తగిలి స్వల్పముగ గాలి తగ్గిపోనదొడంగెను. ఆప్రయత్నమువలన—లారీయొక్క తీవ్రగమనమున కొకించుక యవరోధముగలిగెనేకాని, సంపూర్ణముగ గమనస్తంభన మొనరింపఁజాలకపోయెను. వేగముతగ్గి నడచుచున్న మోటారులారీవెంట తనకారునుబెట్టి దత్తు తరుమసాగెను. లారీని నడుపువాడు నిజముగా చాలచతురుఁడై యుండెను. అతఁడు దత్తు దృష్టిపథమునుండి కారును తప్పింప నుద్దేశించి—తెగించి—తన లారీని ఇఱుకుగానున్న రెండుచెట్లసందునుండి నడిపెను. కాని—అసంభవమైన ప్రయత్నముచేయుటవలన అతఁడు కృతార్థుఁడు కాజాలక పోయెను. లారీ యపాయమునుఁబొంది వృక్షమధ్యమున నిఱికిపోయెను. వెనుకచక్రములలో నొకదాని టైరుకు రంధ్రముపడెను. దత్తు తమ కారును నిలిపివేసెను. సింగును, దత్తునుగలిసి యాలారీని సమీపించిరి.

వృక్షచ్ఛాయలు నిబిడాంధకారబంధురములై యుండెను. ఆ ప్రదేశము రోడ్డున కొకయరమైలుదూరమునం దున్నది. ఆరోడ్డుమీఁద నైనను జనసంచారమంతగానుండునని తోఁపదు—కావున తాముకాల్చిన తుపాకిదెబ్బలధ్వనియైన నెవ్వరికైన వినఁబడినదో లేదోయని సింగు సందే

హించెను! ఒకవేళ నెవ్వరికైన వినఁబడినను—ఆధ్వనిని వారు పిట్టలవేఁట గాండ్ర తుపాకిధ్వనినిగా భావించియుందురు!

అస్వల్పావకాశమునందే—సింగు కనేకయూహలు తోఁచెను! లారీ యందు అధమము—ముగ్గురైన నుందురనియు—వారు ఆయుధపాణులై ప్రాణములకు తెగించియుందురనియుఁదోచెను! దత్తు సింగుల యిద్దఱికినికలసి—యొక్క—తుపాకిమాత్రమేయుండెను! ఐనను—వారు తెగించి దానిని వెంటాడిరి!—వెనుకభాగమునందలి తెరలు యథాప్రకారముగ మూయఁబడియేయున్నవి! డ్రైవరు చక్రమువద్ద నింకను సదరుబెదరు లేక కూర్చుండియే యున్నాఁడు!—

దత్తు—తనచేతిదీపమును వానిమొగముమీఁదికి వెలిగించెను. సింగు—తుపాకిని వానిగుండెల కెదురుగానుంచి "చేతులెత్తుము!" అని పలికెను. డ్రైవరు—సింగుచేసిన యాజ్ఞకు విధేయుఁడు కాలేదు. చిఱునవ్వుతో—సక్లేకూర్చుండెను. ఆతని నవ్వు వారిరువురకును పరమా సహ్యాకరముగా నుండెను. దత్తు, ఇన్స్పెక్టరుతో—"వీనిని మీరు జాగ్రత్తగా చూచుచుండుఁడు!" అనిపలికి తనదీపముతో లారీయొక్క లోపలిభాగముం బరీక్షింపఁబోయెను. ప్రథమవీక్షణముననే యాతఁడు విభ్రాంతుఁడైపోయెను—దత్తు—"సింగుగారూ! ఇందులో నెవ్వరును లేరు! మనము హతాశులమైతిమి. గురువుగారేమైరో.........అని యాఁదోళనముతో నొక్క కేకవేసి, దీపమును క్రిందికివంచి పరిశీలించెను. ఒక డజనున్నరకుపైగా కాల్చిపారవేసిన సిగరెట్టుపీకెలును—అప్పుడే లోపలినుండి బయటికీడ్వఁబడిన యొక నలుచదరపుపెట్టెయొక్క—చారయుఁ గాన్పించెను.

దత్తు—సింగుగారూ! మనము తలఁచిన లారీ ఇదియేయనుటకు సందేహములేదు. ఇంతవఱకు దీనిలో నిద్దఱు ముగ్గురు మనుష్యులుండిరి! ఆపెట్టె యీప్రదేశముననే యిదివఱకుండెను. ఇప్పుడదు లేదు!

దత్తుకంఠస్వరము కంపించుచుండెను. నిరాశతో నతఁడు మెల్లఁగా లారీని దిగెను. "ఇన్‌స్పెక్టరుగారూ!—గురువుగారు—నాగురువుగారు—మహాప్రమాదస్థితియందున్నారు కాఁబోలును!" అని గద్గదస్వరమునఁ బలికెను. సింగుకూడ—చాల నాందోళనస్థితియందేయున్నను—అతని మెదడు దత్తువలె పూర్తిగా చెడిపోలేదు. అతనికింకను కొంతయాలోచన తోఁచుట కవకాశము గల్గియున్నది.

సింగు—దత్తూ! నీవు గంద్రగోళపడి నన్ను గంద్రగోళ పెట్టకుము! ఈ డ్రైవరొకఁడు మనచేతఁ జిక్కియున్నాఁడుగదా! వీఁడు మనకా పెట్టెలను చూపకుండినచో తనకు చావుమూడునని యెఱుఁగక పోఁడు! మిగత ముగ్గురును—ఆపెట్టె నీయడవిలోనే యొకచోట దింపి తామును దిగియుందురు!

దత్తు—(ముఖవికాసముతో) ఇన్‌స్పెక్టరుగారూ! మీరు యోచించినది నిజము! దారిలో నొకచోట ఈలారీని వీరు కొంతసేపు నిలుపుటను మనము చూచితిమి! అప్పుడే పెట్టెను క్రిందికిఁద్రోసి వారును దూకియుందురు! మన కింకను తరుణము దాటలేదు!—మనకారును నడుపుకొని వెనుకకుఁబోదమా?

సింగు—"ఒక్కక్షణము తాళుము! ఈడ్రైవరువద్ద నొకతుపాకి యుండకపోదు! అది మన కుపయోగింపవచ్చును!—నాకోటుజేబులో అరదండములజత యొకటి యున్నది. దానినితీసి వీనికి తగిలింపుము—(డ్రైవరుచూచి) నీవుమాకు ఖైదీ వైతివి! చేతుల జోడింపుము! అరదండములు తగిలింతుము. డ్రైవరు సర్వమునకును తెగించియుండెను. ఇదివఱకొకసారి వాఁడు సింగుఆజ్ఞనుల్లంఘించెను. ఇప్పుడు సింగుమాటలు వాని యాపాదమస్తకమును జ్వలింపఁజేసెను. ఒడలుతెలియని యావేశమునలేచి యాడ్రైవరు సింగుకుత్తుకనుబట్టి పిసుకఁబోయెను. కాని యాప్రయత్నమున వానికి విజయము కలుగలేదు. వెనుకనుండి దత్తు

వానిపై తుపాకిప్రేల్చినందున నిర్భాగ్యుడగు నాడ్రైవరు సింగు పాదములకడఁ బడిపోయెను.

సింగు—దత్తూ! వీనిని చంపితివాయేమి?

దత్తు—ఆఁ—చచ్చెననియే తలంతును.

తరువాత—డ్రైవరును లారీని—ఆయడవినడుమనే వదలి సింగును దత్తును తమ కారును వేగముగ నడుపుకొనుచు—వెనుకకుఁ బోవసాగిరి.

కొంతదూరము కారునడచినంతనే—ఆయరణ్యమధ్యమునుండి కొన్ని తుపాకిదెబ్బలధ్వనులు వినఁబడెను. ఆధ్వనులకు పక్షులు భీతిల్లి నలుదెసలఁ బారుచుండెను. సింగుదత్తు లానంకకు చూచుచుండఁగనే—చెట్ల నడుమ నొకటార్చిదీపపు వెలుతురును తత్కాంతియందొక పురుషుని స్వరూపమునుఁ గాననయ్యెను! ఆపురుషుఁ డొక తెల్లని దేవదారుపెట్టె మీఁదికి వంగి తుపాకితో పెట్టెలోనికి కాల్చుచున్నట్లుండెను. దత్తు కారు వేగము నధికముచేసెను. కారు తత్ప్రదేశమునకుఁ జేరుసరికి ఆపురుషుఁ డదృశ్యుఁడై పోయెను. వేఁగముగ కారు నవతరించి—సింగు దత్తు—ఆప్రదేశముం జేరిరి. అచ్చట రెండు దేవదారుపెట్టెలుండెను! దత్తు దీపపువెల్గున వానిం బరిశీలించెను. పెట్టెలు రెండును తుపాకిదెబ్బల వలన రంధ్రములు పడియుండెను! దత్తు హాహాకారి మొనరించి—"ఈ పెట్టెలో గురువుగారుండిరేని—యిది వారికి ప్రాణాపాయదశయే!" అని పలికెను. సింగు దత్తునాందోళనపడవలదని కారులోనుండి కొన్ని పని ముట్లనుఁ దెచ్చి—యాదేవదారుపెట్టెలలో నొకదానిని విడఁగొట్ట నారంభించెను. ఇప్పుడుదత్తు—ఆందోళితహృదయుఁడై నిశ్శబ్దముగ పర్యవసానమునకై నిరీక్షించుచుండెను. పెట్టెపైభాగమునందలి చెక్కలు పలు చనివగుటచేత సులభముగనే యది యూడివచ్చెను. ఆత్రముతో నిరువురును లోనికి తొంగిచూచిరి! అందొక మానవకళేబరము వారికి దీపపు కాంతియందు గాన్పించెను.

ఆ కళేబరము—నిర్భాగ్యుఁడగు వీరభద్రునిదై యుండెను!

*　　*　　*　　*　　*

అది నిస్సందేహముగ మృతకళేబరము!—పెట్టెమీఁదినుండి లోపలికి ప్రేల్పఁబడిన తుపాకిదెబ్బ లనేకము లాతనిశరీరమునంతను రంధ్రములుగా నొనరించివేసినవి! బలమైన గుండొకటి యానిర్భాగ్యుని గుండెలలోనికిఁగూడ దూసుకొనిపోయెను!

దత్తొక దీర్ఘనిశ్వాసమునువదలి—"ఇఁక చెప్పవలసిన దేమున్నది? దానిలో నింకొక మృతకళేబరమును తప్పకచూడఁగలము" అనిపలికెను.

సింగు దత్తుసహాయముతో—రెండవపెట్టెనుఁగూడ తెఱచి యందు దట్టింపఁబడిన గడ్డినిఁగూడ తీసిచూచెను. ఊహించినదానికి సరిగా—దానిలోఁగూడ నొక మానవకళేబరము కనఁబడెను. దడదడలాడుచున్న గుండెల నడుచేత నిదుకొని ఫ్లాష్‌దీపపు వెల్గున వారిరువురును ఒక్కసారిగా వంగి యావ్యక్తినిఁజూచిరి! ఇద్దఱును—పరమాశ్చర్యముతో నొక్కకంఠమున "హా! భగవంతుని యనుగ్రహము! ఇది పత్తేదారుని శరీరము కాదు!" అని కేకవేసిరి.

సింగు—ఇంకను తత్కళేబరపు ముఖమును నిదానించిచూచుచునే యుండెను. పూర్వమెన్నఁడో యా వ్యక్తిని చూచినట్లాతనికి స్ఫురించెను. కాని ఎక్కడచూచినదియు—వాఁడెవ్వఁడైనదియు జ్ఞప్తికి వచ్చుటలేదు. ఈవ్యక్తి వీరభద్రునియంత తీవ్రముగ గాయపరుపఁబడలేదు—సింగును, దత్తును—ఆవిషయమై చర్చించుకొని—"హంతకులు పైభాగమునకు బదులుగా పొరపాటున పెట్టెను తలక్రిందులుచేసి క్రింది భాగమున తుపాకిదెబ్బలు ప్రేల్చియుందురనియును లోపలివ్యక్తి పెట్టె యడుగునఁబడియుండుటచేత అంతగా దెబ్బలు తగిలియుండవనియును" స్థిరపరచుకొనిరి. అప్పటికిని ఒకటి రెండు దెబ్బలు తగిలినందున రక్తము కారుచుండెను. కుడిభుజము సమీపమునఁ దగిలిన దెబ్బ కొంచెము బలమైనదిగానుండెనుగాని ప్రమాదకరముగ మాత్రము

కనఁబడుటలేదు!—ఆ వ్యక్తికి—ఉచ్ఛ్వాసనిశ్వాసములు సరిగా నుండెను. కాని గాయములవలన చాల బాధపడుచున్నట్లు తోఁచెను. టార్చిలైటు కాంతి మొగమునఁబడినపిదప అతఁడు కన్నులు దెరచెను—కాని కదులలేదు. మాటాడలేదు. సింగు సంతోషముతో వానినిజూచి—"నీకు మరణాపాయశంకగల్గుటలేదు గదా!" అని ప్రశ్నించెను. వ్యక్తి "ఊఁ—ఊ—" అని మూల్గి ఆ పెట్టెలోనుండి తన్ను బయటకుఁ దీయవలెనను సూచనగా చేతినందించెను!

లేచుటకు పూర్వము—చికిత్స యత్యవసరము కావున—ఇన్‌స్పెక్టరుసింగు—వెంటనే వీరభద్రుని భుజభాగమందు—రక్తము గారుచున్న గాయమునకు కట్టుగట్టెను. ఇంతలో—దత్తు—లారీయున్న ప్రదేశమున కొకమారు చనెను. డ్రైవరు బ్రదికియుండుననియును—అతని వలన తన గురునియునికి నెఱుంగ నవకాశముగల్గుననియును దత్తునకు ఆశ.

దత్తు తలంచినట్లుగనే—డ్రైవరు మృతినందలేదు; కాని-స్పృహ లేకుండనుండెను. వెంటనే వాని శరీరమును—తన కారులోని వెనుకభాగమందుంచి—దేవదారుపెట్టెల ప్రదేశమునకుఁ గొనివచ్చెను! అతఁ డచ్చటికి చేరుసరికి—ఇన్‌స్పెక్టరు వీరభద్రునితో నేమో సంభాషించుచుండెను.

ఇన్‌స్పె—ఇదివఱలో—నిన్నెక్కడనో చూచినట్లు నాకు పరిపూర్ణమైన నమ్మకముగలదు.

వీర—మీరు చూడలేదు.

ఇన్‌స్పె—అట్లు నీకుఁ గట్టినమ్మకము గలదా?

వీర—సకారణమైన నమ్మకముగలదు.

ఇన్‌స్పె—ఆకారణమెట్టిది?

వీర—కలదు. అది నావ్యాపారమునకు సంబంధిన కారణము!

ఇంతలో—పోలీసుకారు దత్తుచే నడిపింపఁబడుచు—వెనుకటి కన్న మెల్లగావచ్చి నిలిచెను. వెంటనే—ఆకారులోని యింకొకసీటులో రెండు దేవదారుపెట్టెలను—మఱియొక సీటులో వీరభద్రుని—భద్రపర చిరి. కారు ప్రయాణసన్నిద్ధమయిన పిదప—దత్తు దాని నతిరయమున నడిపి—కొంతసేపటికి—బెజవాడ పోలీసుస్టేషను చేర్చెను. డ్రైవరు కొంత బ్రాందిసేవించిన పిదప—సంభాషించుటకుఁ దగిన శక్తిగలవాఁ డయ్యెను! ఆడ్రైవరు పోలీసువారికి ఈ క్రింది వాఙ్మూలము నిచ్చెను.

"నేను తాత్కాలికముగా—ఆలారీని నడుపుటకు డ్రైవరుగా నియమింపఁబడితిని! ఈదేవదారుపెట్టెలను రెంటిని—కొండొకప్రదేశ మునకు చేర్చుటకై నేనాజ్ఞాపింపఁబడితిని. వానిలో నేమియున్నదో—యావివరములుగాని—నన్ను బాడుగకు కుదిర్చిన యాముగ్గురు మను ష్యులనుగాని నేనెఱుఁగను! మీపోలీసుకారు వెంటాడుట ప్రారంభిం పఁగనే—వారు నాకొక రివాల్వరునుచూపి వెరపించి—లారీని అడవి లోనికి నడిపింపుమని కోరిరి! లారీలోనున్న పెట్టెలును మనుష్యులును అదృశ్యులై రన్నసంగతిని దత్తుచెప్పువఱకును నాకు తెలియనే తెలియదు! నేను మీపై తిరుగఁబడి దౌర్జన్యముచేయుటకు కారణ మేమనఁగా—అంతవఱకును లారీలోనివారే పెద్దమనుష్యులనియు, మీ రేహంతకులో చోరులో యనియు నేను విశ్వసించియుంటిని!"

అతనివాఙ్మూలము సంపూర్ణముగా నిజమైనదని పోలీసువారికి నమ్మకము గలుగలేదు. ఐనను—అతని మాట లనృతములని ఋజువు చేయుట కష్టమైయుండెను!

గాయములు తగిలిన మనుష్యుఁడు నిశ్శబ్దముగానుండెను. అతఁ డింటికిబోవుటకు తగినంతగా స్వస్థతనందెను!—అతఁడు పోలీసువారికి వాఙ్మూలము నిచ్చుట కిష్టపడుటలేదు! అందులకు ప్రతిఫలముగా నతఁడు పోలీసువారి కాపుదలపై వైద్యశాలకు పంపఁబడెను. విద్రోహి నిలఁడు

మగు త్రివిక్రమభవనమునందలి—దొఱికిన వారి నందఱిని—జూదరులను, చోరులను, హంతకులను, రౌడీలను అరెస్టుచేసి సింగు జైలుకుపంపెను.

కాని యిప్పటికింకను పత్తేదారు గోవిందరావునాయఁడు దొఱుక లేదు!

సింగు—దత్తునుఁజూచి—“అబ్బాయీ! ఇప్పుడు మనము పట్టుకొనినవారందఱును పాపము కేవల నాటకపాత్రలవంటివారు! వీని కన్నిటికిని—సూత్రధారుఁడు వేఱేయున్నాఁడు! వాఁడు దొఱుకవలెను.—అదిగాక—డెటెక్టివ్ కనఁబడుటలేదు! అతనిని కనుఁగొనుటకు మనము వెనుకటి నధికశ్రమ పడవలసియుండునని నాతలంపు!” అనిపలికెను!—



## పదునైదవ ప్రకరణము.

### నిక్షేపము గుర్తింపఁబడినది.

త్రివిక్రమ భవనమునందలి భూగర్భనిలయములో—అతనిజేబులో నేమికలదో పరిశీలించుతలంపున వీరభద్రుఁడానాఁడు—బంధింపఁబడియున్న పత్తేదారుని కట్లువదలించెనుగదా! తరువాత—కొంతసేపటికి శత్రువులు మరలవచ్చి—యాతని తిరిగి బిగించిరి. కాని, యీసారి తొందఱలో నైననేమి—పొరపాటుననైననేమి—పత్తేదారుని యదృష్టవశముననైన నేమి—వెనుకటియంత గట్టిగ బిగింపలేదు. అతని మెదడు మెల్లగా పని చేయుచుండెను—జఱిగిన చర్యలన్నియు స్వప్నమునందువలెఁ దోఁచు చుండెను. ఆస్థితిలో నాతనికి స్వేచ్ఛగలిగినను పోరాడుటకుఁ గావలసినంత శక్తి లేకుండెను! అదృష్టవశమున కుడిచేతికిఁ గట్టఁబడినతాఁడే కొంత వదులుగానుండెను. అతఁడు—మఱికొంత ప్రయత్నించిచూచిన—మఱింత యనుకూలమయ్యెను. ఉపాయమున చేతిని వెలికిఁదీసుకొని జేబులోని

కత్తినిఁదీసి దానితో కట్లనుకోసివేసెను! ఇప్పు డాతఁడు సంపూర్ణమైన స్వేచ్ఛతోనుండెను. ఇంతలో నొక త్రివిక్రమానుచరుఁ డాగదిలోనికి వచ్చెను! గోవిందరావు వెంటనే త్రాళ్లయొక్క తెగినభాగములు కనఁబడకుండఁజేసి కత్తిని పిడికిట గుప్తముగావించి బంధితునివలెనే కదలక పడుండెను! ఆయనుచరుఁడును వీని నన్నిఁటిని పరిశీలింపక పెట్టెమూఁత వేసి వెడలిపోయెను!——

తరువాత చాలసేపుజరిగెను. "కారుప్రయాణము" అను విషయమును త్రివిక్రమానుచరులు మాటలాడుకొనినట్లు గోవిందరావుకు జ్ఞప్తికివచ్చెను. అతఁ డాచీఁకటిలో రేడియం డయలు (Rediam Dial) గల తన చేతిగడియారమును జూచెను! చాలకాల మతిక్రమించెను! క్రమముగా నాతనికి బలము చేకూరుచుండెను! ఆప్రదేశమునుండి లేచిపోవలయునని యాతఁడు సంకల్పించుచుండెను! ఇంతలో—వెనుక పరిజనుల నందఱిని శాసించిన ముసుఁగువాఁడు—ఆగదిలోఁ బ్రవేశించెను!—అతఁడు గోవిందరావు బంధింపఁబడియున్న పెట్టెమూఁతఁ దెఱచి—టార్చిదీపము నాతనిమొగముపై బ్రసరింపఁజేసి—

"ఇదుగో! గోవిందరావ్!—నాకు విశేషముగా నావకాశము లేదుగావున త్వరలో నిన్ను కొన్నిప్రశ్న లడుగఁదలంచితిని!—నిరాకరించితివా—నిన్ను యమయాతనలఁ బెట్టియైనను తద్రహస్యములను బయటఁబెట్టకమానను!" అని పలికెను.

ముసుగువాని మాటలకు డెటెక్టివ్—ప్రత్యుత్తర మొసంగక—అర్ధనిమీలితలోచనుఁడై యుండుటచేత—ప్రాయశః అతఁడింకను నిస్సహాయుండే యున్నాఁడేమోయను అనుమానముతో—గోవిందరావును పట్టియూపుచు—"నీకు నామాటలు వినఁబడుచున్నవా?" అని యడిగెను.

గోవిందరావు మాటలాడుట కిష్టములేకున్నను బలవంతముగ 'ఆఁ!' అనిమాత్ర మనెను. తాను పూర్ణముగ తెలివిగల్గియున్నట్లు ప్రకటించుట ముందరిమెత్తులకు భంగకరముగా నతనికిఁ దోఁచెను.

ముసుగువాఁడు—నిరూపకునిమీఁదికి వంగి "నీవు ప్రతాపు నెన్నడైన పట్టి బంధింపఁగలనని తలంతువా?" అని యడిగెను.

గోవిం—ప్రతాపుఁడా?—ఇంకెక్కడి ప్రతాపుఁడు?—వాఁడు చచ్చినాడు!!

ముసు—అది నీతలంపు! అంతేకాదూ? కాని—భైరవ ప్రసాదాదులను హత్యచేసినవానియందు ప్రతాపుని లక్షణము లన్నియుఁ గలవని నీవు బాగుగా నెఱుఁగుదువు! ఈయభియోగమునకు సంబంధించిన విషయములలో—ప్రతాపుని స్వహస్తాక్షరములనుకూడ నీవు చూచితివి! అతని వ్రేలిముద్రలను చూచితివి! అంతకన్న నధిక నిదర్శనము లింకేమికావలెను? అతనిరూపము సరియైనది కాదని తలంచినను—హస్తాక్షరము లనుకరణములని యూహించినను—వ్రేలిముద్రలు ప్రబలప్రమాణములుగదా! నీవు సరిగా విమర్శించిచూచునెడల వ్రేలిముద్రలలో నెట్టి సందేహమును గల్గదు. ప్రతాపుఁడు సజీవుఁడై యున్నట్లు నీకు తగిన ప్రమాణము లభింపఁగలదు. ఇన్ని ప్రమాణములు ప్రత్యక్షముగ కనఁబడుచున్నను—నీవేటికింకను కన్నులుమూసికొనియున్నావో నాకాశ్చర్యముగ నున్నది!.........మంచిది! కాని—గోవిందరావ్! నీవిఁకనైన మాటలాడదలంచితివా?—నీవు పోలీసుశాఖకు సంబంధించినవాఁడవు! ఐనను—నీకు తెలిసినన్ని విషయములు ఇతరపోలీసు ఉద్యోగస్థులకు తెలియవు—ఒక్కసంగతిచూఁడు—నే నెవ్వఁడనో నీవెఱిఁగియుందువు! ఎఱుఁగవా?

ఇందులకు జవాబులేదు—

ముసుఁగువాఁడు కోపముతో గోవిందరావు కంఠమునుబట్టుకొని పిడికిలి మొగముమీఁదికి సాచెను.

ముసు—ఏమి?—నన్నెఱుఁగవా నీవు?

గోవిం—ఎఱుఁగుదును.

గోవిందరావు—తగినతరుణము లభించుటకై—ఉపాయముతో కాలము నీడ్చుచున్నాడు! అతఁడు తన్నుప్రశ్నించుచున్న వ్యక్తికిని తనకును నడుమనున్న దూరమును కొలుచుచున్నాఁడు! తగినయదను దొరికినవెంటనే వానిగొంతుపట్టి పిసికి—అనుచరులకు సూచనయైన తెలియకుండ వానిని మట్టుబెట్టుటకు వేచియున్నాఁడు! ముసుఁగువాఁడు మరల చెప్పసాగెను!—

ముసు—నీవు నీతలను కొంచెముప్రక్కకు త్రిప్పిచూచితివా యిచ్చట రెండు దేవదారుపెట్టెలను చూడఁగలవు! మా వ్యూహముల కడ్డమువచ్చినద్రోహి యొకఁడిదివఱకే దానిలో పెట్టఁబడినాఁడు! ఇఁక రెండవదానిలో నిన్ను పెట్టఁదలచితిమి! కాని నేనింతసేపటి నుండియు నీతో సంభాషించుటకు ఫలితమేమనఁగా—నీవు ఎంత వఱకు విషయముల నెఱుఁగుదువో తెలిసికొనఁ గోరితిని. కాని నే నిప్పటికిని అందు—కృతార్థుఁడను గాఁజాలకపోయితిని!......
ఇఁక నావిషయములో—నీవునన్ను—గుర్తించిన గుర్తింపవచ్చును. కాని ఆసంగతి ఇతరపోలీసులుకూడ నెఱుంగుదురా అనునదియొక సందేహము!

గోవిం—వారుకూడ నెఱుఁగుదురు! ఇప్పుడు కాకున్న నిఁకముందైన నెఱుఁగుదురు!

ముసుఁగువాఁడు కొంచెమించుమించుగా తనమొగము నిరూపకుని మొగమునకు తగులనంత ముందునకు వంగి—"ఏమంటివి" అని గర్జించెను!

అదే తగినసమయమని గోవిందరావు—తన రెండుచేతులతోడను వాని గొంతుపట్టుకొని నోట మాటరాకుండ వానిని నేలకువంచి మీఁద గూర్చుండెను. ఊపిరివదలుటకైన నవకాశము మీాకుండ గోవిందరావు వాని వక్షస్థలమునఁ గొట్టిన దెబ్బలకు ముసుగువాఁడు తెలివితప్పి పడిపోయెను. అంతట డెటెక్టివు వాని ముసుగును తీసివేసెను! గోవింద

రావు వాని మొగమును నిదానించిచూచి "ఓ! సరిపోయినది! నేను తలంచినదికూడ అంతే!" అనుకొనెను. కొంతదూరమున నేలపైబడి యున్న ముసుఁగువాని రివాల్వరును గోవిందరావు దొరికించుకొని యతి వేగముగ తన దుస్తులను వానికిని, వానిదుస్తులు తనకును మార్చివేసి ముసుఁగు తగిలించుకొని ఆ గదిలోనున్న రెండు దేవదారుపెట్టెలలో ఇదివఱకే బంధింపఁబడియున్నది గాక—తెఱువఁబడి తనకొఱకై నిరీక్షించు చున్నదానిలో ఆ ముసుగువ్యక్తిని పరుండబెట్టి వరిగడ్డిని పైనగప్పి వేసెను! తరువాత ఆపెట్టెను బంధించివేసి మొగమున ముసుగుతోడను, ముసుగువానిదుస్తులు, తుపాకితోడను—మేడమెట్లను నిర్భయముగ నెక్కెను. ముసుగువాని టోపీయును—వాటర్‌ప్రూఫ్ కోటును(Water-Proof Coat) అచ్చట నొక వంకెకు తగిలించియుండగా వానిని తాను ధరించెను. అవి తనకు అచ్చుగుద్దినట్లు సరిపోయెను.

వెంటనే—అతఁ డాయింటినుండి బయలుదేరి—వీధినిఁబడి యొక కాఫీహోటలులోఁ బ్రవేశించెను. అప్పుడాతనికి సత్తువగల్గుటకేదియేని కొంత యాహారమును ఒక కప్పు తేనీరును లోనికిపోవలసిన యవసరము గల్గెను. అచ్చట నాతఁడు కొంత ఫలాహారమును తేనీటిని తెమ్మని చెప్పి—ఈలోపల ముసుగువాని కోటుజేబులను పరీక్షించెను. అందొక దానిలో కొన్ని కాగితములు దొరికెను. వానిపై—సన్ననివ్రాఁత యుండుటచేత శీఘ్రముగ చదువుటకు వీలుగలుగలేదు. ఇంకొక జేబులో నొక దారమునుగ్రుచ్చఁబడిన రెండు తాళపుచెవులును, వాని కొక్క అట్టచీటియు కట్టఁబడియుండెను. ఆ చీటిపై—"17 నెంబరు—ఇల్లు సత్యనారాయణపురము" అని యుండెను.

అతివేగముగ గోవిందరావు—తన కాఫీనిముగించి—యొకగుఱ్ఱపు బండిని మాట్లాడుకొని సత్యనారాయణపురమునకు త్వరగాపోవలెనని చెప్పెను! త్వరగానటకరిగి—యాగృహమునందలి రహస్యములు నెఱుఁగ

నున్నచో—ఈలోపుగా ముసుగువానికి తెలివివచ్చినచో మఱల నెట్టి ప్రమాదము ఘటిల్లునోయని గోవిందరావు—సందేహించెను!

సత్యనారాయణపురమునందలి 17 వ నెంబరుగలయిల్లు—రమణీయముగ నిర్మింపఁబడిన యొక్కచక్కని చిన్న భవనము! గోడలు రాతికట్టడముఁగల్గియున్నవి! సింహద్వారమునకు శిలాసోపానములును వానికి రెండుప్రక్కలను ఇనుపరేలింగులును (Railings) గలవు! బండివానికి కిరాయి చెల్లించి పంపివేసినపిదప—గోవిందరావు ఆరెండుతాళపుచెవులలో నొకదానితో సింహద్వారమును తెఱచెను! దినదినమును శుభ్రముచేయువాఁడుక లేనందున లోపలిచావిడి ధూళితోనిండియున్నది. గోవిందరావు—అతిత్వరితగతిని ఆమందిరమునంతను శోధింప నారంభించెను. విశేషమేమియును గనఁబడలేదు!

ఆశాభంగమువలన నాతనికి విసుగుబుట్టెను! మఱియొకసారి సూక్ష్మపరిశోధన మారంభించెను. వంటయింటిలోను—ప్రొయ్యిలలోను మఱుగుదొడ్లలోను స్నానముల గదులలోనుఁగూడ శోధించెను. మేడమీఁద శయనగృహమువంటి యొకగదిలో నాతనికి క్యాన్వాసుగుడ్డతో కుట్టఁబడిన రెండుసంచులు కనఁబడెను! ఒకదానిలో—కొన్నికృత్రిమవేషాలంకారములును, ప్రతాపుని పేరుమీఁదనున్న కొన్ని రహదారీ చీట్లును, విదేశపు బ్యాంకులలో ధనముదాచినతాలూకు కొన్ని రశీదులును—ధనమును తీసికొనుటకేర్పడినట్టియు—ప్రతాపుని సంతకము మినహాగా తక్కినవ్రాతయంతయు సంపూర్తిగానున్నట్టియు కొన్ని ఫారములును, ఇవిగాక—కొన్ని ఇంగ్లీషు నవరసులు—డాలురులును, గోవిందరావుకు గోచరించెను! రెండవసంచిమాత్రము చాలపెద్దదిగను బరువుగను నుండుటయేగాక—తాళము వేయఁబడియుండెను! ముసుగువాని కోటు జేబులో దొరకిన రెండుతాళపుచెవులలో నొకటి సింహద్వారమునకు సరిపోయినది గనుక—రెండవది యీ సంచికి సరిపోవునను భావముతో గోవిందరావు దానిని తెఱువగా—నవి సులభముగ ఊడివచ్చెను. సంచి

తెఱువఁబడినతోడనే చీకటిగానుండిన యా గదియంతయు కాంతిమంత మయ్యెను. గోవిందరావు కన్నులు చెదరి చీకటులు గ్రమ్మెను! ఆసంచి యంతయు అమూల్యనవరత్నఖచితసువర్ణాభరణ సహస్రముతో క్రిక్కి రిసియుండెను! గోవిందరావు నిశ్చేష్టుఁడై పోయెను. శరీరమున చలన మొక్క నిమిషమాత్రము నిలచిపోయెను! నోటమాట వెలువడలేదు!

వెంటనే యాతఁడా రెండుసంచులను చేతఁబట్టుకొని తిన్నఁగా బయటికి నడువదగునని యూహించెను. కాని మొదటిసంచిలోని కృత్రిమ వేషాలంకారముల ప్రయోజనమును పరిశోధింపవలయునను బుద్ధిపుట్టుట చేత—అందే నిలిచెను.

ఒక్కటొక్కటిగా ఆవస్తువుల నన్నిటిని గోవిందరావు పరిశీలించి చూచెను. అవి నాటకవేషధారుల కనుకూలములగు వస్తువులు! వానిలో గ్రీన్ పెయింటు లైనర్సు, కోకోబటర్, క్రేప్ హెయిర్, స్పిరిట్ గమ్— మొగపుముసుగు—ఒక రివాల్వరు—మొదలయిన వస్తువులుండెను! ఇవి గాక—వానితో నొక ఛాయాపటమును గలదు. ఆ పటమునందలి యాకృతికి సరిగా వేషధారణము చేసికొనుటకై—ఆధారముగా నది దాచబడెనని గోవిందరావు తలంచెను! ఇన్నిటితోపాటుగా నొక టార్చి లైటుగూడ దానిలో నున్నది! కృత్రిమవేషధారియగు నా టక్కరి తెలివితేటలను గోవిందరావు మిగుల స్తుతించెను. గోవిందరావు మొగపు ముసుగుగుడ్డను తాను తగుల్చుకొని చూడగా అది యాతనికి చాలలేదు. అందుచేత ఆవేషధారికన్న తాను కొంచెము పొడగరినై యుందునని యతఁడు తలంచెను! పిదప—పటమునందలి చిత్రమును తన మొగ ముతో పోల్చి చూచుకొనఁగా—తన మొగమునకును, ఆబొమ్మమొగ మునకు విశేషమైన పోలికగలదనియు, వేషమును దిద్దుకొనినచో—తాను గూడ ఆబొమ్మవంటి యాకృతి నందవచ్చుననియు నతఁడు తలంచెను. అప్పటికి దినకాంతి క్రమముగా క్షీణించుచున్నందున పత్తేదారుఁడు టార్చిలైటు నుపయోగించెను.

అతఁడు ద్వారమును బంధించివచ్చి గోడకుఁగల నిలువుటద్దముపై సరిగా టార్చిలైటు వెలుగుపడునట్లు—ఎదురుగానున్న గోడకు దాని నేర్పరచి ఒక పావుగంటకాలము వేషధారణమునకై వినియోగించెను! అప్పటి కాతనివేషము పరిపూర్ణమైన మార్పుఁజెందెను. ఇంతలో క్రిందిగదులందు తలుపుమూసిన ధ్వనియు మనుష్యపదసంచలనమును వినబడియెను!



## పదునాఱవ ప్రకరణము.

### భృగురాముని దెబ్బ.

ఏకాంతమగు నా నిగూఢమందిరమున నూతనపురుషపదధ్వని శ్రవణతాడితమైనంతనే గోవిందరావు తొలుత నించుక చకితుఁడై క్రమముగ ధైర్యముఁ దెచ్చుకొనెను. అతఁడు సెకనున కొక యడుగు చొప్పున నిశ్శబ్దములగు మెల్లని యడుగులతో—నాగదిని వదలి క్రిందికి నడచి యొక ద్వారముకడ తలుపుచాటున దాగియుండెను! ఆగంతుకుఁడు గది గదియు శోధించుచున్న సవ్వడివినఁబడుచుండెను! ఆ వచ్చినమనుష్యుఁడు ధనమును దాచినవాఁడుగాని దాని యునికినైనను సరిగా నెఱింగినవాఁడుగాని కాడనియును—ఈ యింట నిట్టిధనము గుప్తపఱుపఁబడి యున్నదని యెఱింగి దానికొఱకై వెంటాడుచువచ్చిన యొకానొక చోరుఁడై యుండుననియు గోవిందరావు తలంచెను.

పదధ్వనివలన వ్యక్తి మేడమీఁది కెక్కుచున్నట్లుండెను. ఆధ్వనియందాతురభావ మెంతమాత్రమును కనఁబడుట లేదు. గోవిందరావు కూడ మెల్లని యడుగులతో మేడమీఁది కెక్కి మఱల నేఱొక గది తలుపుచాటున దాగెను. నూతనుఁ డొకటి రెండు గదులు వెదకి తుదకు

గోవిందరావు దాగియున్న గదిలోనికే వచ్చెను! ఇప్పుడు గోవిందరావున కా నూతనవ్యక్తియొక్క ముఖభాగము కాన్పింపకున్నను వెనుకభాగ మంతయు గాన్పించుచున్నది. పట్టుటోపీ—చేతిమేజోళ్లు—చేతిలో నొక విలాసయుతమగు బెత్తము! వీనిని సాధారణముగ నెవ్వరు ధరించు చుందురో గోవిందరావునకు బాగుగా తెలియును.

అతఁడే—భృగురామసర్కార్! చోరాగ్రేసర చక్రవర్తియగు భృగురామసర్కారు!!—

కృత్రిమాలంకారముల సంచిలో దొరికిన రివాల్వరు కుడిచేతను—టార్చిదీపమును ఎడమచేతను గోవిందరావు వెంటనే జాగ్రత పఱచు కొనెను! తలుపుచాటునుండి బయటకువచ్చి ఒకచేత గోవిందరావు హఠాత్తుగా చేతిదీపమును భృగురాముని మొగమునకు సూటిగా వెల్గించెను! రెండవచేతిలోని రివాల్వరు నాతని గుండెల కెదురుగాఁబట్టియుంచెను! భృగురాముఁడు చకితుఁడై వెనుకకు దిరిగిచూచెను. ఆతనియెదుట నున్నవాఁడెవ్వఁడు!

## ప్రతాపుఁడు!

భృగురాముఁడు భీతినందలేదు! నిదరుబెదరులేక ఒకటి రెండు నిమిషములకాలమట్లే గోవిందరావు మొగమునంకఁ జూచెను. టార్చిలైటు కిరణములకాంతియం దాతని కనుగ్రుడ్లు—అగ్నిగోళములవలె మెఱసిపోవుచుండెను! కొంతసేపటి కాతఁడు గంభీరస్వరముతో—

"ఓహో! ప్రతాపబహద్దరా! ఎంత సుదినము!" అని పలికెను!

ఆమాటవిని గోవిందరావు వికటహాసముచేసి "నీవు పొరబడు చున్నావు!" అని పలికెను. ఈసారి గోవిందరాయుని కంఠస్వరము వినఁ బడుటతోడనే భృగురాముని మొగము వికసించెను.

భృగు—బాగు! బాగు !!— అట్లయిన ఇతఁడు నాప్రియమిత్రుఁడైన గోవిందరావు పత్తేదారుఁడాయేమి? ఎంతచిత్రము! మిత్రుఁడా! పత్తేదారుఁడవైన నీ కీహంతకవేషమేమి?

గోవిం—నీవు దొఱకిపోయితివి! నిలువుము! అచ్చటినుండి కదులవలదు!

ఇట్లనుచునే—గోవిందరావు రెండడుగులు ముందునకువేసి—"చేతులను గదల్చిన మరణము తప్పదని తెలిసికొనుము! నీపిడికిట గూఢముగా నిమిడియున్న పిస్టలు నిటుతెమ్ము. నాకుకావలెను!" అని యాజ్ఞాపూర్వక గంభీరస్వరముసఁ బలికెను! గోవిందరావు తన టార్చిలైటును సర్కారు చేతులనంకకుఁ ద్రిప్పెను. సర్కారు తన చిన్నపిస్టలును సాధారణముగా—ఎడమపిడికిలిలో నుంచుకొనుట) అనుభవమువలన గోవిందరా వెఱుఁగును. అందుచేత ఎడమపిడికిలిమీఁదికి కాంతి కేంద్రీభవించు రీతిగా దీపమును పట్టుకొనెను! అప్పటికిని కుడిచేతి కొంతభాగము చీఁకటిలోనే—యుండవలసివచ్చెను! ఏపాటియవకాశము నిచ్చినను సర్కారు తన పిస్టలును ప్రేల్చఁగల సాహసియని గోవిందరావు బాగుగ నెఱుఁగును. గోవిందరావు ముందునకు మెల్లగానడచుచు తనతుపాకిగొట్టము నాళాగ్రమును సర్కారు గుండెలదగ్గఱకుఁబోనిచ్చి పట్టుకొనెను! రెండవచేతిలోని దీపమును చంకలోనుంచుకొని సర్కారుచేతనున్న పిస్టలును సంగ్రహించి గవాక్షమార్గమున బయటి దొడ్డిలోనికి విసరివేసెను. ఏతత్పతనమువలన ఆపిస్టలుప్రేలి ధ్వనించెను. అట్టి ధ్వని కలుగవలయుననియును—అందువలన తనకు కొంతసహాయము లభించుననియు ఉద్దేశ్యపూర్వకముగనే గోవిందరావు దాని నట్లు విసరెను. ఏమనిన—భృగురామసర్కారును బంధించుకొనిపోవుట—ఒక్కమనుష్యునకు సాధ్యముగాని పని!—

భృగురాముఁ డెంతమాత్రమును తిరుగుబాటు చేయలేదు! గోవిందరావు—త్వరపడి తన్ను తుపాకితోఁ గాల్చువాఁడుకాఁడని యాతఁడెఱుంగును. సర్కారు తన సహజగంభీర శాంతధైర్య స్వభావ

ములతో చిఱునవ్వునవ్వుచు—"ఇప్పుడు నన్ను నీవు బానిసనుగాఁ జేసి కొంటి ననుకొనుచున్నావు అంతేకాదూ? గోవిందరావూ!" అనిపలికెను.

గోవిం—అధిక ప్రసంగము కట్టిపెట్టు! అచ్చట కనఁబడుచున్న రెండు సంచులను చూచితివా! వానిని చేతఁబట్టుకొని నావెంట క్రిందికి నడచిరమ్ము.

సర్కారు ముఖలక్షణములవలన అతఁడు గోవిందరావు శాసనము నకు విధేయుఁడగునట్లు తోఁపలేదు. ఐనను—సంచులలో నేమికలదో చూడవలయునని కాంక్షమాత్రముగ్గలెను. మెల్లఁగావంగి వానిం బరిశీ లించెను. ఒకటిమాత్రమే యమూల్య నిధనప్రపూరితము! రెండవది నిష్ప్రియోజనము! వట్టిచెత్త! అతఁడు రెండవదానిని వదలివేసి మొదఁటి సంచినిమాత్రము పైకెత్తి—గోవిందరావు మొగమువంకఁ జూచెను. డెటెక్టివు—మఱల ఆజ్ఞాపూర్వకస్వరముతో—"నాతో వేళాకోళము లాడఁదలఁచుచుంటివా? ఎత్తు—రెండవదిగూడ!—" అనిపలికెను. ఆసమ యమున సర్కారు హఠాత్తుగా—గోవిందరావు చేతిలోని తుపాకి త్రుళ్లిపడునట్లొక బలమైనదెబ్బఁగొట్టెను! ఆయాఘాతమున కది గవాక్ష మార్గమున సోపానములపైఁబడీ ప్రేలెను! వ్యవహారమిఁక—శాంతపరిస్థి తులందు లేదనియు, సర్కారుతో తనకొకయుద్ధము జరుగనున్నదనియు నిరూపకుఁడు స్థిరపఱచుకొనెను!

వారిరువురును సమానబలముగల ప్రతిస్పర్థులు! ఐనను—ఆబల హీనస్థితిలో సర్కారునుజయించుట తనకసాధ్యముగునేమోయని గోవిం దరావు తలఁచెను! యుద్ధమునకు సిద్ధమగుటలో—సర్కారు సాహసమున కంతములేదు! అతనిశరీరము—ఉక్కుతోఁ జేయఁబడినది! వెంటనే— వారిరువురకును ప్రచండమగు—ముష్టియుద్ధము ప్రారంభమయ్యెను! కను వెలుతురులోనున్న—ఆమందిరమంతయు వారియుద్ధమునకు ఊఁగి, కంపించిపోవుచుండెను! ఆనాటియుద్ధము కేవలము జీవన్మరణసమస్యగా నుండెను! గోవిందరావు చేతులలో బంధింపఁబడుట చావుకన్న హీనమని

తలంచి సర్కారు ఆనాడు తాను చచ్చుటయో—డెటెక్టివును చంపుటయో రెండే కార్యములని తెగించి తలపడెను! ఎట్లైనను ఆనాడు గోవిందరావునుచంపి, యాయమూల్యనిక్షేపమును గ్రహింపవలయునని కృతనిశ్చయుఁడై యుండెను!—ఇద్దఱును ఒకరినిమించిన ప్రతాపముతో—నొకరు పోరాడుచు—క్రిందుమీఁదులగుచు—జయాపజయములలో దేనికిని స్థిరత్వము నొసంగకుండిరి! ఆసంఘర్షణమున—గోవిందరావొకబల్లపైఁబడి సర్కారుముష్టిఘాతముల ననేకములను సహించెను! కాని, వెంటనే—తగినయవకాశమునుగైకొని వడ్డితోఁగూడ సర్కారు ఋణమును తీర్చివేసెను! ఇంకను వారిరువురును, ఆకొన్న శార్దూలములవలె కలహించుచునేయుండిరి!—ఇంతలో బయటద్వారము నెవ్వరో తట్టుచున్నధ్వని వినఁబడెను. బయట ధ్వనియగుచున్నకొలఁదియు సర్కారు సాహస ముద్రేకించెను. తలుపులు తెఱచుకొని క్రొత్తవారు లోనికి రాకముందే అతిరయమున డెటెక్టివునుహతమార్చి నిక్షేపముతో పలాయితుఁడు కావలయునని యాతనికోరిక! కాని గోవిందరావు—తాత్కాలికముగ కొంతకాలము గడిపినచో క్షేమముగలుగఁగలదని తలఁచుచుండెను! బయటఁబడియున్న రివాల్వరులను—లోపలనుండి వినఁబడుచున్న కోలాహలములను గుర్తించి—పోలీసువా రెవ్వరైనను లోనికి రాకపోరని ఆతనియాశ! పోరాడుచునే గోవిందరావు ఉచ్చైస్స్వరముతో "తలుపులు బ్రద్దలుచేయుఁడు! లోనికిరండు!" అని కేకవేసెను! తరువాత నుభయుల ప్రచండమైన కలహము సంపూర్ణమైన రెండునిమిషముల కాలముపట్టెను. ఆస్థితిలో రెండునిమిషముల ముష్టియుద్ధమనఁగా నెంత ప్రమాదకరమైయుండునో—అనుభవజ్ఞుఁడైన ముష్టియుద్ధ చతురునకుమాత్రమే! తెలియఁదగిన విషయము! గదియంతయు రక్తప్రవాహమయమయ్యెను! సర్కారు గోవిందరావుల వస్త్రములును శరీరములును రక్తముచే నిండి భయంకరములుగానుండెను.

ఇంతలో క్రిందికోలాహలము వెనుకటికన్న—నతిశయించిపోయెను. క్రిందనున్న మనుష్యులకు గోవిందరావు కేకవినఁబడెను. అంతట వారొక గొడ్డలిని సంపాదించి తన్మూలమున కవాటభేదన మొనరింపసాగిరి! ఎట్ట కేలకు ద్వారము బ్రద్దలయ్యెను! కొందఱు పురుషులు దడదడ లోపలఁ బ్రవేశించిరి! వారు మేడమెట్లెక్కుచున్నధ్వని వినఁబడుచున్నకొలఁదియు—డెటెక్టివునకు ప్రోత్సాహమును సర్కారునకు నిరుత్సాహమును ప్రబలఁజొడఁగెను. పదధ్వని మఱింత సమీపించెను. డెటెక్టివు—"రండు! రండు!"అని కేకలువేయుచుండెను. సర్కారు పరిపూర్ణనిరాశాహతుఁడై గవాక్షమునకు బిగింపఁబడియున్న అద్దమును కాగితమువలె—భేదించి చించుకొని క్రింది దొడ్డిలోనికి దూకెను. ఫెళఫెళారావములతో అద్దము భిన్నభిన్నములై పోయెను. సర్కారు శరీరమంతయు అద్దపుపెంకులవలన చీరుకొనిపోయి—రక్తప్రవాహములుకారుచుండెను! భృగురాముని పతనమున అద్దము బ్రద్దలై పోయిన ఆగవాక్షమార్గముననే గోవిందరావును అతని ననుసరించియే తానుగూడ దొడ్డిలోనికి దూకెను. వారిరువురును సుమారు ఏఁబదియడుఁగుల ఎత్తునుండి క్రిందికిదూఁకిరి! గోవిందరావు దూకునప్పటికే—మొదటదూకిన సర్కారు శరీరమును దులుపుకొని మఱల సగమునఱకులేచెను!—అతనిపైకి గోవిందరావు డీకొనవచ్చుచుండెను. ఈస్థితిలో—నెవ్వఁడో యొకపురుషుఁడు—వెనుకనుండివచ్చి గోవిందరావు మెడపట్టీని గట్టిగఁబట్టుకొని "ఎట్లైననేమి? తుదకు మాచేతఁబడితివి!" అని పలికెను. ఇంకొక డింతలోవచ్చి గోవిందరావుచేతులను వెనుకకు విఱచికట్టెను!—వారిరువురును పోలీసుఉద్యోగులు!—

సర్కారు కొంత బలముఁదెచ్చుకొని లేచి నిలువఁబడెను. కాని వానిపాదములు బలహీనతచేతను పతనశ్రమచేతను గడగడ వణకుచుండెను! గోవిందరావు ఆయాసమువలన రొజుచుండెను. త్రివిక్రమ భవనమునం దానాఁడెల్ల నాతఁడు చాల శ్రమపడియుండెను. తరువాత సర్కారుతో అసామాన్యమును, ప్రాణాపాయకరమును నగు యుద్ధము

చేసియుండెను. ఇన్నిటికన్న నధికముగ కత్తులవంటి అద్దపుపెంకుల గవాక్షమున ఏఁబది యడుగుల ఎత్తునుండి క్రిందికురికియుండెను! తన్ను బంధించినవారితో అతఁడు కొంతసేపటివఱకును మాటాడఁజాలక పోయెను. కొంతసేపటి కాతఁడు వారికి సర్కారును జూపి—"ఆ మనుష్యు నాటంకపరుపుఁడు! వాఁడు భృగురాముఁడు! గజదొంగ!" అని పలికెను.

పోలీసుఉద్యోగులలో నొకఁడు "వాని విషయమై నీ వాందోళన పడనక్కఱలేదులే! అది యంతయు మేము చూచుకొనఁగలము! వాని కన్న నీవే మాకు ముఖ్యమైనవాఁడవు!" అని పలికెను.

ఆశ్చర్యముతో గోవిందరావు—ఆ పోలీసువాని మొగముఁ జూచెను.

గోవిం—నీవు పొరబడుచున్నావు! నేను డెటెక్టివు గోవిందరావును.

పోలీ—(నవ్వుచు) అబ్బా! అటులనా?— నాకంటికట్లు కనఁబడుట లేదేమిః?

ఈ చిత్రసంభాషణము సర్కారుకు వినోదము గల్గించెను. అతఁడు విషపునవ్వు నవ్వి భుజము లెగురవేసెను! సర్కారు తనకు పూర్వపు శక్తి సమర్థతలు వచ్చుటకై—సర్వశక్తులను కూడదీసికొనుచుండెను. అదే తరుణమని వాఁడు పోలీసువారిం జూచి ధైర్యముతో—"వాఁడు ప్రతాపుఁడను హంతకుఁడు! వీనిపై నేనిప్పుడు నేరారోపణముచేయఁ దలఁచుకొన్నాను! నాకొక బండిని తెప్పించిపెట్టుఁడు!" అని పలికెను.

ఇట్లనుచు—చక చక నడచి సర్కారు ద్వారమును సమీపించెను. గోవిందరావు ఉద్రేకముతో—చప్పట్లు చరచుచు "మూర్ఖులారా! వాఁడు పారిపోవుచున్నాఁడు! పోనీయవద్దు! త్వరగా పట్టుకొనుఁడు!" అని యరచెను.

గోవిందరావు చేతినిపట్టుకొనిన పోలీసుభటుఁడు రెండవానివంక దిరిగి "నేను భృగురాముని పట్టుకొందును. నీవు వీనిని సమర్థించుకొనఁ

గలవా?" అని యడిగెను. కాని ఆరెండవవాని కంత ధైర్యము లేక పోయెను. వాఁడు పెదవి చప్పరించి "చెప్పజాలను. వీనిని చూడగా మంచి గుఱ్ఱమువలె బలిసియున్నాఁడు! నీవుకూడ వీనిదగ్గఱ నుండవలెను. వానిసంగతి తరువాత చూచుకొందములే!" అని పలికెను.

వారి మూఢప్రసంగమును విన్నకొలఁదియు గోవిందరావు శరీరము మండుకొనిపోవుచుండెను. అట్టి సమయమున సాహసముచేయక గప్పదని యాతఁడు తన్ను కనిపెట్టియున్న యిద్దఱు పోలీసుభటులకును రెండు ముష్టిప్రహారములను ప్రసాదించి తాను భృగురాముని వెంబడించెను. భటులు గంద్రగోళపడి యీలపై ఈలగా నొక డజనుసారులు ఊదిరి. ఆ ప్రమాదసూచనమును విని మఱియొకభటుఁ డచ్చటికి వచ్చెను! ఈ లోపల బయటి యిద్దఱునువచ్చి గోవిందరావును పట్టుకొనిరి. గోవిందరావు ప్రాణమువిసిగి—"మీరు శుద్ధమూర్ఖులవలె నున్నారు. నేను ప్రతాపుఁడనుగాను. ఆవేషముతోనున్న గోవిందరావును. నేను పారిపోను. పారిపోవుచున్న సర్కారును ముందు బంధింపుఁడు!" అని పలికెను. అప్పటికిని వారికి నమ్మకము గలుగలేదు. తుదకు—ఇద్దఱు గోవిందరావు కడ నుండగా మూఁడవవాఁడు సర్కారునెదిరించి బంధించెను. పది సంవత్సరములనుండియు గోవిందరావునకుగల యభిలాష తీరెను. అప్పు డాతఁడు సంతోషముతో పెద్దనిట్టూర్పు విడిచెను. ఇంతలో—ఆప్రక్క నుండి యెచటికో పోవుచున్న అద్దెకారును పిలిచి దానిలో నందఱును కూర్చుండిరి. అప్పుడు గోవిందరావు ఆయింటిమేఁడగదిలోనున్న సంచుల మాటఁజెప్పి వానిని తెప్పించి కారులో నుంచెను. కారు పోలీసుస్టేషను వంకకు నడచెను.

స్టేషనుకు చేరినపిదప—గోవిందరావు ఒక అద్దమును నీళ్ళను ఒక తువ్వాలును కావలెనని యడిగి మొగమునకు పూసికొనిన రంగునంతను తుడిచివేయసాగెను. కాని యాపని కడు ప్రయాస సాధ్యమయ్యెను. భృగురామునితో నతనికి జఱిగిన యుద్ధమున మొగమంతయు గాయ

ములై యుండుటచేత రంగుతుడువ ప్రయత్నించిన ప్రతిచోటను గాయములు రేగి రక్తము స్రవించుచుండెను. తుదకు కొంత ప్రయాసము మీఁద రంగు వదలిపోయి గోవిందరాయాకృతి బయల్పడి వారి నందఱను విభ్రాంతులనుగా నొనరించెను. ఇదివరలో భ్రమపడి యెదిరించిన భటు లిప్పుడు గోవిందరావును క్షమార్పణ వేఁడుకొనిరి! గోవిందరావు వారిని క్షమించి—

"ఈ సర్కారును జాగ్రత్తగా కనిపెట్టి యుండవలెను. అదిగాక ఇప్పుడు నావెంట సమర్థులగు నిరువురు భటులు రావలసియున్నది! ఈ ప్రమాదమంతయు ఘటిల్లిన యింటికి ఘటియొకసారి వెళ్ళవలెను" అనియెను.

స్టేషను సార్జెంటు ఆశ్చర్యముతో గోవిందరావునుచూచి "గోవిందరావుగారూ? అచ్చట నింకేమియున్నది?" అని యడిగెను.

గోవిం—మనము త్వరపడి వెళ్లినయెడల ఈచీట్లపేక హత్యలకు సంబంధించిన సూత్రధారు నాయింటిలోనే పట్టుకొనగలమని నా నమ్మకము!—

సార్జెంటు మహానందముతో—పెద్దనవ్వు నవ్వి—"ఓ!—నేడెంత సుదినము! మొదట సర్కారును తరువాత చీట్లపేక హంతకునిఁగూడ బంధించు నదృష్టమా?—మీ వెంట ఇద్దఱుగాదు పదిమందిని గొనిపొండు! నేనిప్పుడే ఈ వార్తనంతను ఇన్స్పెక్టరు సింగుగారికి తెలియజేసెదను. వారు సంతోషింతురు!" అని పలికెను.



# పదునేడవ ప్రకరణము.

## గోవిందరాయని తుదియత్నము.

ఇద్దఱు పోలీసుభటులతోసహా — గోవిందరావు సత్యనారాయణ పురమునందలి గూఢమందిరపు పడకగదులలో నొకదానియందు, మూఁడుగంటల కాలము వేచియుండెను. ఇదివఱకే సర్కారు వారి యురిత్రాటికి మెడతగుల్ప స్థిరపరుపఁబడిన యొకానొక భయంకరవ్యక్తి యొక్క పదధ్వని నాలకించుట కొఱకును అనంతరము వానితో ఘోర సంగ్రామ మొనర్చుట కొఱకును గోవిందరావిప్పుడు వేచియున్నాఁడు!

ముసుగువాఁడు తన తాళపుచెవులకొఱకు వెదకుకొని అవి యితరులచే ఉపయోగింపఁబడి యుండుననియు నిక్షేపము తస్కరింపఁబడి యుండుననియు తలంచి ఆందోళనపడియైన అధమము ఒక్కసారి యచ్చటికి రాకతప్పదని గోవిందరావు ఊహించెను. అప్పటికి పూర్తిగా చీఁకటి పడియుండినందునను — సాయంకాల మచ్చట జఱిగిన ఘోరసంగ్రామ చిహ్నములు గుర్తింపఁబడుటకై అచ్చట నొక వీధిలాంతరు స్తంభమైన లేకపోవుటచేతను — ఆవ్యక్తి — చీకటిలో సరిగా బోనులోనికి రాకపోడని గోవిందరావు గట్టిగా నమ్మియుండెను. కాని అపని జఱుగలేదు. ప్రతాపుఁడను పేరుతో చరించుచున్న ఆహంతకుఁడు గోవిందరావు తలదన్ను యుక్తిశాలియై యుండెను.

మూఁడుగంటల కాలము గడచిన పిదప — విసుగు జనింప గోవిందరావు — పాదరక్షలను వదలి మెల్లని నడకతో చీకటిలో క్రిందికి వచ్చెను. సింహద్వార సమీపమున అతనికాలి కొకకాగితము తగిలెను. ఆ కాగితము కవాటరంధ్రమార్గమున హంతకునిచే లోనికి విడువఁబడెనని గ్రహించి గోవిందరావు టార్చిలైటు వెల్గున చదివెను. అందలి అక్షరములు ముదరరంగు ఎఱ్ఱసిరాతో వ్రాయఁబడియుండెను.

"గోవిందరావు పత్తేదారుగారు తెలివిగలవారే! కాని అంతకన్న తెలివిగల హంతకుఁ డొకఁడు గలఁడు!" అని యా కాగితమున వ్రాయఁబడియుండెను!

గోవిందరావు యోచనాపూర్వకముగ కొంతసేపాచీటివంక పరికించి పిదప మేడమీఁది యిద్దఱు భటులను క్రిందికిఁబిలిచి—పాదరక్షలను ధరించి వీధిలోనికిఁ బోయెను. ఇంతలో నొక జట్కా యా మార్గమున రాగా ముగ్గురును దానినెక్కి—పోలీసుస్టేషనుకు తోలుమనిరి. బండి కొంతదూరము నడిచెను. అచ్చట డెటెక్టివు అకస్మాత్తుగ దానినుండి దిగి "కాన్‌స్టేబిల్స్! నేను మీవెంట ఇఁక నెంతోదూరము రాఁజాలను. దీనిపై మీరు స్టేషనుకువెళ్లి—జరిగిన సంగతిని ఇన్‌స్పెక్టరుగారి కెఱిఁగింపుఁడు!" అని పలికెను. తరువాత అతఁడు రోడ్డునదలి యొక ప్రక్క దారినిబట్టి యనేక మలుపులు తిరుగుచు—ఇండ్ల వెనుక తోటల కభిముఖుఁడయ్యెను. అచ్చట నాతఁడు చీఁకటిలో నదృశ్యుఁడై మఱల వెనుకకు దిరిగి—అడ్డుదారిని అతిరహస్యముగ వెనుకటి యింటికిఁ బోయెను. ఈసారి రాజమార్గమునఁ బ్రవేశింపక దొడ్డిదారిని ఇంటిలో బ్రవేశించి—మేడమెట్లపై వేచియుండెను.

ఒక పావుగంటకాలమైనను గడువకమున్నె—సింహద్వారపు అద్దములలోనుండి యొక మనుష్యాకారము గోవిందరావుకు గనఁబడెను. తలుపు తెరువఁబడెను. చీఁకటిలో నొక యాగంతుకుఁడు లోపలఁ బ్రవేశించి—మేడమెట్ల నెక్కుచుండెను. ఉద్దేశపూర్వకముగ చీఁకటిలోనచ్చి గోవిందరావు వానిని డీకొనెను. వెంటనే సంకులసమర మారంభమయ్యెను. మందిరము ప్రతిధ్వనించునట్లొక తుపాకి ప్రేలెను. ఇరువురిలో నొకఁడు "హా" అను నొక దీనారావ మొనరించి సోపానములనుండి క్రిందికి దొరలెను. గోవిందరావు వెంటనే తన జేబులోని తాటిని దీసి వానిని బలముగా బంధించి యా వ్యక్తిని భుజముపై నిడుకొని బయ

టకు మోసికొనివచ్చి కొన్నిగంటలకు పూర్వము తనకును సర్కారునకు యుద్ధము జఱిగినచోట పచ్చికపైఁ బరుండఁబెట్టెను.

శీతలమారుతము హాయిగా వీచుచున్నందున ఆ వ్యక్తికి తెలివి గల్గెను. వాఁడు కన్నులను దెఱచి పండ్లు పటపట కొఱుకుచు కఠోర స్వరమున—

"నీవు నీజన్మమధ్యమున నన్ను పట్టుకొనఁగలవని నే ననుకొనలేదు. ఇంతకును నావిధి యిట్లున్నది?" అని గర్జించెను! గోవిందరావు చిఱునవ్వు నవ్వి—

"నీవు తెలివిగలవాఁడవే కాని నీవనినట్లు నీదుర్విధి నీచేత తుదకిట్టి తెలివితక్కువపని చేయించినది! నీవు వ్రాసి యాయింటఁ బారవేసిన నీ చీటియే నిన్ను పట్టియిచ్చినది! నాకు ఈయింటిలో సర్కారొకఁడు ప్రతిస్పర్థియై ఎదిరించియుండినందున నాకు వానితో పోరాడుటయే సరిపోయెను గాని సంచులను పూర్తిగా గుఱ్తించియుండనని తలంచి నీ వీయింటికి మరల రాకపోవని నేను స్థిరపరచుకొంటిని. నీ చీటిని చూచుకొని నేను హతాశుఁడనై స్టేషనుకు వెళ్లుటను నీవీ పరిసరములనుండియే చూచియుందువు. నే నరిగిన కొంతసేపటికి—నీ కృత్రిమవేషముకొఱకును, ప్రతాపుఁ డార్జించిచచ్చిన నిధనముకొఱకును పాపము ఆశపడి వచ్చితివి! ఎట్లైననేమిలే! పాపము బ్రద్దలుకాకపోదు. ధర్మమునకు జయమును అధర్మమున కపజయమును భగవన్నిర్ణీతములుగదా!" అని పలికెను.

గోవిందరావు ఖైదీని వెంటఁబెట్టుకొని అద్దెకారుమీఁద పోలీసుస్టేషనుకు చేరుసరికి అచ్చట ఇన్స్పెక్టరుసింగు సిద్ధముగనుండెను. సింగుకు ఖైదీనిచూపి గోవిందరావు గంభీరస్వరమున "మిత్రుఁడా! ఇన్నినాళ్లనుండియు మనలను కలవరపెట్టిన చీట్లవేక హంతకుఁ డితఁడే! తన జట్టులోనివారికే ఇతఁడు యమదూతయై సంచరించెను. ఈవ్యక్తిని నీవుకూడ నెఱుఁగుదువు; కాని ఈపేరుతోగాదు. వేఱుపేరుతో—"అని పలికెను.

సింగు—ఔను! ఇదివఱకెక్కడనో వీనిని చూచినట్లే తోఁచుచున్నది! కాని స్మృతికిరాకున్నది.

గోవిం—అదే వీనివద్దనున్న చిత్రము! అంతటిచమత్కారియైన నటుఁడు వీఁడు! వీఁడు చీట్లపేకహత్యలలో ఉరిదీయఁబడిన భైరవునిసేవకుఁడు. మతంగుఁడనువాఁడు!

సింగు—గోవిందరావుమాటలు విని నిజముగా విభ్రాంతుఁడై—మఱియొకసారి యాహంతకుని మొగముచూచు నభిలాషతో రెండడుగులు ముందుకువేసెను.

సింగు—నిజము! వీనిని నేను గొల్లపూడిఅడవిలోచూచితిని. వీనిప్రాణమును రక్షించితిని—మొగమునకు కొలదిపాటి రంగువేసుకొనుట వలన వీఁడు మాటిమాటికిని రూపభేదము నొందుచున్నాఁడు.

గోవిం—అవును. వీఁడొక తెలివిగల తుంటరి! కాని ఎంత తెలివిగలవాఁడైనను ఒక్కచేతిమీఁదుగా నాల్గుహత్యలనుచేసి భగవంతుని కన్నులలో దుమ్ముగొట్టఁగల్గునంతటి తెలివిగలవాఁడు మాత్రము కాఁజాలకపోయెను. వెనుక నొకసారి వీఁడు ఉద్దేశ్యపూర్వకముగ ఎలెక్ట్రికుబల్బు నొకదానినిబ్రద్దలుచేసియుండెను. అప్పుడే నేను వీని ననుమానించితిని. వీఁడు తన యజమానియగు భైరవునకైన ననుమానము గల్గనీయలేదు. భైరవ మరణానంతరమున వీఁడు తనకొంపమునిగినట్లు శోకములుపెట్టెను!

తరువాత—మతంగుఁడు తన వాఙ్మూలము నిచ్చెను.

"భైరవుఁడు విశ్వాసఘాతుకుఁడైన నీచుఁడు. వానికి ప్రతిక్రియ చేయుటకే నేను వానికడ నౌఖరుగాఁ జేరితిని. పాపము ప్రతాపుఁడు తనప్రాణమిత్రులని నమ్మిన నలువురిలో భైరవునకన్న పాపాత్ముఁడు విశ్వాసహీనుఁడు మఱియొకఁడులేఁడు. భైరవుని ప్రోత్సాహమున మిగతముగ్గురును ప్రతాపునకు ప్రతికూలసాక్ష్యములనిచ్చిరి. ప్రతాపుఁడు ఉరిదీయఁబడెను. ఉరిదీయఁబడుటకుముందు—చుట్టునుమూఁగిన జనులలోనున్న

నావంకకు ప్రతాపుఁడు దుఃఖాశ్రువులతోఁజూచెను. ఆ దృశ్యమును నేనెన్నటికిని మఱువఁజాలను. ప్రతాపుని జాలినించు చూపులలోనాకు— ఆజ్ఞయో ప్రార్థనయో స్ఫురించెను. ఆక్షణముననే ప్రతాపుని మృతికి— ప్రతాపునిపక్షమున ఘోరప్రతిక్రియ చేయుటకు నాలోనేను ప్రతిజ్ఞచేసి కొంటిని. అందరికన్న భైరవునిపై నాకధికశత్రుత్వముండెను. అందులకే వానిని అందఱికన్న తుదకు ఉరిదీసితిని. ప్రతాపుఁడు ఉరిదీయఁబడిన వేళ ఉదయము ఆఱుగంటలకాలము! ఆవేళకే ఈ విశ్వాసఘాతుకుల నొక్కరొక్కరినిగా—ప్రతాపునివలెనే ఉరిదీసితిని! సహజముగా ప్రతాపుఁడు ఏకాకియని ప్రతీతి! కాని నిజములో నాతఁడు పూర్తిగా ఏకాకి కాఁడు. నేనొకడ నతనికి పుత్రతుల్యుఁడనై యుంటిని. అతఁడు నన్ను— ఆకథలన్నియు నిప్పుడేల?—అనేకసందర్భములలో రక్షించియుండెను. ఆవిశ్వాసమే యిప్పటికిని నారక్తనాళములలోనున్నది! ప్రతాపుని నిక్షేప మంతయు—ఈకృతఘ్నుల కెఱుకలేకుండ ప్రతాపుఁడు నాసంరక్షణము నందుంచెను. ఎట్లైననేమి? తుదకు నాకోర్కెతీరినది! ప్రతాపున కాత్మశాంతిగల్గినది. ఇఁక నేను చచ్చినను బ్రదికినను ఒక్కటే—ఇంకొకసంగతి చెప్పమఱచితిని. ప్రతాపునిఆకృతి కృత్రిమవేషమువలన నాకు లభించినది! దస్తూరి అనుకరణమువలన అభ్యాసమైనది!అంతవఱకును సహజమే! కాని వ్రేలిముద్రయే మీకు సందేహకారణముగావచ్చును. కాని ఇది నావ్రేలుగాదు. ఇది ప్రతాపునివ్రేలు. ఉరిదీయఁబడుటకు నాల్గుదినములకు పూర్వ మాతని బొటనవ్రేలు ఒకానొక ప్రమాదకాలమున తలుపుసందున నిఱికి తెగిపోగా—ముందెన్నడైనఁ బనికివచ్చునని నే నా చర్మమునొలిచి ఆసంచిని నావ్రేలికి తొడిగియుంచుకొంటిని. గోవిందరావుగారూ! నేను చెప్పదలఁచినది పూర్తియైనది! ఈదృశ్యముంజూచియు—నావాఙ్మూలము నాలకించియు—అంతరాళమున నదిగో! ప్రతాపునియాత్మ నవ్వుచున్నది! తుదకు నాకే విజయము గల్గినది! గోవిందరావ్!ప్రతీకారమునుచేసి కృతకృత్యుఁడనైతిని! ఇఁక మీ కార్యములకు మీరుపక్రమింపవచ్చును!"

అనంతర మిఁక చెప్పవలసిన దేమున్నది? చీట్లపేకతో సంబంధించిన నాల్గు హత్యలను చేసినట్లు మతంగుఁడు తానే యొప్పుకొనుచున్నందున అతనికి ఉరిశిక్ష జఱిగిపోయెను. అనేక చౌర్యాపరాధములు మోపఁబడుటచేత భృగురామునకు పదిసంవత్సరముల కారాగృహశిక్ష విధింపఁబడెను.

*　　*　　*　　*　　*

ఈకథ జఱిగిన రెండు నెలలకు తరువాత నొకనాటి యుదయమున డెటెక్టివు గోవిందరావునాయఁడు తన స్వగ్రామమగు రాజమహేంద్రవరమునందలి యింటిలో తేనీరు సేవించుచుండ ఒక వార్తాపత్రికను చేతఁబట్టుకొని దత్తు ప్రవేశించి నమస్కరించెను.

గోవిం—దత్తూ! వార్తాపత్రిక ఈనాటిదేనా? మనకు సంబంధించిన విశేషమేమైనఁ గలదా యేమి?

దత్తు—గురూజీ!—ఎంత గజదొంగయో చూచితిరా? భృగురామ సర్కారు చెఱసాలనుండి తప్పించుకొని పోయినాఁడఁట!

గోవిం—(నవ్వుచు) మంచిది! అట్లయిన శీఘ్రకాలములోనే వీఁడు మఱల మనకు చేతినిండ పని గల్పించును లే!—




రామకృష్ణ ప్రింటింగువర్క్సు, తెనాలి.